# తెలుఁగు వాఙ్మయము

## సంగ్రహ చరిత్ర

సంకలనం :

శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి

రచయితలు :

శ్రీ గంటి జోగిసోమయాజి
శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి
శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి
శ్రీ విద్వాన్ విశ్వం
శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి




కవిరాజ పబ్లిషర్సు
తెనాలి :: సికింద్రాబాదు

First Edition : 5,000 Copies.
August 1960
Price : Rs. 3-25

# TELUGU VANGMAYAMU

## SANGRAHA CHARITRA

( A Short History of Telugu Literature )

*Compiler* :

**K. V. Gopalaswamy**

*Contributors* :

**G. J. Somayaji, K. Sriramamurthy, J. Chenna Reddi, Vidwan Viswam and K. V. Gopalaswamy.**



Published under the auspices of
THE SOUTHERN LANGUAGES BOOK TRUST, MADRAS
TELUGU—59

*Published by* :

KAVIRAJA PUBLISHERS
TENALI (H. O.)

*Printed at* :

**National Printing Press, Tenali.**

## అంకితము

బ్రహ్మర్షి సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడు,
రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు గార్లకు.

# పరిచయం

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణభాషా పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప జేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడభాషల లోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్నభిన్న అభిరుచులకు తగినట్లు ఈపుస్తకాలను శ్రద్ధగా ఎన్నికచేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవితచరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలూ వివరించే గ్రంథాలు ఈద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మనదేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంతగా ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించడానికి వారెన్నెన్ని పాట్లు పడినది ముందు తరాల వారంతా తెలుసుకొని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం—ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు. కథానికలు, ప్రాచీనకళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధ

వలు, నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేశాభాగా లను గురించిన గ్రంథాలు ఈపరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్నభిన్న విషయాలను గురించిన ఈగ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవని, ఆవిధంగా ఇట్టి ప్రచురణలకు ముందుముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారతదేశంలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథపరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువమందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తి పరచడానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అంద జేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణభాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

ఇట్లు,

ఎ. లక్ష్మణస్వామి ముదలియార్,
వైస్ ఛాన్సలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

మద్రాసు,
అక్టోబరు 7, 1958.

# ఉపోద్ఘాతము

దక్షిణ భాషాపుస్తక సంస్థవారి మరొక ప్రచురణ ఈ 'తెలుఁగు వాఙ్మయము' అనే సంకలన గ్రంథం. ఇది సమగ్రమైన తెలుగు వాఙ్మయ చరిత్రకి సంగ్రహరూపమైన వ్యాసాల సంపుటి.

అసలు వాఙ్మయచరిత్ర అనేది ఆధునికరచన. పలువు రీ ప్రయత్నం చేశారు. చేస్తున్నారు. ఇంకా చేయాలికూడా. ఇదివరకటి వాఙ్మయ చరిత్రలలో ఆధునికయుగం అంతగా చర్చించబడలేదు. ఇప్పుడీ 'తెలుఁగు వాఙ్మయము' ఆవిర్భావం మొదలు అద్యతనకాలం వరకూ ఉద్దేశింపబడింది. పైగా సాధ్యమైనంతవరకు సామాన్య జనతకి అందు బాటులో వుండాలని ఆశయం.

సమగ్రమైన తెలుగు వాఙ్మయ చరిత్రను సంగ్రహరూపంలో అందివ్వడానికి అయిదు ప్రకరణాలు అవసరమైనవి. ప్రక్రియాపరమైన భేద పరిణామాలూ, సాంస్కృతిక వికాసాలూ, చారిత్రక నైపథ్యాలు కొంత వివరంగా చెప్పడానికి వీలవుతుందనీ, అయిదు ప్రకరణాలు అయిదుగురిచేత వ్రాయించడం వల్ల ప్రతిభాగంలోని ప్రతి ముఖ్యవిశేషం ప్రధానంగా తెల్పడం సాధ్యమవుతుందనీ మాత్రమే అయిదు ప్రకరణాల విభాగం.

మొదటి ప్రకరణం ప్రాచీనాంధ్ర వాఙ్మయం. ఇందు ప్రధానంగా రెండు అంతరాలున్నాయి. ఒకటి, నన్నయకు పూర్వకాలము. రెండు, నన్నయనుండి నన్నయ తరువాతికాలము. నన్నయకు పూర్వం తెలుగు వాఙ్మయానికి ఒక స్వరూపం లేదు. అందదుకులే. ఏవో పదాలు, మరేవో శాసనాల్లోని పద్యాలు మాత్రమే ఈ యుగంలోని విశేషం. అప్పటికి భాషే ఆరంభస్థితిలో వుంది. క్రమంగా పరిణామ వికాసాలు కలిగి ఒక వ్యవస్థ భాషాపరంగా ఏర్పడటంతో వాఙ్మయం గ్రంథరూపాన

రాసాగింది. అలా వచ్చిన మొదటి వాఙ్మయగ్రంథం నన్నయ భారతమే. నన్నయభట్టు నాందీవాక్యంతో తెలుగువాఙ్మయం తేజరిల్ల సాగింది. నన్నయ మొదలు నవ్యయుగం వరకు తెలుగు వాఙ్మయం యొక్క ప్రధానలక్షణం సంస్కృత వాఙ్మయ సాన్నిహిత్యమే. కొంతవరకు ప్రాకృత వాఙ్మయ పరిచయంకూడాను. ప్రాచీనాంధ్ర వాఙ్మయం ప్రధానలక్షణ మిదే.

ఇంక రెండవ ప్రకరణం దక్షిణాంధ్రయుగ వాఙ్మయం. ఇది నిజానికి ఒక ప్రత్యేకయుగం కాదు. తెలుగు వాఙ్మయంలో ప్రధానంగా రెండే రెండు యుగాలు. ఒకటి పూర్వయుగం. రెండు నవ్యయుగం. సంస్కృత ప్రాకృత సాహిత్య సంపర్కం పూర్వయుగానిక, పాశ్చాత్య సాహిత్యాల సంపర్కం నవ్యయుగానికీ ప్రధాన లక్షణాలు. అటువంటి పూర్వయుగంలోని అవాంతర విభాగమే దక్షిణాంధ్రయుగం. స్థల భేదంతోపాటు కొంత సాహిత్య వైలక్షణ్యమూ తన్నిమిత్తం.

ఇతర ప్రకరణాలు నవ్యయుగంలోని ప్రధాన వాఙ్మయశాఖలు. ఈ మూడు ప్రకరణాలూ కలిసి నవ్యయుగం. పాశ్చాత్య సాహిత్య ప్రభావం ఈ నవ్యయుగానికి గల సార్థక్యమూ, ప్రాధాన్యమూకూడా, నవ్యయుగ వాఙ్మయంలో అనేక నూతన ప్రక్రియలు విశేషం. ఆ ప్రక్రియలన్నీ ప్రధాన విభాగమైన వచనశాఖ, కవిత్వశాఖ, నాటక శాఖలలో గతార్థాలే. ఈ మూడు శాఖలూ మూడు ప్రకరణాలు. ఇలా అయిదు ప్రకరణాల విభాగం ప్రాధాన్య వివక్ష మాత్రమే.

సమష్టిపై నిది, సమగ్రమైన ఆంధ్రసాహిత్య చరిత్రకు సంగ్రహ రూపం. ఇది వాఙ్మయచరిత్రయే కాని, కవుల జీవితాలూ, కావ్యాల విమర్శా కాదు. వాఙ్మయక్రమ వికాసం ప్రతిఫలించేలా, ప్రక్రియా, సాంస్కృతిక పరిణామాది విశేషాలతో కొందరు ముఖ్యకవుల గురించి

కొంత వివరించడం ప్రతి వాఙ్మయచరిత్రకూ ప్రధాన కర్తవ్యం. వాఙ్మయ వికాసానికి కారకులుకాని కొందరు కవుల్ని విడిచిపెట్టడం కూడా సంభవమే. ఏ వాఙ్మయచరిత్రకూ ఇది అపరిహార్యమే. అలాగే ఈ సంకలనంకూడా సమగ్రమైన తెలుగు వాఙ్మయానికి సంగ్రహరూపమైన సాహిత్య చరిత్ర. కవుల కాలనిర్ణయం అభిప్రాయ భేదంతో కూడివుండటంచేత ఏదో ఒక మార్గాన్ని అనుసరించి సంవత్సరసంఖ్య స్థూలంగా నిరూపించడమైనది.

ఈ సంకలన ప్రయత్నంలో అమూల్యమైన సలహాలొసగిన ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజికి, అనేకవిధాల సహకరించిన శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తికి నా కృతజ్ఞతాభివాదాలు.

ఆంధ్రవిశ్వవిద్యాలయము,
వాల్తేరు,
ది. 16-3-1958.

కూర్మా వేణుగోపాలస్వామి.

## ఈ సంపుటిలో రచయితలు :

### ఆచార్య శ్రీ గంటి జోగిసోమయాజి

తెలుఁగు ప్రొఫెసరు - ఆంధ్రాయూనివర్సిటీ.

"కాళిదాసు"-(విమర్శన), "మేఘసందేశము"-(ఆంగ్ల వ్యాఖ్యానము), "ద్రావిడభాషలు", "ఆంధ్రభాషావికాసము" -(భాషాశాస్త్ర గ్రంథములు), "బసవచరిత్ర" (పద్యకావ్యము), "రామచంద్రుని హంపీ యాత్ర" - (యాత్రాకావ్యము), "ధర్మసామ్రాజ్యము" (చారిత్రక నవల) మొ॥ ప్రసిద్ధ రచనలు. ప్రకృతరచన-"ప్రాచీనాంధ్ర వాఙ్మయము"-అను వ్యాసము.

### శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

తెలుఁగు లెక్చరరు - ఆంధ్ర యూనివర్సిటీ.

"చిత్రశాల" (చారిత్రక నవల), "సమత", "నటన" (సాంఘిక నాటకములు) ప్రసిద్ధ రచనలు. "నవభావన" - (ఖండకావ్యము), "గుడిగోపురం" - (కథల సంపుటి) - "తెనుఁగు వచనము" - (పరిశోధక గ్రంథము) మొ॥ ఇతర రచనలు. ప్రకృత రచన - "దక్షిణాంధ్రయుగ వాఙ్మయము" - అను వ్యాసము.

### శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి

తెలుఁగు లెక్చరరు - వేంకటేశ్వర యూనివర్సిటీ.

"మకుట భంగము" - "దక్షిణతార"-(నవలలు), "ప్రెసిడెంటు"-(వ్యంగ్యనాటకము) మొ॥ ప్రసిద్ధ రచనలు. ప్రకృత రచన - "ఆధునిక గద్య వాఙ్మయము" - అను వ్యాసము.

## శ్రీ విద్వాన్ విశ్వం

### ఆంధ్రజ్యోతి అసిస్టెంట్ ఎడిటర్.

"పెన్నేటిపాట" – (అతినవ్యకావ్యము) అతి ప్రసిద్ధ రచన. "మానవుడు" – (నవల), "మత్తవిలాస ప్రహసనము" – (ప్రహసనము)– అమూల్యమైన అనువాద రచనలు. పత్రికా వ్యాసములు మొ॥ ఇతర రచనలు. ప్రకృత రచన – "నవ్యకవిత్వం" – అను వ్యాసము.

## శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి

### రిజిస్ట్రార్ – ఆంధ్ర యూనివర్సిటీ.

శ్రీమతి కూర్మా శేషుబాయితో సంయుక్త రచన కథలు. నాటకవ్యాసములు ప్రత్యేక రచన. కేంద్రప్రభుత్వం ప్రచురించిన భారతీయనాటక గ్రంథములోని "ఆంధ్రనాటక" వ్యాసము ప్రసిద్ధ రచన. ప్రకృత రచన – "తెలుఁగు నాటకాలు" – అను వ్యాసము.

# విషయ విభాగము : రచయితలు

# ప్రాచీనాంధ్ర వాఙ్మయము

## ఆచార్య శ్రీ విద్వాన్ గంటి జోగిసోమయాజి



నాటకములు, నవలలు, పద్యకావ్యములు, వచన కావ్యములు, వ్యాసములు, విమర్శనలు, హాస్యరచనములు, గేయములు మొదలయిన వివిధ జాతుల రచనలతో గూడిన నేటి తెలుగు వాఙ్మయము తెలుగువారి కందరికిని పరిచిత ముగానున్నది. నేడు పయి జాతుల గ్రంథము లనేకములుగా వివిధ రచయితలు వెలయించుచున్నారు. అందుత్తమము లయినవి పాఠకుల మెప్పును బడసి చిరస్థాయిగా రాబోవు వారికి సంక్రమించుచు వాఙ్మయ మనబడుచున్నవి. ఒక భాషలోని యుత్తమములయిన రచనల సమూహమును మనము వాఙ్మయ మనుచున్నాము. సుమారు 11 వ శతాబ్దమునుండి యిప్పటివఱకును గల మహాకవుల రచనల సమూహమే మన తెలుగు వాఙ్మయము. ఈ వాఙ్మయము కాలక్రమమునఁ బెరిగినది. పదునొకండవ శతాబ్దమునకు ముందు గ్రంథములు మనకు నేఁడు లభింపవు. ఉన్నవని చెప్పుటకు నాధారములుగూడ లేవనవచ్చును. మఱికొంత వెనుకకు బోయినచో తెనుఁగు భాష యొక్క యునికియే సందేహాస్పదమయినట్లు తోచుచున్నది.

క్రీస్తుపూర్వము ప్రథమ శతాబ్దమునకు ముందు తెలుగు భాష యుండెనట్లు ప్రత్యక్ష నిదర్శనములు లేవుగాని

వ్యవహారములో నుండినట్లు మాత్రము నిశ్చయముగా నూహింపవచ్చును. తరువాతి రాజులు వేయించిన శిలాశాసనములు, దానములు చేసినప్పుడు వ్రాయించిన రాగిరేకుల శాసనములు నేఁడు కొన్ని లభించుచున్నవి. తెనుఁగునాట దొరకిన యిట్టి శాసనములలోని భాష సంస్కృతము లేక ప్రాకృతము. అనగా నాటి రాజు లాదరించిన భాషలు ఈ రెండును ననవచ్చును. తెనుఁ గున్నదా లేదా యను సందేహ మేర్పడుచున్నది. కాని అట్టి శాసనములలోని పదములను పరిశీలించినచో తెలుఁగుండినట్లు నిదర్శనములు కనుపట్టుచున్నవి. మనవాడుకలో నున్న తెనుఁగులో అనేకములయిన సంస్కృత పదములు చేరియున్నవి. ఆ పదములకును స్వతస్సిద్ధములయిన తెనుఁగు పదములకును భేదము స్పష్టముగా తెలియుచుండును. ఆ కాలమునను ఈ దేశములో ప్రజలు తమ నిత్యజీవనములో వాడుచుండిన భాష తెలుఁగే యగుటవలన నట్టి తెలుఁగు మాటలతోనే మనుష్యుల పేళ్ళును, ఊళ్ళపేళ్ళును చాలవఱకు నుండినవి. కొన్ని గ్రామనామములు సంస్కృతమునను, ప్రాకృతమునను గూడ నుండియుండినవి. నేటి మనదేశములో వాడుకలోనున్న పేళ్ళు నట్లేయున్నవి.

పయిని జెప్పిన రాజశాసనములు సాధారణముగా రాజులు చేసిన దానములకు సంబంధించినవి. ఇందు దాన మిచ్చిన గ్రామముల పేళ్లు దానమును గ్రహించిన మనుష్యుల పేళ్లును చెప్పక తప్పదుగదా. అట్టి పేళ్లు గూడ కొన్ని, నేటి వలెనే, సంస్కృతముననే యుండెడివి. విశ్వేశ్వరరావు, శ్రీని

వాసుడు, ధర్మరాజు మొదలయినవి సంస్కృతపు పేళ్లు. అచ్చన్న, రామక్క, అప్పడు, దాలెప్ప, వెంటయ్య మొద లయినవి తెనుఁగుపేళ్లు. అట్లే సింహాచలము, రాజమహేంద్ర వరము, యాదవగిరి మొదలయినవి సంస్కృతపుపేళ్లు. నెల్లూరు. ఆదుట్టు, వెంటపాడు, గుంటూరు మొదలయినవి తెనుఁగు పేళ్లు. ఈ రెండు జాతుల శబ్దములకు గల భేదమును చాల వఱకు స్పష్టముగా తెలుగనగును. వానిని గుర్తించుటయు సులభమే. తెనుఁగు సామాన్య జనుల భాష. సంస్కృతము, ప్రాకృతము అను రెండు భాషలును, రాజులు, పండితులు, మతకర్తలు వాడుచుండినవి. గ్రామ నామములు, మనుష్య నామములును ప్రజలు కల్పించుకొని పెట్టుకొన్నవే. అట్టి పేళ్లు దేశములో వాడుకలో నుండగా వానిని సంస్కృతము లోనికి గాని, ప్రాకృతములోనికి గాని మార్చి వ్రాసినచో అవి యర్థము కాక యే గ్రామము, ఏ పురుషుడు ఉద్దేశింప బడిరో తెలియక శాసనముయొక్క ప్రయోజనము సిద్ధింపదు. కాబట్టి శాసనములలో కొన్నియయినను తెనుఁగు శబ్దములు ఆనాటి శాసనకర్తలు వాడక తప్పినదికాదు. కాబట్టి ఆనాటి శాసనములను మనము పరిశీలించినచో లభించిన అట్టి తెనుఁగు పదములనుబట్టి తెనుఁగుభాష దేశమునం దంతటను వాడుకలో నుండినదని సిద్ధాంతము చేయకతప్పదు.

దేశమునం దంతటను తెనుఁగే వాడుకలో నుండి నప్పుడు తెనుగులో వారు శాసనములు వ్రాయలేదేల యని మన మడుగవచ్చును. సంస్కృతము, ప్రాకృతము, రాజా దరణమును పొంది, మతకర్తల ప్రోత్సాహము గలిగి,

పండితుల వాడుకలో నుండియుండుటయే దానికి హేతువు. తెనుఁగును జనులు ప్రతిదినమును ఇచ్చి పుచ్చుకొనుచోటను, వ్యాపారమునందును, ఇంట మాటడుకొనునప్పుడును వాడు కొనుచుండిరని యూహింపవచ్చును. రాజులు సభలలో ప్రసంగించునప్పుడును, తమ లిఖితములు వ్రాయించుటలోను, పండితులు గ్రంథములు వ్రాయుటలోను, దేవాలయముల లోను మఠములయందును మతగురువులు పూజించుట బోధించుట మొదలగువానియందును, సంస్కృతము గాని ప్రాకృతము గాని వాడుచుండిరి. తెనుఁగునకు ఆ కార్య ములయందు ప్రవేశము లేకుండెను. ఆనాటి తెనుఁగునందు అధికముగా పదజాలము చేరియుండలేదు. ఈనాఁడు ఉన్నత ములైన పాశ్చాత్య శాస్త్రములను బోధించుటకు గాని, క్రొత్త క్రొత్త శాస్త్ర పరిశోధనలలో గ్రంథములను వ్రాయు టకుగాని నేటి తెనుఁగులో నెట్లు వీలుతక్కువగానున్నదో అట్లే నాటి తెనుఁగు నందు ఆనాటి కావ్యములు, మత గ్రంథ ములు వ్రాయుటకు వీలు లేకుండెనని యూహింపవచ్చును.

ఇకనానాడు తెనుఁగు ఉండెనా లేదాయని యూహించు టకు సంస్కృత ప్రాకృత శాసనములే యాధారముగా నున్న వని ముందే చెప్పబడినది. అట్టి శాసనములయినను చాల తక్కువగా నున్నవి. అట్టి శాసనములను పరిశీలించినచో నందున్న పదములలో పాలు, పెరుగు, కట్టెలు, ఉప్పు మొద లగు వాడుక వస్తువులకుగూడ తెనుఁగుపేళ్లు వాడక, ప్రాకృత శాసనములు గావున వానియందు ప్రాకృత పదములయిన దూధ, దహి, కాట్ఠ, లోణ మొదలయినవే వాడబడినవి.

క్రీ. శ. ఏడవ శతాబ్ది వఱకు గల కాలములో రచింపబడి నేడు మనకు లభించిన సంస్కృత ప్రాకృత శాసనములలో పయిరీతి పదములు గాక పరిశీలించి చూడగా నీ క్రింది గ్రామ నామములు కనుపట్టినవి. "విరిపఱ, పాండూర, కూడూర, చిల్లరెక, కొలవాల, దాలూర, తాంటికొంట, అంతుకూ్కర, ఒంగోడు, వేంగీ, ఏలూరు, కురవక, మూలకుర, అఱుతొాఱ, ముణ్డూర, చెంచెఱువ, కంబురాంచెఱువ, చిన్నపుర, దెందులూర, నఱాచేడు, కడాకుదురు, పెణుకుపఱ్ఱు, పేరువాడ" ఇవి యన్నియు తెనుఁగు పదములే. సంస్కృత పదములు కావు. ఈ పేళ్లు గల గ్రామములలో ననేకములు నేటికిని ఉన్నవి. ఆ పేళ్లు కొంచెము నేటికి మారియున్నవి. "విప్పర్తి, కూడూరు, చిల్లరిగె, దాలూరు, తాటికొండ, ఆతుకూరు, ఒంగోలు, చిన్నాపురము" అనునవి పయివానిలో కొన్నిటికి నేటి పేళ్లు. ఈ గ్రామము లన్నియు తెనుఁగు దేశములో నక్కడక్కడివి గాని యొక్క మూలవి గావు. అనఁగా నేటి తెనుఁగు దేశమునందంతటను తెనుఁగు పేళ్లు గ్రామ నామములుగా వాడుకలో నుండినవని స్పష్టపడుటచేత నప్పటికి తెనుఁగు సామాన్య జనుల వ్యవహారములో నుండె నని నిశ్చయింపక తప్పదు. కొన్ని సంస్కృత శాసనములలో తెనుఁగు పేళ్లను సంస్కృతములోనికి మార్చి వ్రాయు నాచారము గూడ నుండెడిది. 'చేంబ్రోలు' అను తెనుఁగు పేరిని 'తామ్రపురీ, శోణపురీ'యనియు, 'కొలను' గ్రామమును సారసపురీ యనియు మార్చిన యుదాహరణములు శాసనము లలో లభించుచున్నవి. కాని యీ పద్ధతిలో నొక గట్టి

చిక్కేర్పడుచున్నది. శోణపురీ అనగా ఎఱ్ఱని గ్రామము అని యర్థము. చేంబ్రోలు అను పదమునకు అదే యర్థము. కాని ఎఱ్ఱపాలెము, ఎఱ్ఱదుర్తి అను పేళ్లను శోణపురీ యను పదమునకు సమానార్థకములగుచున్నవి. పేళ్లను అట్లే అవి పుట్టిన భాషలో నున్నట్లే వాడవలెనుగాని యితర భాషల లోనికి అనువదింపరాదను చిక్కును మనస్సులో నుంచుకొని, పొలముపేళ్లు, వాని హద్దులు, వ్రాయునప్పుడును శాసన కర్తలు వాని నట్లేయుంచక తప్పినదికాదు. ఇట్టి పై పేళ్ళను బట్టి తెనుఁగు భాష వ్యవహారస్థముగా తెనుఁగు దేశమునం దంతటను నుండెననక తప్పదు గదా!

ఏడవ శతాబ్ది వఱకును తెనుఁగు భాషయొక్క యునికినే ఊహించవలసి వచ్చినపుడు ఆనాఁడు తెలుఁగులో నెట్టి వాఙ్మయ ముండెనో యని యూహించుట కాధార ములు లేవని చెప్పనక్కర లేదు.

వాఙ్మయ మనగా ఒక జాతి జనులు తమ భాషలో వెలయించిన యుత్తమ రచనల సమూహామే యనవచ్చునవవి స్పష్టపడినది. ఇక ఏడవ శతాబ్దికి ముందరి తెనుఁగున నుత్తమ రచనలే మున్నవనుటకు సమాధానమేమి? అది కేవలమూ హాసిద్ధమే. ఉత్తములయిన జనులు అనగా రాజులు, పండితులు, మతకర్తలు సంస్కృత ప్రాకృతములలో తమ రచనలను సాగించుటచేత తెనుఁగున రచనలు చేయువారే లేకుండి యుండవచ్చును. కాని యెంత అనాగరికులు మాటాడు భాషలను మనము నేడు పరిశీలించినను వారికి కొన్ని పాటలు, వర్ణనలు, వివాద రూపములయిన రచనలు

ధర్మములు, సామెతలు వాడుకలో కన్పట్టుచున్నవి. వీనిని బట్టి మన మాలోచింపగా ఆనాటి తెనుఁగునను ఇట్టివి యుండక తప్పదని యూహింపనగును. ఆ నాఁడు తెనుఁగు జనులు పంటకాలమున పాడుచుండిన పాటలు, పెళ్ళికాలమున గానము చేయుచుండిన గేయములు, పదిమంది పల్లెటూరి జనులు సాంఘికముగా గూడునపుడు చెప్పుకొనుచుండిన యుత్తమ భావములతో గూడిన సంవాదములు, సామెతలు, ఆనాటి వాఙ్మయ మనవచ్చును. మన భారతము రామాయణము మొదలయిన వానివంటి కావ్యములే వాఙ్మయ మనియు నితరము గాదనియు తలంచినచో ఆనాటికి వాఙ్మయమే లేదని చెప్పవలెను. కాని ఒక జాతి యొక్క ఆధ్యాత్మిక జీవనము, నైతికవృత్తి, ఆశలు, ఆనందము, ఆవేశము, సుఖదుఃఖములు, నాగరకత వీనిని తెలియజేయు రచనలే వాఙ్మయముయొక్క సారమని మన మంగీకరించినచో, ఎంతటి ప్రాథమిక స్థితిలో నుండినను, ఒకానొక జాతిలో నుండిన యా రచనలే యా నాటి వాఙ్మయముగా గ్రహింపక తప్పదు.

కాబట్టి తెనుఁగు వాడుచుండిన జనులు క్రీస్తు ప్రథమ శతాబ్దమునుండి పదునొకొండవ శతాబ్ది వఱకును ఎట్టి రచనలలో తమ హావభావములను తెలియపఱచుచు రసానుభూతి నందుచుండిరి అను ప్రశ్నకు సమాధానము రావలెను. దీనికి రెండు విధములయిన ఆధారములు గలవు. మనకు నేడు పరిచితములయి ప్రారంభావస్థలో నున్న యనేక భాషలు కలవు. వీనికి లిపి, గ్రంథరాజములు లేకపోయినను ఏదోవిధ

మైన వాఙ్మయ మున్నదని మన మనుకొనుచున్నాము. అట్టి వాఙ్మయమే తెనుఁగునకును ఆ నాఁడు ఉండియుండవచ్చు నని మనము ఊహింపనగును.

సవర, గదబ మొదలయిన భాషలలో కొన్ని పాటలు మాత్రము గలవు. ఆ పాటలు ఆ యా జాతి జనులు ఉత్సవ ములలోను, వివాహాది కార్యములలోను పాడుచుందురు. ఇట్టి వాఙ్మయమే తెనుఁగునను ప్రాథమికముగా నుండెనని యూహింపనగును. మానవుని మానవత్వము నెలకొనిన నాడే రాగ ద్వేషములు, హావభావములు స్థిరపడి వ్యక్తమగు చుండుటవలనను, వాని మూలమున బయలుదేరినవే ప్రాథ మిక సంగీత సాహిత్యములగుటవలనను పై రీతిని తెనుఁగునను ప్రాథమిక స్వతంత్ర సాహిత్య ముండెననియు దాని రూప మిట్టి దనియు సిద్ధాంత పఱుపనగును.

సుమారు పండ్రెండవ శతాబ్దమున నుండిన సోమ నాథుడు వ్రాసిన పండితారాధ్య చరిత్రలో శిష్యులు "తుమ్మెద పదములు, ప్రభాతపదములు, శంకరపదములు, నివాళిపద ములు, వాలేశు పదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు, సంజవర్ణన, మఱి గణవర్ణన పదములు బాడుచు నాడుచు నుండిరి" అని వ్రాసియున్నాడు. పై కవికాలము నన్నయ భార తమునకు సుమారు ఒక నూరు సంవత్సరములు తరువాతిది. ఆనాఁడుండినవని చెప్పబడిన పయి వెన్నెల పదములు, గొబ్బి పదములు, శివగీతములు మొదలయినవన్నియు తెనుఁగు నాట మిక్కిలి ప్రాచీనకాలమున నుండినట్లూహింపవచ్చును. ఇదియే తెనుఁగు నందలి మిక్కిలి ప్రాచీనస్థితి.

సుమారు ఏడవ శతాబ్దమునుండియు తెనుఁగు భాషలో వ్రాయబడిన గద్యశాసనములు పద్యశాసనములు మనకు లభించుచున్నవి. ఇది తూర్పు చాళుక్యుల పాలనకాలము. క్రీ. వె. 615 వ సంవత్సరమునుండియు నీ రాజవంశజుల పరిపాలన యారంభమయినది. ఇంతకు ముందు పాలించిన రాజులలో మొదటివారు శాతవాహను లనెడి ఆంధ్రరాజులు. వీరి తరువాత ఇక్ష్వాకులు, పల్లవులు, బృహత్ఫలాయనులు, శాలంకాయనులు, కందరనృపతులు, విష్ణుకుండినులు అను వంశనామములు గల రాజులు, తెనుఁగునాటిని పాలించిరిగాని వీరి శాసనములు ప్రాకృతమునను, సంస్కృతమునను మాత్రమే గలవు. దేశభాష మాత్రము తెలుఁగనుట ముందు చెప్పిన యనేక కారణములచేత నిశ్చితము. ఈ భాషకు రాజపోషణ, పండితాదరము లేదు. విశేష పదజాలమును గొప్ప గ్రంథములను వ్రాయుటకు వీలయిన వాక్య రచనా పద్ధతియు నందు ఉండలేదనుట స్పష్టముగా నెఱుగనగును.

ఏడవ శతాబ్దము నుండియు తెనుఁగు, రాజపోషణ గలిగి సంస్కృత శబ్దములను జేర్చుకొని క్రమవికాసమును పొంది 11 వ శతాబ్దమునాటికి ఈ రాజవంశములో 27 వ పురుషుడయిన రాజనరేంద్రుని యాస్థానమున, మొట్టమొదటి గ్రంథముగ ఆంధ్ర మహాభారత రూపమున వెలసినది.

కావున తెనుఁగునాటి తెనుఁగును వెలయించినవారు తూర్పు చాళుక్యనృపతులు. ఏడవ శతాబ్దమునుండి పదునొకొండవ శతాబ్దము వఱకును గల తెలుఁగు భాషావాఙ్మయ

వికాసము మనము చక్కఁగా విమర్శించి నిశ్చితమయిన యాధారములతో నిరూపించవచ్చును.

క్రీ. శ. 641 సంవత్సరమున జయసింహ వల్లభ మహారాజుచే వేయింపబడిన విప్పర్ల శాసనమున*, తెలుఁగు స్వరూపము స్పష్టముగా నున్నది. ఇందనేక సంస్కృత పదములు కలసిన రీతిని వాక్యనిర్మాణము కన్పట్టుచున్నది. ఇది రాజశాసనమగుటచేత రాజానుమతిని పొందినదన్న మాట. దీనినిబట్టి భాషారూపమే తెలియుచున్నది, గాని వాఙ్మయము యొక్క చాయ లంతగా మనకు గనుపట్టుట లేదు. పయిగా నిది గణబద్ధముగాదు. కావ్యరచనకు గణబద్ధమైన రూపము నియతమని కొందరి యభిప్రాయము. అనగా భావ ప్రధానమైన వాక్కు వెడలినప్పుడది గణబద్ధముగానే వెడలునని యొకయూహ. ఇది సార్వత్రికముగాదు. అయినను, బహుళమయిన విషయమనక తప్పదు. ప్రపంచమున తొలి వాఙ్మయమనదగిన ఋగ్వేదము ఛందోబద్ధముగానే బయలు వెడలినది. తరువాత లౌకికమయిన సంస్కృత

---

* స్వస్తి శ్రీమత్ సకల లోకాశ్రయ జయసింహ మహారాజులాఱన్ ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరంబుళ్ ఎణుంబొద్ది, అన్నెణ్టి అమ్మఁ పూణ్ణమనాణ్డుం ప్లావిండిరాజుల ముట్ను కలిముడి రాజుల్ ప్లావిండి సముద్రరంబు నాకు బణిసేసిన కల్చి వీరదుర్ల మద్దికదు మూటికి విత్ప ర్తి ఉత్తరంబున పులొంబున చెఱువు పడుమాఱి కోటన్ ఎణుంబొదిపుట్ను ఆఱ్లపట్టు సేను. తూప్పుఁనకోటి తాఱుతోంటళాయ పడువారంబు ఇచ్చిరి. పాఱపడువారంబు ప్లావిండీశ్వరంబున కళాకణ్ణగు మిచ్చి కుడుచువారు.

వాఙ్మయము వాల్మీకి యుచ్చరించిన శాపరూపమయిన శ్లోకముతో బయలు దేరినది. ఇదియే ఆదికావ్యమయిన రామాయణమునకు పునాది. అట్లే ఆంగ్లవాఙ్మయమునను మొదటి కావ్యములు ఛందోబద్ధములే. కావున ప్రధానముగా భావ సంభరితమై, ఛందోబద్ధముగా నుండిన రచనయే మనము కావ్య మనుకొనుచున్నాము గావున పయి తెలుఁగు శాసనములను కావ్యవాఙ్మయ మనజాలము.

తరువాత తొమ్మిదవ శతాబ్దమున బయలు దేరిన గుణగ విజయాదిత్యుని శాసనములు పద్యబద్ధములుగా నున్నవి. ఇవియు రాజచరిత్రమును నిరూపించు కేవల వస్తు ప్రధానమయిన రచనలేగాని యిందు వాఙ్మయ లక్షణములు స్పష్టముగా గోచరించుచున్నవి. తరువోజ అని మనము చెప్పు ఛందోవిశేషములలో నున్నవీ రచనలు. ఇది యొక ముఖ్య విషయము. ఇవి దేశీయచ్ఛందస్సులు అనఁగా సంస్కృత సంబంధ మక్కఱలేకయే తెనుఁగునాట తెనుఁగు రచనలలో వాడుచుండిన ఛందస్సులని యర్థము. ఇవి తొమ్మిదవశతాబ్దపు శాసనములలో నుండుటవలన నంతకుముందు కొన్ని శతాబ్దములనుండి దేశములో వాడుకలో నుండెడివనియు, ఆనాటికి రాజశాసనములలో వ్రాయఁబడు గౌరవము వానికి లభించిన దనియు మన మనుకొనవచ్చును.

గుణగ విజయాదిత్యుని శాసనములలోని విషయము రాజవర్ణనము. అతడు చేసిన దానమో, సంపాదించిన విజయమో, లేక సాధించిన యే యితరకార్యమో వర్ణనీయమయి యుండునుగాని యాభాగము పూర్తిగా లభింపక

పోవుటచేత కొన్ని అంశములను మాత్రమే మనము విమర్శింప వీలగుచున్నది. 'శ్రీ నిరవద్యుండు, చిత్తజాతసముడు, శివపద వర సేవితుడు' అను పదములనుబట్టి సంస్కృత పదములు తెనుఁగున విశేషముగా చేరుచుండిన వనుట స్పష్టము. ఈ పదములు రెండు రకములు. వ్యస్త పదములు. సమస్త పదములు. వ్యస్తము లనఁగా వేరువేరుగా నున్నవి. సమస్తము లనగా రెండుమూడు కలసి సంస్కృతములోనే యొక పదముగా నేర్పడి తెనుఁగునకు వచ్చినవి. ఇట్టి పదములు మిక్కిలి యెక్కువగా ప్రవాహమువలె వచ్చి చేరుచుండిన వనుట తెలియుచున్నది. ఆ పదములతో అందలి కవితా భావములు అలంకారములు సంప్రదాయములు వర్ణనలు మొదలయిన వన్నియు చేరక తప్పదు. 'చిత్తజాతసముడు' అను పదము రాజునుగూర్చి వాడబడిన విశేషణము. మన్మథునితో సమానుడని యర్థము. మన్మథు డను నొక వ్యక్తి యుండెననియు అతడు రూపమున నెల్లరలోను శ్రేష్ఠుడనియు నట్టివాడు రాజునకు సమానుడుగా వర్ణింపదగినవాడనియు సంప్రదాయముగా నెఱిగి వ్రాయుట తెలుఁగువారు తెలుఁగుభాషలో కనిపెట్టినది కాదు. ఇది సంస్కృతములో నుండి వచ్చినది. ఇట్లే 'శివపద వరసేవితుండు' మొదలయిన పదములు, అందలి కవితామూలములైన కల్పనలు సంస్కృతములోనుండియే గదా తెనుఁగునకు వచ్చి చేరినవని నిశ్చయింపనగును. ఈ రీతి రచన తెనుఁగు ఛందస్సులలో తెనుఁగుదేశమున సంస్కృత ప్రభావమున వెలసినది.

ఈ గుణగ విజయాదిత్యునినాటిదే అద్దంకి పండరంగని శాసన మొకటి గలదు. ఈ పండరంగు అను సేనానాయకుడు శత్రురాజులను జయించి ఆదిత్యభట్టారకునికి భూమి దానము చేసిన సందర్భ మిందు వర్ణింపబడినది. ఇందలి ఛందస్సు దేశీయ మయిన తరువోజ అనునదియే. అట్లే అక్కరలలో సుమారు 930 సం. మున వ్రాయబడినదని చెప్పదగిన యుద్ధమల్లుని బెజవాడ శాసనమందును విషయము, రాజు కట్టించిన బెజవాడ కుమారస్వామి దేవాలయము, స్థాపించిన మఠము, చేసిన దానము మొదలయినవాని కథనము. ఇదియు వస్తు ప్రధానమే. 'సత్యత్రినేత్రుడు,' 'అనవద్య విఖ్యాత కీర్తి,' 'త్రిభువనాభరణుడు' మొదలయిన పదములును ముందు చెప్పిన రెండు శాసనముల పద్ధతినే యవలంబించుచున్నవి.

ఇదియయిన తరువాత మనము వివరింపవలసిన విష యము నన్నయ కాలమే. నన్నయ రచింప నారంభించినది ఆంధ్ర మహాభారతము. అతడు తన కృతిని రాజరాజున కొసంగెను. ఆ రాజరాజు 1022–1063 వ సంవత్సరము వఱకు ఆంధ్రదేశమును రాజమహేంద్రవరము రాజధానిగా పాలించెను. ఆయన యనుమతిని గ్రంథరచన మొనర్చిన నన్నయయు ఆ నలువది సంవత్సరములలోనే గదా గ్రంథ రచనము చేసియుండవలయును. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో నన్నయ భారతరచన మొక ఘట్టము. ఆ నాటినుండి బయలుదేరిన వాఙ్మయ మొక యుగమునాటి దనవచ్చును. నన్నయకు పూర్వము ఉండిన చరిత్రను రెండు యుగములుగా విభజింపవచ్చును. తూర్పు చాళుక్యపాలన మారంభించిన

ఏడవ శతాబ్దినుండి, నన్నయనాటివఱకు నొక యుగము. ఏడవ శతాబ్దివఱకును ప్రాథమిక యుగము. ఈ మూఁడు భిన్నయుగములలోని వాఙ్మయముయొక్క లక్షణములు ఈ క్రింది విధముగా నూహింపనగును.

1. ప్రాథమిక యుగము:—క్రీ. వె. ఒకటవశతాబ్దము నుండి 7 వ శతాబ్దము వఱకును – ఈ యుగమునందు ఆంధ్రదేశమున వైజ్ఞానిక ప్రచారములో నున్న భాషలు సంస్కృత ప్రాకృతములు. సంస్కృతమున వైదికవాఙ్మయము, శాస్త్రములు, కళలు మొదలగునవన్నియు నున్నవి. ఈ గ్రంథములకు ప్రచారము కలిగించువారు వైదిక మతానుయాయులయిన చాతుర్వర్ణ్యమువారు. ముఖ్యముగా బ్రాహ్మణులు, అగ్నివాయు బ్రహ్మాండ పురాణములు మొదలుగాఁగల పదునెనిమిది పురాణములు, రామాయణ మహాభారతము లనెడి ఇతిహాసములు, కాళిదాసు మొదలయిన కవులు వ్రాసిన కావ్యనాటకములు, ప్రజలు చదువుకొనుచుండిన ఉత్తమగ్రంథములు. ఇవి సంస్కృత మెఱింగిన వారే చదువుకొందురు. రాజులును వీరినే ఆదరించుచుండిరి.

ఇవిగాక ప్రాకృతములో ననేక గ్రంథము లుండినవి. జాతకకథలు, త్రిపిటకములు అను పేరితో నున్న బుద్ధోపదేశముల సంగ్రహము, సుత్తములు అను పేరు గల బౌద్ధధర్మములను దెల్పు గ్రంథములు, సేతుబంధము మొదలయిన కావ్యములు, కొన్ని నాటకములు, ఆనాటి జనులకు పరిచితములు. ఈ గ్రంథముల కాధారమయిన పాళీభాషను నాటి బౌద్ధులందరును చదువుచునే యుండిరి. బౌద్ధుల మతప్రమాణగ్రంథ

ఆధారము పాళీభాష. ఈ భాషనే రాజులు బౌద్ధమతస్థులును ఆదరించుచుండిరి.

పయివిగాక జైనమత మొకటి ఆంధ్రదేశమున ఆకాలమున కొంత ప్రచారములో నుండెడిది. వీరి వాఙ్మయమంతయు అర్ధమాగధి యను నొక ప్రాకృతములోను, సంస్కృతములో నున్నది. ఈ మూడు వాఙ్మయములును నాటి తెనుఁగు దేశమున ప్రచారములో నుండినవి. పద్మకవి, గజాంకుశుఁడు అనువారు తెనుఁగున కావ్యములు వ్రాసియుండిరనినట్లు పేర్కొనిరిగాని వారి కాలమును గూర్చియు, గ్రంథములను గూర్చియు నిర్ణయించుట కాధారములు చాలవు.

ఇక నానాఁడు తెనుఁగున నుత్తమ గ్రంథము లుండినవనుటకు సాక్ష్యములేదు. పయిగా లేవనుటకే యాధారములు కనుపట్టుచున్నవి. తెనుఁగు జనసామాన్యము వాడు భాష. అందు తుమ్మెద పదములవంటి పదములు మాత్రమే వాఙ్మయముగా ప్రచారములో నుండిన వనుట నిశ్చయముగా నూహింపనగును.

2. ద్వితీయ యుగము :— ఇది ఏడవ శతాబ్దినుండి పదునొకొండవ శతాబ్దము వఱకును నుండిన కాలము. ఈ యుగారంభమునుండి తెనుఁగునకు ప్రాధాన్యము వచ్చినది. ఈ భాష నవలంబించినవారు తూర్పు చాళుక్యులు. బౌద్ధులు, జైనులు, వైదికులు తమతమ ప్రాధాన్యము కొఱకు పాటుపడవలసినవారైరి. కాలక్రమమున జైన బౌద్ధమతములు, రాజ

పోషణ లేకపోవుటచేతను, బ్రాహ్మణులయొక్క సామర్థ్యము వలనను, యుక్తులచేతను, జైన బౌద్ధ సన్యాసులు మతములు మొదలయినవాని యెడల గనుపట్టు దోషములవలనను, నామ మాత్రములై తెనుఁగునాట రూపరిపోవుచుండెను. సామాన్య జనులకు ప్రాకృతము రాలేదు. సంస్కృత మంతకంటె దూరమైనది. జనాదరణము నందుటకు రాజులు, మత గురువులు తెనుఁగు నాదరింపక తప్పినదికాదు. ఆ నాఁటి తెనుఁగు మొదట రాజశాసనములను వ్రాయుటకు తగిన భాషగా రాజులచే నంగీకరింపబడినది. క్రాలక్రమమున ప్రాకృతమున శాసనములు వ్రాయుట పూర్తిగా నశించినది. సంస్కృత శాసనములును తగ్గిపోయి దేశభాషయే ముందునకు వచ్చినది.

ఈ నాటి వాఙ్మయ సృష్టికి, సామాన్య జనులును, పండితులును కొంత కొంత పరిశ్రమింప జొచ్చిరి. ఇంతకు ముందు ప్రజలలో వాడుకనందుచుండిన గేయ వాఙ్మయము మాత్రమే గాక పద్య వాఙ్మయము గూడ వాడుకలో నుండినట్లు ముందు చెప్పిన రెండు మూడు శాసనములను బట్టి స్పష్టము. అది దేశీయచ్ఛందస్సులలోనే యున్నది. సంస్కృత చ్ఛందస్సు లింకను వాడుకలోనికి వచ్చినట్లులేదు. దేశీయ చ్ఛందస్సులు మాత్రాగణములలో నుండును. మాత్రాగణ ములు రెండు, మూడు, నాలుగు, ఐదు అను మాత్రా సంఖ్యతో గూడిన కాలపరిమితి గలవి. దీర్ఘము, సంయుక్తా క్షరమునకు ముందుగా నున్నవి పొల్లుతో గూడినవియు గురువులు, రెండు మాత్రలు గలవి. హ్రస్వము లయినవి

ఒక్కొక మాత్ర. ఇవి లఘువులు. పాదమునకు మొత్తము మాత్రలెన్ని? నాలుగు మాత్రల గణములెన్ని యుండవలెను, రెండు మాత్రల గణములెన్ని యుండవలయును, అనువానివంటి నియమములతో గూడుకొనిన లక్షణములు గలవి దేశీయ చ్ఛందస్సులు. సంస్కృత చ్ఛందస్సులు, శార్దూలము, మత్తేభము, స్రగ్ధర మొదలయినవి నియతములయిన అక్షర క్రమముతో నుండునవి. నేటి తెనుఁగు వాఙ్మయమున, దేశీయ చ్ఛందస్సు లయిన, తేటగీతి, ఆటవెలది, సీసము మొదలయినవి మాత్రమేగాక ఇతరములయిన సంస్కృత చ్ఛందస్సులును గూడ వాడుకలో నున్నవి.

రెండవ యుగము తెనుఁగు వాఙ్మయములో సంస్కృత చ్ఛందస్సులు వాడుకలో నున్నవనుటకు ఉదాహరణములు స్పష్టముగా కానరావు. వస్తుప్రధానమైన శాసన రచనములే మనకు దొఱకినవిగాని భావ ప్రధానములైన కావ్యరచనలు కనుపట్టలేదు. పాటలు మొదలయిన గేయ వాఙ్మయము మాత్రమే భావ ప్రధానమైన రచనలు. వస్తు ప్రధానమనగా ఏదో యొక కథను విషయమును మాత్రమే చెప్పునట్టి రచన యని యభిప్రాయము. అట్టివే పయి మూడు శాసనములు. ఈనాఁడు మనము చదువుచున్న మనుచరిత్ర మొదలయిన కావ్యములు కథా మాత్రము కొఱకు వ్రాయబడలేదు. అందలి రసము, భావము, అలంకారములు ముఖ్యములు. చదువువారికి ఆనందము కలిగించుట వాని ముఖ్యోద్దేశము. ఇట్టి పద్యరచనలు కావ్యబంధములు ఆనాఁడు వెలసి యుండెనని నిరూపించుట కాధారములు లేవు. నన్నయ

భారతమే అట్టివానిలో మొదటి మెట్టుగా మనకు గనుపట్టు చున్నది. కాని ఆనాఁడుండిన యితర తెనుఁగు వాఙ్మయము నాధారముగా గొనియే తన భారతమును నన్నయ రచించెను. భారతము, తెనుఁగు వాఙ్మయ వికాసములో నొక విశిష్టమైన మెట్టు, ఒక ఘట్టమే గాని, కేవలము ఆదిమాత్రముగాదు. అంతకు ముందుండిన పరమ శూన్యమునుండి యొక్కసారిగా నావిర్భవించిన సృష్టిమాత్రముగాదు.

3. మూడవ యుగము :— ఈ యుగము నన్నయ భారతముతో అనగా 1020 నుండి ప్రారంభించుచున్నది. ఈ యుగ లక్షణములను ఎఱుగుటకు మున్ను ఆనాటి భాషా వాఙ్మయ వాతావరణమున నన్నయభారత మవతరించుటకు గల కారణములను మనము పరిశీలింపవలెను. నన్నయ తన భారతావతారికయందు భారత రచననుగూర్చి యేమి చెప్పెనో ప్రస్తావించుటవలన నిది కొంతవఱకు స్పష్టపడును.

ఇతర రాజులను బలిమినడంచి కప్పములను గొనుచు బ్రాహ్మణులను అగ్రహారాదికములిచ్చి రక్షించుచు మను మార్గమున దేశమును బాలించుచు, తన రాజధానీ నగరం బయిన రాజమహేంద్రవరమున వైయాకరణులు, అనేక పురాణ ప్రవీణులయిన పౌరాణికులు, వైణికులు, గాయకులు, కవులు కొలుచుచుండగా పేరోలగంబుండి, రాజరాజు నన్నయ భట్టుతో నీ క్రిందిరీతి ననియెను. నన్నయభట్టారాజునకు కుల బ్రాహ్మణుడు, బ్రహ్మాండాది నానాపురాణముల నెఱింగిన వాడు, ఉభయ భాషా కావ్యరచనాభి శోభితుడును. ఉభయ

మనగా సంస్కృతాంధ్రములు రెంటియందును అర్థమని యూహింపబడినది.

"నేను అనేక పురాణములను వింటిని. అర్థ ధర్మ శాస్త్రములను తెలిసికొంటిని. గొప్పవయిన కావ్యనాటకములు సూచితిని. ఈశ్వరాగమములయందు బుద్ధినిల్పితిని. నేను అనేక భాషలయందు భారతమును అనేక జనుల చేత వింటిని. అట్లు వినుటవలన గొప్ప సత్ఫలము కలుగునని నే నెఱుఁగుదును. ఇంతియగాక, భారతమునందలి రాజులు మా చంద్రవంశమువారు. మా వంశకర్తలయిన యా మహామహుల చరిత్రము తెనుఁగున మీరు వ్రాసి వినిపించిన వినవలెనని కుతూహలపడుచున్నాను."

పై యర్థముగల మాటలను రాజు పలికిన విని, రాజ సన్మానము పొందుచు సభలో పెద్దరికముదాల్చిన నన్నయ యాపనికి దొరకొనక తప్పదని నిశ్చయించుకొని తగురీతిని సమాధాన మిచ్చెను. తెనిగించుటకు భారతమును గ్రంధముగా నన్నయయే యెంచుకొనలేదు. అది రాజు ముదల. చేయక తప్పనిది. చేయలేననుట చేతగానితనమును నిరూపించును. రాజాజ్ఞకు విరుద్ధము. కావున నీ రీతిని సమాధాన మిచ్చెను. "దేవా, ఆకాశమున గల నక్షత్రములను లెక్కపెట్టుట, లోకములో నేఁడు ప్రచారములోనున్న వేదములు, శాస్త్రములు అన్నియు సాంతముగా చదువుట, కేవలము తెలివి యనెడి రెక్కల బలముచేత, మిక్కిలి లోతైన యర్థము గల భారత మనెడి సముద్రమును ఈదుటయు బ్రహ్మదేవునకును శక్యముగాదు. ఇంత క్లిష్టమయిన కార్యమయినను నీ దయ

వలన సభలోని పండితుల సహాకారమున, నాకు చేతనయినంత వరకు చేయుదు” నని పల్కి వ్రాయ మొదలిడెను.

## భారత స్వభావము

ఆంధ్రవాఙ్మయము అనునది గోదావరినది వంటిది. అది అనంతమైన ప్రవాహ రూపముగా కాలమునందు ప్రవహింప వలసినది. నన్నయకు ముందు దానికున్న స్వరూపమును సంగ్రహముగా వివరించితిని. ఈ వాఙ్మయమునకు ప్రోద్బలము కలిగించునట్టివి తెనుఁగునాటనున్న పండితులు, ప్రజలు, రచయితలు ఉపయోగింపగల శక్తి, శ్రద్ధ అనునవి. వీని నే మార్గమున నే రీతి నుపయోగింప వలయునను నట్టిది ప్రశ్న. దానికి మార్గదర్శకుడు నన్నయ. అట్టి మార్గదర్శకుడయిన నన్నయ తెనుఁగు వాఙ్మయ ప్రవాహమును, ప్రజోపయోగ మార్గమునకు త్రిప్పుటకు భారత రచన మను నట్టి నిర్మాణ క్రమమునకు దొరకొనెను. ఈ గ్రంథమునకు మూలము సంస్కృత భారతము. ఈ గ్రంథము స్వభావము కొంత తెలిసిన గాని దానివలన నాంధ్రవాఙ్మయము ప్రవహించుటకు ఏర్పడిన మార్గములు బోధపడవు.

భారతము పంచమ వేదమని ప్రసిద్ధి. ఇందు పదు నెనిమిది పర్వములు గలవు. ఇందలి విషయము భారతవంశపు రాజులయిన కురు పాండవుల చరిత్ర. ఆ చరిత్ర నిమిత్తముగా లోక ధర్మము, రాజనీతి, ఆత్మానాత్మ విచారము, కాలము, ఈశ్వరుడు అను వాని స్వరూపము, మొదలయిన సహస్రాధిక విషయములు అందు చెప్పబడినవి. ఇవి యొకనా డొకరిచేత

కనిపెట్టబడినవి గాని కల్పింపబడినవి గాని కావు. ఆ గ్రంథమునకు వ్యాసుడు కర్తయయినను ఆయన, భారతదేశముప లక్షలమంది ప్రతిభావంతులు వేల సంవత్సరములు శ్రమించి సంపాదించిన విజ్ఞానమును, తపస్సు వలన ఋషులకు సాక్షాత్కరించిన సత్యమును, అనంత ప్రజాసమూహముయొక్క అనుభవమును, క్రోడీకరించి భారతీయ నాగరికతా సారమును ఆధారముగాగొని వ్రాసెనని చెప్పక తప్పదు. ఈ గ్రంథములోని విషయమునకు, తెలుఁగు, అరవము, కన్నడము మొదలయిన నేటి భాషాభేదము వలన నేర్పడిన విభజనము భేదకము కాఁజాలదు. ఇది భారతదేశమునందంతటను ప్రవాహముగా వెల్లివిరిసి యెల్లరను పవిత్ర మొనర్చిన గ్రంథము.

భారతము ఎట్టి గ్రంథమో నన్నయ తెల్పియున్నాడు. "అది విశ్వజనీనముగా వివిధ తత్త్వవేదియయిన వేదవ్యాసుడు రచియించెను. అది ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, మహాకావ్యము. సర్వలక్షణ సంగ్రహము, ఇతిహాసము, బహుపురాణసముచ్చయము." ఇట్టి గ్రంథమును లోకహితార్థముగా, తెనుఁగువారికి, సులభముగా నుండుటకు తెనిఁగింపవలసి వచ్చినది. భారతము మతగ్రంథమనియు నయ్యది కేవల వైదికమతవ్యాప్తికొఱకు బ్రాహ్మణ పక్షపాతముగా నన్నయ వ్రాసెనని కొందఱు తలంప వచ్చును. కాని నన్నయ యట్లనుకొనలేదు. మతగ్రంథములందు స్వమత స్థాపనము పరమత ఖండనము అనునట్టి రెండు ఘట్టములు ఉండక తప్పదు. బసవపురాణము, శివపారమ్యమగు బసవ సిద్ధాంతమును జెప్పుటకు వ్రాయబడిన గ్రంథము. శివపురా

ణాము, విష్ణుపురాణము అనునవి శైవ వైష్ణవ మత సంప్రదాయములను స్థాపించుటకు వ్రాయంబడిన గ్రంథములన్నచో సత్యము అనవచ్చును. భారతము భరతరాజ వంశజుల చరిత్రమైన గ్రంథము. అందు ఆద్యంతములతో గూడిన కథయు, పాఠకులయందు రసోత్పాదక సామగ్రియు, రచనయు గలవు. పరమత ఖండనములు, అనగా వైదికేతర మతము లగు జైన బౌద్ధ చార్వాకాదుల ఖండనములుగాని విచారణగాని లేదనవచ్చును. ఈ భారతము సంస్కృతమున మొదట రచియింపబడినప్పుడు ఈ బౌద్ధచార్వాకాది మతము లెట్లున్నవో, ఉండినవో లేవో యెఱుగుట కందాధారములు లేవు. కావున నన్నయ్య దీనిని మతగ్రంథముగా నుద్దేశించి వ్రాసెనని చెప్పుట యథార్థమునకు దూరము. ఆతడు చెప్పిన మాటలతో నతుకవు.

పయిరీతిని మహాసముద్రమువంటి భారతమును వ్రాయవలయునన్న నాటి తెనుఁగుభాష సమర్థముగాదు. పదములు లేవు. వాక్యరచనా పద్ధతియు పెంపొందలేదు. సంప్రదాయములు పరిభాష, సంస్కృతమునం దేర్పడినవి గాని తెనుఁగున వానికి ప్రవేశములేదు. తెనుఁగుఛందస్సు గూడ విరివియైయనేక నూతన వృత్తములతో వెలయలేదు. నాటి తెనుఁగునభాష కొక లక్షణము ప్రామాణికమార్గము ఏర్పడియుండలేదు. ఇవి యన్నియు సంపాదించికొనినఁగాని నన్నయకు గ్రంథరచన సాగదు. కావున వానినన్నిటిని నన్నయ సంపాదించి స్థిరీకరింపవలసి వచ్చినది. నన్నయ భాషావాఙ్మయములను రెండింటిని సృజింపవలసి వచ్చినది.

భాషావిషయమున అతడు చేసిన సృష్టి :—1. క్రొత్త భావములను దెల్పుటకు పదములు తెలుఁగున లేకపోవు టచే క్రొత్తపదములను సృజించుట యెట్లు అనునది సమస్య. ఆయనకు ముందుండిన శాసనముల స్వరూపమును ముందు నిరూపించితిని. అందు సంస్కృత పదములు పండితులు విరివిగా వాడుచుండిరి. ఆ యలవాటు నీతడు గ్రహించి మార్గ దర్శకముగా నెంచికొనెను. దానినే స్థిరపఱచి యనుసరించి తెనుఁగున లేనిమట్టుకు సంస్కృత పదముల నున్నవానిని తెనుఁగునకు తెనుఁగు పద్ధతుల ననుసరించి తెచ్చుకొనఁ జొచ్చెను. ఈ పద్ధతి వలన తెనుఁగు నూటికి అరువదిపాళ్ళు తత్సమభూయిష్ఠముగా స్థిరమైనది.

2. తెనుఁగువాక్యము చాల అల్పమయిన విన్యాసము గలది. అనగా సంస్కృతమున నున్న చిక్కులు లేక, సరళ స్వరూపమయి, స్పష్టమయిన పద్ధతి గలది. ఈ రచనలో, సూక్ష్మములయిన అభిప్రాయభేదములు తెలియునట్లు వ్రాయుట సులభసాధ్యము గాదు. కాబట్టి యాతడు తానెఱింగిన సంస్కృత వాక్య మార్గమును వ్యాకరణపద్ధతిని తెనుఁగున ప్రవేశపెట్టెను. కావున తెనుఁగుభాష పెరుగుదల సంస్కృత భాషా రచన ననుసరించియే యాతరువాత నంతయు జరిగినది.

3. తెలుఁగు ఛందస్సులు మాత్రమేగాక యనేకము లయిన సంస్కృత వృత్తములను తెనుఁగు రచన కనుకూల ముగా నన్నయ యనుసరించెను. ఈ రచనములో నాతనికి, ప్రక్కనున్న కర్ణాటసాహిత్యము ఉపకరించెను. అందు ఆనాటికే వెలసిన పంపభారతము, గదాయుద్ధము మొద

లయిన గ్రంథములు, సంస్కృత వృత్తములను గూడి యున్నవి. ఈ పద్ధతిలో నొక విశేషముగూడ నన్నయ యవలంబించెను. సంస్కృత పద్యములలో ప్రాస యను నియమము లేదు. ప్రాస యనగా పద్యమునందలి ప్రతి పాదములోను రెండవ యక్షరము ఒక్కటిగానే యుండ వలయుననుట. ఈ నియమము సంస్కృతములో లేకుండుట వలన సంస్కృత శ్లోక రచన కొంత సౌలభ్యమును పొంది యున్నది. కాని తెనుఁగు కన్నడముల రచనలలోని జీవము ఇట్టి ప్రాసముండుట కాబట్టి కన్నడ కవులు ఈ ప్రాస నియమము నంగీకరించి సంస్కృత చ్ఛందస్సులను కన్నడము నకు దెచ్చుకొనిరి. సంస్కృత వృత్తములలో ప్రతిపాదమునను, నడుమ నొక నియతస్థానమున విరుపు ఉండవలెను. దీనినే, యతి, విరామము అని చెప్పుదురు. దీర్ఘమయిన యా పాద మును ఉచ్చరించుటకు సౌలభ్యము కొఱకా విరు పేర్పడినది. అట్టి విరుపు (విచ్ఛేదము) లేనిచో పాదమంతయు నొక్క సారిగా నుచ్చరించుట శ్రమకరమగును. కన్నడ కవులు ఆ విరుపు నట్లే అంగీకరించి యూరకుండిరి.

నన్నయ గ్రంథమునందు కన్నడ వృత్తములలోవలె గాక యింకొక యధికమయిన నియమము గూడ నవలంబింప బడెను. పాదము మొదటి యక్షరమునకు సజాతీయ మయిన యక్షర మాయతిస్థానమున రావలెననుటయే యానియమము. ఇది తెనుఁగురచనలలోని ముఖ్యలక్షణము. నన్నయ గ్రంథ ములోనున్న యీ నియమమే తెనుఁగువారి కందరికిని తరువాత ననుకరణీయమయి, తెనుఁగు పద్యరచన, సంస్కృత

కర్ణాటక భాషలలోని పద్యరచనకంటె నెక్కువ శ్రమకరమయినది. కాని నేటికిని ఆ పద్ధతియే నడచుచున్నది.

పయిని జెప్పిన మూడు విషయములును కవిత్వమునకు బహిరంగ స్వరూపమునకు సంబంధించినవి. మొదటి రెండును శబ్దస్వరూపమును, మూడవది గణనియమమును, అక్షర విన్యాసమును సంబంధించినవి. కాని యింతకంటె నధిక ప్రాముఖ్యము వహించినవి అర్థము భావము, ఇతివృత్తము (కథ) ఉక్తివైచిత్రి యనునవి. ఇవి కవితామూర్తి యొక్క ఆంతరంగికమయిన మానసిక స్వరూపమును వెలయించునవి. ఆ రచనయందును నన్నయయే తరువాతి కవుల కందఱకును ననుకరణీయుడయ్యెను.

స్వతంత్రుడయిన కవి, తన జాతియొక్క నాగరకత, విజ్ఞానము, సంప్రదాయము మొదలయినవాని సంస్కారము వలన, తన ప్రతిభ ననుసరించి కావ్యస్వరూపమును, నిర్మాణ ప్రక్రియను స్వతంత్రముగా నేర్పఱుచుకొనవచ్చును. అప్పుడత డాజాతికి ఒకానొక సృష్టి నొసంగును.) అనగా నేడు మన వాఙ్మయ రచనలోనున్న వివిధజాతులయిన నవల, నాటకము, శతకము మొదలయిన జాతుల కావ్యరచనను మనము పరిశీలించినచో నందేది మనజాతిలో స్వతంత్రముగా బయలు వెడలినది, ఏది పరభాషావాఙ్మయమున మఱియొకరిచే సృజింపబడగా ననుకరింపబడినది యని విమర్శించి తెలుఁగువారు సృజించుకొనినదేమి యని సమాధానము చెప్పుకొనవచ్చును.

నన్నయ తన కావ్యములను, చిన్నచిన్న విషయములను గ్రహించి దేశ్యములయిన పదములతో, తెలుఁగుదనము

ఉత్పత్తిపడునట్లు సృష్టిచేసియుండినచో మన వాఙ్మయ చరిత్రయే యింతకంటె భిన్నముగా నుండెడిది. అట్లుగాక ఆర్యనాగరకతా ప్రవాహరూపమున వెలువడిన భారతేతివృత్తమును గ్రహించుటకు కారణము రాజరాజు నాజ్ఞ కదా! కృతికర్త కృతిభర్త యిరువురును, భారతమునే తెనిఁగింప పూనుకొనుటకు ఇతర హేతువులు లేకపోలేదు. అవి యీ క్రింది రీతి నూహింపవచ్చును. ( అఖండభారత దేశము ఏకము. ప్రజా నిత్యజీవనమునను, ధర్మమునను, విశ్వాసములయందును ఆత్మజ్ఞాన విషయమునను, స్వల్పములయిన ప్రాదేశిక భేదములను తొలగించినచో, ఏకస్వరూపము గోచరించుటఁ బట్టి ఆ స్వరూపమునే, సంస్కృతములో నున్న దానిని తెనుఁగునకు దింపి, సంస్కృతమురాని వారి కందించుట యీ రచన యొక్క ముఖోద్దేశము. )

భారతమను సౌధమునకు పునాదియగు కథా ప్రణాళిక ఐతిహాసికము. ఇది ప్రాదేశికముగాదు. ఇందలి ధర్మములు, అర్థవిషయములు సనాతనములు. అఖిల భారత దేశము నందలివి. ఇక రచనలోని యలంకారములు సన్నివేశ సృష్టి, కథలవలన వ్యంగ్యముగా ధర్మమును బోధించు విధానము, ఐహికాముష్మికముల చింతన, మన్మథుడు రతి మొదలయిన వారి సృష్టి, మనుష్యభావములకు సంకేతములుగా రూపెత్తిన పాత్రలు, వాని వలని యర్థకల్పన మొదలయిన వన్నియు అఖిలభారత సిద్ధములయిన వానినే నన్నయ గ్రహించుటచే నాతని తరువాతి మహాకవులకందఱికి నదియే మార్గమయ్యెను. \ తెనుఁగు వాఙ్మయమునకు మహా

గ్రంథములను ప్రసాదించిన వారందఱిలో ముఖ్యులు, అంద ఱును సంస్కృత ప్రాకృతములయందు రెండిటియందు గాక పోయినను సంస్కృతమునం దైనను పండితులే. చంపూ మార్గ మున సంస్కృత గ్రంథానుసరణము భాషాంతరీకరణమును తెలుఁగుకవు లనుసరించుటకు నన్నయ వేసినదే బాట. ఆ బాట నేటికిని అనుసరింపబడుచునే యున్నది. సంస్కృత భాషానుసారిత్వము ఈ నన్నయ యుగమునకు ఒక ముఖ్య లక్షణము. అయ్యదియే నవ్యయుగము వఱకును నభిన్నముగా నుండినది. స్థూలరూపమున ఆంధ్రవాఙ్మయమున రెండే యుగములు. ఒకటి నన్నయయుగము, రెండవది నవ్యయుగము అనుట స్థిరమయినది.

## భారతాంధ్రీకరణ విధానము

భారతాంధ్రీకరణము ముప్వురు కవులచే సుమారు 300 సంవత్సరములలో పూర్తిచేయబడినది. నన్నయ తన రచనను సుమారు 1050 సంవత్సరములో నారంభించె నను కొన్నచో సుమారు 1350 వఱకు నుండిన యెఱ్ఱాప్రగడచే పూర్తిచేయబడిన భారత రచనకు సుమారు మూడువందల యేళ్ళయినది. పదునెనిమిది పర్వములు విస్తృతిగల యీగ్రంథ ములో నన్నయ రెండున్నర పర్వములు మాత్రము తెనిగిం చెను. మిగిలిన పదునేను పర్వములును తిక్కన మహాకవిచే రచియింప బడెను. ఈ పని సుమారు 1250 వ సంవత్సరము ప్రాంతమున జరిగి యుండును. నన్నయ వ్రాయగా మిగిలిన అరణ్య పర్వములోని భాగమును ఎఱ్ఱన 1350 సంవత్సరము నకు ముందు రచియించి పూర్తిచేసెను.

ఈ రచనా విధానమునకు మార్గదర్శకుడు నన్నయ గావున ఆయన మార్గమునే యితరు లిద్దఱును అనుసరించిరి. ఎఱ్ఱన తన కృత్యాదిలో 'తద్రరచనయకా' అనగా నన్నయ రచనయే యగునట్లు రచియించుచున్నానని వ్రాసెను. తనకు ముందుండిన "ఆంధ్రకవిత్వ విశారదుడు, విద్యాదయితుడు, మహితాత్ముడు అయిన నన్నయభట్టు దక్షతతో" తెనుఁగున మూడు పర్వములు వ్రాసెనని తిక్కన చెప్పెను. తానును సమర్థతతోడనే వ్రాసెను. వ్యక్తి విషయక మయిన భేదములు తప్ప ఆంధ్రీకరణ విధానము మాత్రము నన్నయ, తిక్కనలది యొక్కటియే యనక తప్పదు. ఆది అర్థరచనా విషయము. భాషా విషయమున నన్నయకాలమునుండి, సుమారు పందొమ్మిదవ శతాబ్దము నంతము వఱకును నన్నయ మార్గమే యవలంబింపబడినది. ఈ విషయమే యప్పకవి యిట్లు చెప్పెను. "ఆదిని శబ్దశాసన మహాకవి నన్నయ రచించిన మూడు పర్వములలో నుడువు తెనుఁగు లరసికొని తిక్కసుధీ మణి మొదలయిన తొంటి కవీంద్రులు తెనుఁగు కృతులు వ్రాసిరి." ఈ యభిప్రాయ మెంతయు సత్యము.

భాషా విషయమున నన్నయ చూపించిన మార్గములను ముందు నిరూపించితిని. ఇప్పుడు అర్థరచనా విధానమున గల విశేషములనువివరించి మరల భాషావిషయమును విమర్శింతును.

ఒక గ్రంథమును భాషాంతరీకరించునపుడు రచయిత స్వాతంత్ర్యము మిక్కిలి స్వల్పమయిపోవును. శాస్త్ర గ్రంథ మయినచో మూలమును ఎంతమాత్రము అతిక్రమింపరాదు. కావ్యగ్రంథమును గ్రహించినచో నింతటి నిర్బంధముండదు.

కథాప్రణాళిక, పాత్రలు, సన్నివేశములు, రసము, వాద ప్రతి వాదములు, భావపరంపర అన్నియు ముందే సిద్ధములయి యుండును. కవి మూలగ్రంథములోని రచనను ఆత్మప్రత్యక్షము చేసికొని తన మనస్సులో భావించుకొని, దానిని తన భాషలో తిరిగి రచింపవలయును. మూలములోని ప్రతి పదమును అట్లే ఉంచవలెనా, లేక అభిప్రాయమును మాత్రము తన భాషలో తిరిగి వ్రాయవలయునా యను ప్రశ్న తప్పదు. మూలములోని యర్థమునంతటిని చక్కగా సాక్షాత్కరించికొని తన సొంత రచనవలెనే తెనుగువారికి సులభముగా నవగతమగునట్లు ఎడనెడ ఔచిత్యము ననుసరించి యలంతి మార్పులు చేసి నూతనసృష్టిని నన్నయ రచించెను. నన్నయ తన యవతారికలో మూలగ్రంథమయిన భారతము స్వభావమును జెప్పి తరువాత తన రచనను గూర్చి యిట్లు చెప్పెను. "కవీంద్రులు ప్రసన్న కథాకలితార్థయుక్తి" గ్రహించి మేలనునట్లును ఇతరులు అక్షర రమ్యత నాదరించునట్లును నన్నయ భారతమును తెనిగించెను. భాషాంతరీకరణమున కవి తాను క్రొత్తకల్పలనను సృష్టిని చేసెనని చెప్పుకొన వీలులేదుగదా! ప్రసన్న శబ్దమునకు స్పష్టము, యథార్థము, అను నర్థములు గలవు. స్పష్టముగా మూలములోని కథల సందర్భములలో నర్థములు పొందుపడిన రీతిని జూచి కవులు మెచ్చుకొందురు. అక్షరములనగా, అకారాది ధ్వను లనియు, పదము లనియు, భాష యనియు నర్థములు గలవు. కవులుగానివారందఱు, పదముల పొందిక భాషసొంపు విని మెచ్చుకొనునట్లున్నదని యర్థము.

తన కాలమునకు ముఁదుండిన శాసనములవలన దెలియదగిన భాషవలె, అస్తవ్యస్తముగా, నియమరహితముగా, కాసట బీసటగా నుండక, రమ్యమయి యుండునని యాతని భావ మనవచ్చును.

పయిరీతిని స్వేచ్ఛతో గూడిన మూలానువాద విధాన మునే తిక్కనయు ననుసరించెను గాని, యాయన మార్గము దివ్యమై కావ్యరసముం గొనియాడెదు నట్లుండును. భిన్న ఘట్టములయిన భారత పర్వముల కైక్యమును మనసులో నుంచుకొని, నానారసోల్లాసి యయిన విరాటోద్యోగ పర్వములతో నారంభించిన భారత భాగమును, ఆత్మీయ శిల్పమును కళాచాతుర్యమును వెలయించుచు తెనిగించెను. తిక్కననాటికి, నన్నయనాటి కంటె తెనుఁగుభాషలో గొంత యభివృద్ధియు స్వాతంత్ర్యమును, రూఢములయి వెలసినవి. తిక్కన రచనలోని శిల్పము ఏమనగా, మూలములోనున్న ఘట్టమునకు సరిపడిన తెలుఁగు పదముల నెత్తికొని, వానిని ముత్తెములకోవ కూర్చినట్లుగా, వ్యాసుని భావమనెడు బంగారమును తన మూసలో, ఆత్మీయ ప్రతిభాగ్నిని కరగించి క్రొత్తదయిన రూపమును సృజించినట్లును రచియించుటయే యయ్యెది. సంస్కృతము ననుసరించియు, సంస్కృతపదము లను నన్నయవలెనే ఆతని మార్గముననే గొన్నియెడల వాడియు గూడ, తెనుఁగు దనము ఉట్టిపడునట్లు, తెనుఁగు పదములలోని భావవిస్తరణశక్తి ఉజ్జ్వలమయి ప్రకాశించునట్లు అనేక స్థలములలో తిక్కన భారతమును తెనిగించెను.

ఎఱ్ఱన రచన, తిక్రచనయాకాన్, అనగా నన్నయ రచనగానే యున్నదని తాను చెప్పుకొనెనుగాని అతని రచనా

విధానములో తనకు పూర్వుడయిన తిక్కన రచనావిధానము నవగాహనము చేసికొని తనకు స్వాభావికమయిన గాంభీర్యము, ఉదాత్తగమనము వెలయునట్లు రచియించినాడని చెప్పక తప్పదు.

నన్నయ తిక్కనల ఆత్మస్వరూపమును, వారి రచనా విధానము ననుసరించి యూహించుటకు విమర్శకులు ప్రయత్నించిరి. వేదప్రామాణ్యవిషయముననను, ధర్మప్రాధాన్యముననను, వైదిక దృష్టియందును నన్నయ తిక్కనలకు భేదము లేదు. "నన్నయ విపుల జప హోమ తత్పరుడు, లోకజ్ఞుడు, ఉభయ భాషా కావ్య రచనాభి శోభితుడు." తిక్కన "వైదిక మార్గ నిష్ఠమగు వర్తనమున సోమయాజియయి పంచమ వేదంబను భారతంబును అఖండిత భక్తిని" తెనిగించెను. పయిమాటలచేత వైదిక ప్రాధాన్యమిరువురకును సమానమే. కాని తిక్కన రచియించిన ఘట్టమున రాజనీతి, రాయబారము, తంత్రావాపము మొదలయిన వుండుటచేతను, ఆయన చరిత్రమును ఇతరాధారములను బట్టి చూచుటవలనను ఆయన రాజనీతి కుశలత, కార్యజ్ఞత లోకజ్ఞత మొదలయిన శక్తులు మనకు స్పష్టముగా భారతమున గోచరించును. ఉద్యోగపర్వమునందలి వాక్యోప వాక్యములు మూలములోనివే యయినను, ఆ భావములను తెనుఁగు మాటలలో అట్లు పొందుపఱచుట, ప్రత్యక్షమయిన అనుభవము నేర్పును లేనివాడు, దక్షత లేనివాడు చేయజాలడు. తిక్కన మహామంత్రి, రాజనీతి కుశలుడు అనుట అతని వ్రాతవలన స్పష్టము.

భారత రచనతో తెనుఁగు వాఙ్మయ రచనమునకు మార్గము ఏర్పడిపోయినది. ఆ బాటనే యితరులందఱును అనుసరించినను, ఆ యా కాలపరిస్థితులు, కవులప్రతిభ, తమ్ము పోషించిన రాజులయభిరుచులు మొదలయినవి కావ్యములందు కనుపట్టుచునే యుండును. నన్నయతరువాతి వాఙ్మయమున ముఖ్యములయిన రెండు ప్రవాహములు కనుపట్టును. 1. దేశీయరచన 2. సంస్కృత భాషాసంప్రదాయ ప్రాధాన్యము. ఈ రెంటను రెండు భిన్నదృష్టులు. మార్గములును భిన్నములే. ఒకటి లేకుండ కేవలము రెండవదిగాని, రెండవది లేక మొదటి మార్గముగాని యుండనేరదు. ఆయా రచనలలో నేదృష్టికి ప్రాముఖ్యమనుటయే విచారణీయము. రెండవది శైవ వైష్ణవ మత సంప్రదాయ భేదము.

శైవమతము సనాతనముగా వేదములలో నున్నట్లు, రుద్రుడు దేవతగా స్తుతింపబడుచుండినట్లును ప్రమాణములు గలవు. ఆశైవమే తెనుఁగు దేశమునను స్థిరమై కొంత వైశిష్ట్యము సంపాదించి తెనుఁగు వాఙ్మయమున ప్రాముఖ్యమును పొందినది. తొమ్మిదవ శతాబ్దమునకు సంబంధించిన బెజవాడ శాసనమునుబట్టి యీ దేశమున శైవ మతము ప్రచారములో నున్నట్లు మనకు స్పష్టముగా తెలియుచున్నది. అంతేగాక శైవ భక్తులు చీరలో నిప్పులు ముడుచుట మొదలయిన యద్భుత కార్యములు చేయుచుండినట్లు తెలియుచున్నది. శ్రీశైలము, దక్షారామము, కాళహస్తి అను మూడు ప్రదేశములలో శివాలయములు ప్రసిద్ధములయి తెలుఁగు అను పేరేర్పడు

టకు హేతువు లయినట్లు మనకు స్పష్టము. పదునాలుగవ శతాబ్దమున ఆంధ్రదేశములో పంచశివమతము లుండినట్లు అందు గోళకీ మతము అనునది చాల ప్రసిద్ధమయినట్లును శాసనములవలన దెలియుచున్నది. ఈ శైవమతమున ముఖ్యములయిన రెండు సంప్రదాయములు, ఒకటి ఆరాధ్య సంప్రదాయము, రెండు లింగాయత మనబడెడు వీరశైవ బసవేశ్వర సంప్రదాయమును, తెనుఁగు దేశమున వైదిక శైవము మూలముగానే బయల్వెడలి స్థిరపడినవి. ఆ సంప్రదాయముల వలన ఆంధ్రవాఙ్మయము చాలవఱకు పోషింపబడి కొంత ప్రత్యేకతను నిరూపించుకొన్నది.

ఈ శైవ వాఙ్మయము ముఖ్యలక్షణము, శివుని లీలలు, శివుని ఆధిక్యము, శైవమతానుయాయుల ఆచారములు, శివభక్తుల కథలు శివదీక్ష మొదలయినవానిని సులభముగా సామాన్యులకు బోధపడునట్లు రచియించుట. దేశీయుల ఆదరణ ముఖ్యముగా గావలసిన మతమగుటచే క్రొత్తగా ననేకులను మతమున జేర్చుకొనవలసిన యవసరముండుట చేతను ఈ గ్రంథములు, సామాన్యుల యందుబాటులో నుండునట్లు జాను తెనుఁగున ప్రసన్నతా గుణముతో వ్రాయబడినవి.

శైవ వాఙ్మయమున ముఖ్య గ్రంథము నన్నిచోడుని కుమారసంభవము. ఈ కవికాలమును గూర్చి భిన్నాభిప్రాయములు గలవు. గాని ఈతడు నన్నయకు గొంచెము తరువాతివాడని యూహింపవచ్చును. సంస్కృతము నందలి కావ్యమయిన కుమారసంభవమును ఇతర కృతులను ఆధార

ముగా గాని యొక స్వతంత్ర గ్రంథమును కేవల భాషాంతరీకరణము కాని దానిని రచించుటచే నీత డాంధ్రవాఙ్మయమున క్రొత్త మార్గమును ద్రొక్కినా డనవచ్చును. నన్నయ మార్గమునకును నన్నిచోడుని మార్గమునకును వాస్తవముగా విశేషభేదము లేకపోయినను దృష్టిభేద మున్నట్లు స్పష్టముగా గోచరించును. "సరళముగాఁగ భావములు జాను దెనుంగున నింపు పెంపుతోఁ బిరిగొన," దేశి మార్గములు దేశీయములుగా "రచియింతు"నని సంకల్పించినవాఁడు నన్నిచోడుఁడు. ఇట్టి సంకల్పము నన్నయ యెచ్చటను తెలుపలేదు. సంస్కృతముయొక్క ప్రాబల్యమును దగ్గించి తెనుఁగు ప్రాధాన్యము కావ్యములయందు వెలయవలయునను నభిప్రాయము స్పష్టపఱచినవారిలో మొదటివాఁడు నన్నిచోడుఁడు. ఈతని రచనలో కొన్ని దేశీయ విశేషములయిన నానుడులు గోచరించును. రచనా మార్గమును గొంత స్వతంత్రమే. కాని సంస్కృతాను సారిత్వము, కథయందు, కల్పనలలోను, దీర్ఘ సంస్కృత సమాసములలోను, వర్ణనలలోను, సంస్కారములోను పూర్ణముగా నుండియే తీరినది.

కాని ఈ యుద్యమముయొక్క ఫలితము విశేషముగా పాలకురికి సోమన వ్రాసిన బసవ పురాణమున పూర్ణత నందినది. ఈ సోమన కాలనిర్ణయమునను కొంత అభిప్రాయ భేదము కలదు. అతడు 1190–1250 వఱకు నుండి యుండెనని కొందరూహించిరి. ఈత డనేక శైవ గ్రంథములను వ్రాసెను గాని యందు మిక్కిలి ప్రసిద్ధమయినది బసవ పురాణము. ఇది నన్నయాదుల మార్గముకంటె స్పష్టముగా భిన్న

మయినది. ఇది కేవలము మతగ్రంథము. సులభమైన శైలిని ద్విపదలలో, జాను తెనుఁగున రసము ఉట్టిపడునట్లు, ఆవేశ మేర్పడునట్లు వ్రాయబడిన గ్రంథము. ఇందలి కథలు చాకళ్ళు, మంగళ్ళు, బోయలు మొదలయిన శివభక్తులను వారి మహిమలను వర్ణించునవి. వైదిక మత సంప్రదాయములుగాని, సంస్కృత కావ్యములలోని వర్ణనలుగాని, శృంగార రస ప్రాధాన్యముగాని విశేషము లేక, దేశీయములయిన పలుకుబళ్ళతో వ్రాయబడినది. తెనుఁగుతన ముట్టిపడునట్టి గ్రంథము. ఈతడు వ్రాసిన పండితారాధ్య చరిత్రమును నిట్టి గ్రంథమే యనవచ్చును. కాని వేదములనుండియు, భాష్యముల నుండియు, పురాణములనుండియు, వచనముల నెత్తి యందు చొప్పించి యుండుటచే సంస్కృత భాషా ప్రాముఖ్యము ఉండక తప్పినదిగాదు. తానెంత తప్పించుకొని దేశీయ వాఙ్మయ విధానము ననుసరింపనలెనని ప్రయత్నించినను, ప్రామాణికమైన యపార సంస్కృత వాఙ్మయము నెట్లీతడు కాదని తన సిద్ధాంతమును నిలువ బెట్టుకొనగలడు ? సామాన్యులకుగూడ నీతని రచనలపై గౌరవము గలుగవలెనన్న నీతని సంస్కృత పాండిత్యము చూపించియే తీరవలయును. ఇతర మత ఖండనము స్వమత స్థాపనకును నిట్టిది తప్పనిదాయెను. శ్రీపతి పండితుడు, శివలెంక మంచన, మల్లికార్జున పండితుడు ఈయనకు పూర్వులు. వీరు ఆరాధ్య సంప్రదాయమువారే. వారును భక్తులు, కవులు, మత ప్రవర్తకులునయి యుండిరి. శ్రీపతి పండితుని యాంధ్ర గ్రంథములు లభింపవుగాని యీయనను

గుఱించి తరువాతివారు గొప్పగా పేర్కొనిరి. మల్లికార్జున పండితారాధ్యులు తన శివతత్త్వసారమున శ్రీపతి పండితుని పేర్కొనెను. మల్లికార్జున పండితుని చరిత్రమును పండితారాధ్యచరిత్ర మనుపేర పాల్కురికి సోమనాథుడు గొప్ప గ్రంథముగా వ్రాసెను. పండిత త్రయము సంప్రదాయము నెఱింగి అనేక గ్రంథకర్తయైన పాలకురికి సోమనాథునిచే వీరశైవవాఙ్మయ మను నొక నూతనశాఖ ప్రతిభావంతమయి ప్రకాశించినది. ఈతని బసవపురాణము రసవంతమయిన ఉత్తమ కావ్యము. శైవ సిద్ధాంత నిరూపకము. ఈతని వృషాధిపశతకము భక్తిపూరితమయినది. యథావాక్కుల అన్నమయ్య యను నతడు సర్వేశ్వర శతకమును క్రీ. శ. 1242 లో వ్రాసెను. శైవగ్రంథమే యయినను బసవ పురాణము శైలివంటి శైలిలో లేదు. కాకతీయ గణపతి దేవునకు దీక్షనొసంగిన విశ్వేశ్వర దేశికులు శివతత్త్వరసాయన మను నాంధ్ర గ్రంథమును రచించినట్లు వినబడుచున్నది. ఆకాలముననే శివదేవయ్య యను నొక శివభక్తుడును గ్రంథములు వ్రాసినట్లు తెలియుచున్నది.

శివభక్తిని ప్రజలలో వ్యాపింప జేయుటకు కవులు అనేకములయిన భిన్నవాఙ్మయ ప్రక్రియలకు జొచ్చిరి. శతకములలో ప్రధానములైన వానిని రెంటిని ముందు పేర్కొంటిని. రావిపాటి త్రిపురాంతకుడను కవి పదమూడవ శతాబ్దమున త్రిపురాంతకోదాహరణమును వ్రాసెను.

శైవాచార సంగ్రహమను నొక గ్రంథమును 15 వ శతాబ్దమున కుంటముక్కల తిరుమలనాథుడు కేవలార్చనా

విధానమును గూర్చి వ్రాసెను. పిడుపర్తి సోమనాథుడు, బసవపురాణమును, పద్యకృతిగా వృత్తములలో 15 వ శతాబ్దమున రచియించెను. భక్తుల నిత్యపారాయణము కొఱకు రగడలు, అంతాదులయిన గద్యాలు, కవులచే వ్రాయఁబడినవి. శరణు బసవరగడ, పర్వత లింగరగడ, మల్లికేశ్వర గద్యము మొదలగురచనలు బయలుదేరినవి. శివతత్త్వబోధకములయిన యక్షగానములును ఆంధ్రవాఙ్మయమున వెలువడినవి.

పై వాఙ్మయము నంతటిని శైవవాఙ్మయమని వ్యవహరింతురు. ఈ శైవ వాఙ్మయమున, బసవేశ్వరారాధ్య సంప్రదాయములు రెండును ఎడనెడ గోచరించుచుండును. శైవవాఙ్మయములో కొంతభాగము యొక్క ముఖ్యలక్షణము, సంస్కృత ప్రభావము తగ్గించి దేశిరచనకు ప్రాధాన్యము నిచ్చుటయని ముందు వివరించితిని. పండిత త్రయముతో నారంభించిన శైవవాఙ్మయము తరువాత ఆరేడు శతాబ్దముల వఱకు నట్లే సాగుచునే యుండినది.

## తిక్కన కాలము

కవిబ్రహ్మ యయిన తిక్కనను గూర్చి కొంత ప్రసంగించితిని. ఈ ఆంధ్ర వాఙ్మయ ప్రపంచమును సృజించినవాడు నన్నయ యనియు, నిల్పినవాడు తిక్కన యనియు నొక మహాకవి చెప్పెను. నన్నయ పని, శబ్దసృష్టి, వ్యాకరణవిధానము, కావ్యరచనా మార్గము ఏర్పఱుచుటతోనే సరిపోయినది. మార్గము అతడు వేసెనేగాని దాని పూర్తి నొందించినవాడు తిక్కన. నన్నయ సృష్టికి రెండు

విధములయినవారు విరుద్ధులు. దేశభాషలో పవిత్రగ్రంథము లుండరాదనువారి చొప్పున భారతము తెనిగించుట తప్పు. తెనిగించిననాఁడుగాని తెనుఁగునకు ప్రాధాన్యము లేదు. సంస్కృతమును నిరాకరించి దేశ్యతాగుణము గావలెనని మొఱపెట్టు వారు రెండవ జాతివారు. ఈ యిరువురు విరుద్ధుల నతిక్రమించి నన్నయ తన మార్గము వేసెను. ఆ శైలినే అంత కంటె మెఱుఁగుపెట్టి మఱింత తెనుఁగుతనము నేర్పఱచి, తెనుఁగులోనికి ఆర్యవిజ్ఞానప్రవాహమును ప్రవేశపెట్టి జనులకు ధర్మార్థకామమోక్షము లనెడు చతుర్విధఫలములను గల్పించినాఁడు తిక్కన. పాలకురికి సోమనాథులు అనుసరించిన మార్గమునకు భిన్నమైన సాంస్కృతిక మార్గమును పాక్షికత లేనిదానిని, తెనుఁగుదన ముట్టిపడునట్లు, సకల వినీతిజ్ఞుడయిన తిక్కన తన భారత రచనవలన స్థిరపఱచుటచేత సమస్థులాతరువాత నా మార్గము ననుసరించిరి.

ఆయన నిర్వచనోత్తర రామాయణము, బహుశః భాస్కర రామాయణోత్తర• వర్తియై రామాయణమును పూర్తిగా నాంధ్రుల కందిచ్చినది. భారత, రామాయణములు రెండును ఆంధ్రవాఙ్మయ క్షేత్రమున స్థిరపడినవి. నాఁడు జనులలో భేదము కల్పించుచున్న శైవ వైష్ణవ భేదమును పోగొట్టుటకు హరిహరనాథోపాసనమును తిక్కన యుపదేశించి యున్నాఁడు. రామాయణము పైరీతి నుదయించుటయే గాక యిక్కాలము నన్నే తిక్కనకు గొంచెము ముందుగనే, ద్విపద రూపమున రంగనాథ రామాయణ మనుపేర పండిత పామరుల కెల్ల రకును నుపాదేయమై ఆంధ్రదేశస్థుల నానందాబ్ధిని ముంచినది. ఈ

కాలమునకు జేరిన మఱి యిరువురు కవులు మారన, కేతన యనువారలు ప్రశంసార్హులు. మారన తిక్కనకు శిష్యుఁడై మార్కండేయ పురాణమును దెనిగించెను. అప్పుడే రామాయణ మహాభారతములు దెనుగున స్థిరపడగా, పురాణములను దెనిగింపవలెనని మారన యారంభించుట యొక గొప్ప విషయము. పురాణములయందు భారతదేశము యొక్క మత సాంఘిక రాజకీయాది వివిధమయిన చరిత్ర కథారూపమున ప్రత్యక్షీకరింపబడినది. కేతన దశకుమార చరిత్ర మఱియొక క్రొత్తత్రోవ నప్పుడే త్రొక్కినది. పౌరాణిక గ్రంథములు నీతిదాయకములు నయినవి మాత్రమే తెనుఁగునకు దెచ్చుట గాక కల్పిత కథలుగా సంస్కృతమునను్న గద్య వాఙ్మయము తెనుఁగున నుండవలసిన దనుట స్థిరమైనది. పై గ్రంథములలో కావ్య ధర్మము నిబిడముగా నున్నను, పవిత్రత, మతము, నీతి మొదలయినవియు కొంత గలవు. అట్టివి ప్రధానముగా లేని కావ్యములు ఆనందజనకములు మాత్రమైనవిగా నుండవచ్చుననియు వానిని తెనుఁగులోనికి దేవలెననియు కేతన నిర్ణయించెను గదా! నన్నయ తిక్కనల తరువాత కవితా పద్ధతుల విషయమున నెల్లరును వారి ననుసరించినవారే యని చెప్పవచ్చును. ఇట్టి సందర్భమున కేతన మారనలు తిక్కన ననుసరించిరని చెప్పుటలో విశేషములేదు. కేతన వ్రాసిన వ్యాకరణము మరియొక నూతన మార్గమునకు దారితీసినది. అది శాస్త్ర గ్రంథ రచన.

తరువాత పేర్కొనదగినవారు ఎఱ్ఱన: 1300–1350: నాచన సోమన 1450. ఈ యెఱ్ఱన భారతారణ్య పర్వశేష

మును బూరించుటయే గాక, హరివంశమును, రామాయణ మును గూడ రచించెను. మిక్కిలి స్వల్పకాలము ఎడముండు నట్లే రామాయణము నలుగురు కవులచే వ్రాయబడినది. వ్యాస నిర్మిత మనదగువానిలో హరివంశమును ఎఱ్ఱన గ్రహించెను. ఈతఁడు ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితుఁడు. ఈతని నృసింహపురాణము మున్ముందు పేర్కొనదగిన ప్రబంధ సృష్టికి నొక మెట్టనక తప్పదు. నాచన సోమనాథుఁడు నవీనగుణ సనాథుఁడు. ఈతని ఉత్తర హరివంశము మొక విశిష్టత నందినది. మూలగ్రంథములోని రసవంతములైన ఘట్టములను మాత్రము గ్రహించి, గడుసుదనపు పోకడలతో వ్రాయగల్గిన మేటి నాచన సోముఁడు. కథ మూలములోనిదే యయినను నవ్యమైన రీతిని చమత్కార జనకములయిన సంభాషణము లతో వ్రాయుటలో నీతఁడు జోడులేనివాఁడు.

కొంచె మించుమించుగ ఈ సమయములో నుండినవాఁడు (1290 – 1330) రావిపాటి త్రిపురాంతకుఁడు లేక తిప్పయ. ఈతఁడు ప్రేమాభిరామ మను సంస్కృతరూపకమును వ్రాసె నని పేర్కొనబడినదిగాని యది లభింపలేదు. ఈతఁడు వ్రాసిన త్రిపురాంతకోదాహరణము మాత్రము సుప్రసిద్ధము. ఉదాహరణ వాఙ్మయమున మేలయినది. ప్రేమాభిరామ మను నది క్రీడాభిరామ మను గ్రంథమునకు మూలమనుటచే నీతఁడు శృంగార హాస్యరసములను; లోకవృత్తమును రచించుటలో గొప్ప నేర్పరి యనదగును. త్రిపురాంతకోదాహరణము ఈయన భక్తి ప్రపత్తులను జాటుచున్నది.

మడికి సింగన : 1375–1435. పద్మపురాణోత్తర ఖండమును, జ్ఞానవాసిష్ఠము, సకల నీతి సమ్మతము అను గ్రంథములను వ్రాయుటచే పురాణములు, వేదాంత గ్రంథములు, నీతి గ్రంథములు తెనుఁగునకు రావలసినవను నాతని ప్రయత్నము స్పష్టమగుచున్నది. నన్నయ తిక్కనాదుల మార్గమునే వీరనుసరించి పూర్తినొందించుచున్నారనుట నిశ్చితము.

పేరంరాజు జక్కయ: (1400) రచించిన విక్రమార్కచరిత్రము, అనంతామాత్యుఁడు (1380 – 1450) రచించిన భోజరాజీయమును ముందుజెప్పినవానికంటె భిన్నములయిన మార్గము గలవి. విక్రమార్క భోజరాజులు చారిత్రక పురుషులేగాని యతిలోక మహిమగలవారు. వీరిని సంబంధించిన కథలు నీతి ధర్మబోధకములు. దశకుమారచరిత్రము కేవల కల్పితకథ. ఇవియును గధలే యయినను, చారిత్రక పురుషుల నాశ్రయించుట వీనియందు విశేషము. కథా విధానమున వీరిశైలియు చాలప్రశస్తమయినదియే. ఈ కాలముననే 1400 సం. విశాఖమండలములోనుండి చళుక్య భూపతికి కృతిగా కావ్యాలంకారచూడామణి యను గ్రంథమును రచించి తెనుఁగువాఙ్మయమనెడి నిచ్చెనకు విన్నకోట పెద్దన మఱియొక మెట్టువేసెను. కావ్యాలంకార చూడామణి అలంకారశాస్త్రములోని సిద్ధాంతములను తెలుఁగువారి కందించునట్టి గ్రంథము. సంస్కృతమునందలి కావ్యాదర్శ ప్రతాపరుద్రీయాదుల వంటి గ్రంథములను బోలినది. ఈక్రొత్త ప్రక్రియను తెనుఁగునకు మిక్కిలి సమర్థతతో దింపినవాఁడీతఁడు. సంస్కృత కావ్యములలో నెన్ని మెఱుగులున్నవో యన్ని

యును తెనుఁగునకు దెచ్చియు నంతకంటె నధికమైన ప్రాస విశ్రమ నియమములను పాటించు క్లేశమున్నను తెనుఁగురచనలను తెనుఁగని, నిరాకరించు సంస్కృత పండితుల గర్వమును బేర్కొనెను. ఈ తరువాతనే కావ్యాలంకారసంగ్రహాది గ్రంథము లీజాతివి బయలుదేరినవి. 1385–1445 సంవత్సరములలో నుండెనని యూహింపదగిన గౌరన మహాకవి అసదృశమైన శైలిలో హరిశ్చంద్రోపాఖ్యానమును, నవనాథ చరిత్రమును ద్విపద కావ్యములుగా వ్రాసెను. ఇవి స్వతంత్రములయిన గ్రంథములే. అధారములు సంస్కృతమున నున్నను కవులయొక్క స్వేచ్ఛ, కల్పనాశక్తి, శబ్దసృష్టి, సన్నివేశకల్పన ప్రత్యక్షముగా కనుపట్టును. ధార యసదృశము. ఈతడు శైవమతాభిమానము గలవాడు.

శ్రీనాథుని కాలము 1380 — 1440. నన్నయ తిక్కనల తరువాత నాంధ్రవాఙ్మయమున స్వతంత్రఖ్యాతితో ననేక మార్గముల వెలయించిన మహాత్ముడు శ్రీనాథుడు. ఈతడు మహా విద్వాంసుడు. ఈయన త్రొక్కని మార్గమే లేదు. వాదసరణిలో డిండిమభట్టు నోడించినాడు. జీవితమంతయు రసమయమొనర్చి తన రచనలలో నెల్లను తన రూపును దృగ్గోచరముచేసి తెనుఁగు వాఙ్మయమును బ్రోచి రక్షించినవాడు శ్రీనాథుడు. ఈతని పల్నాటివీరచరిత్రము ద్విపదకావ్యములమేటియైన రసగుళిక. తెలుఁగుదేశపు కథ, తెలుఁగు జీవనము ప్రతిబింబించినట్లువ్రాసి సజీవమూర్తులను సృజించె నీతడు. సంస్కృతముననున్న ప్రౌఢకావ్యములు

తెనుఁగునకు దేదగినవని శృంగార నైషధమున నిరూపించి సంస్కృతప్రౌఢిని తెలుఁగునుడికారము వెలయించెను. హరవిలాస భీమేశ్వర కాశీఖండములు క్షేత్రమాహాత్మ్యములకు, శివపారమ్యబోధకును, కవితాప్రౌఢిమకును ఎనలేని నిధులు. అందలి పౌరాణిక మూర్తులు తెనుఁగునాటజనించిన యవతారమూర్తులై తెనుఁగువారగుట యీ మహామహుని ప్రతిభవలననేగదా. ఈయన వ్రాసినదనబడు క్రీడాభిరామ మొక విచిత్రమయిన గ్రంథము. దీనికి మూలము ప్రేమాభిరామము. కవి యెవ్వరయినంగావచ్చును. నిత్యజీవితములోని వృత్తము నింతటి రసోదంచితముగ వ్రాసిన గ్రంథ మాంధ్రవాఙ్మయములోనే లేదనవచ్చును. శ్రీనాథుడు నవ్యవాఙ్మయమార్గములోనే గాక, శైలియందును కల్పనలలోను, శబ్దసృష్టియందును అప్రతిముడై యాంధ్రవాఙ్మయమున శాశ్వతుడైనాడు. క్రీడాభిరామము వినుకొండ వల్లభరాయలచే వ్రాయబడెననుట గ్రంథమున నున్నది. సత్యమెట్టున్నను మనకు దాని ప్రత్యక్షరమున గన్పించుమూర్తి శ్రీనాథుఁడే. ఈయన చాటువులు, ఆంధ్రదేశమున చిరస్థాయులు. వానియందే యొక వైశిష్ట్యము గలదు.

ఆంధ్రవాఙ్మయములో పేర్కొనవలసినది తాళ్లపాక వారి సంప్రదాయ మొకటి. కేవల భక్తి ప్రధానమైన గేయకావ్యములను ద్విపదకావ్యములనువ్రాసి వారి యిష్టదైవతమగు శ్రీ వేంకటేశ్వరులను సేవించిరి. శ్రీ వేంకటేశ్వర క్షేత్రమును, దైవతమును గూర్చిన గొప్ప వాఙ్మయము ఆంధ్రదేశమున బయలుదేరి జనులను తరింప జేసినది.

ఈ వాఙ్మయమున తాళ్ళపాక వారిలో ప్రథముడగు అన్నమాచార్యుల (1408 - 1503) శృంగార సంకీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలు తెనుఁగున వైశిష్ట్యమును పొందినవి. ఆయన భార్యయయిన తిమ్మక్క సుభద్రాకల్యాణ మను ద్విపదను రచించినది. పెద తిరుమలాచార్యులు (1460 - 1547), సంకీర్తనలు, సీసపద్యముల శతకము, సుదర్శన రగడ, వెంకటేశ్వర వచనములు మొదలయిన వివిధ వాఙ్మయ జాతుల గ్రంథములను రచించి ఆంధ్ర వాఙ్మయ మును వృద్ధి పఱచెను. రేఫరకార నిర్ణయము, ఆంధ్ర భగవద్గీత మొదలగునవి యీతని శాస్త్రగ్రంథములు. ఈ సంప్రదాయమువారే చిన తిరుమాలాచార్యుడును, పెద తిరు మలాచార్యుని కొమరుడు తిరువేంగళనాథుడును. ఈ తిరు వేంగళనాథుడు పరమయోగి విలాసము, అష్టమహిషీ కళ్యా ణము, అను ద్విపద కావ్యములను రచించి వైష్ణవ సంప్ర దాయమును వెలయించెను.

శ్రీనాథుని యుగమని పేర్కొనఁదగిన (1350 - 1500) యీ కాలములో వాఙ్మయశాఖా బాహుళ్యము ముఖ్య లక్షణము. శ్రీనాథుని గ్రంథములలోనే, నన్నయ తిక్కనల యనువాదసరళిగాక మూలము ననుసరించిన స్వతంత్ర కల్పనలతో గూడిన గ్రంథములు, నైషధమువంటి ప్రౌఢ కావ్యముల తెనుఁగుసేత, చాటువులు, క్రీడాభి రామము వంటి ప్రాదేశిక జీవన ప్రతిబింబము గల రచనలు, బయలుదేరినవి. తాళ్ళపాకవారి సంప్రదాయము వెలసినది. బమ్మెర పోతనామాత్యుడు (1450 - 1500) ఈ కాలము

నసే ఆంధ్ర మహాభాగవతమును వ్రాసెను. భక్తి రసమై మహా ప్రవాహముగా ప్రవహించిన ఈ గ్రంథమును మనుజే శులకు కృతియివ్వక భాగవతమ్ము జగద్ధితంబుగా తెనిగించిన యీ సుకృతి, రాజులకు, మంత్రులకు, ధనాధిపతులకు కృతు లిచ్చి లక్షలాదిగ ధనము సంపాదించిన శ్రీనాథునకు ప్రతిస్పర్థి యనక తప్పదు. రెండును రెండు భిన్నమార్గములలో భిన్న రూపములు ధరించి ప్రభవించిన మూర్తులు. శృంగార శాకుంతలమును జైమినీ భారతమును రచియించి వాణి నారాణి యనగలిగిన పిల్లలమర్రి వీరనయు నీ కాలమువాడే. శృంగార శాకుంతల రచనమును ముందటి యుగ రచనకు మార్గదర్శక మయినది. ఈతని జైమిని భారతముతో భారతకథా ప్రధాన మయిన రచన మఱియొకటి బయలువెడలిన ట్లయినది. దగ్గుబల్లి దుగ్గన తన నాసికేతూపాఖ్యానమును, కాంచీపుర మాహాత్మ్యమునురచియించిస్వతంత్రప్రబంధరచనకుమార్గదర్శ కులలోనొకడయ్యెను. నాసికేతుచరిత్రమున ఉపనిషద్గతమును, భారతోదితమును నయిన యుత్కృష్ట కథ స్వతంత్ర కావ్య ఫక్కిని బయల్వెడలినది. దూబగుంట నారాయణకవి రచించిన పంచతంత్ర మను పద్యకావ్యము సంస్కృతమునందలి నీతి ప్రధానము లయిన కథాసంపుటిని తెలుఁగునకు దెచ్చినది. కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక యను కావ్యమును వ్రాసి హరిహరున కంకితము చేసెను. విక్రమార్కుడు భోజరాజు అను నీ యిద్దరు పురుషులను సంబంధించిన దీకథారచన. నంది మల్లయ ఘంట సింగయ యను కవు లీ యుగముననే ప్రబోధ చంద్రోదయమును వరాహపురాణ

మును వ్రాసిరి. వేదాంత విషయ ప్రధానమయిన యీ రూప కమును తెనుఁగున శ్రవ్యకావ్యముగ వ్రాయుట యొక విశేషమే. వరాహపురాణము, ఇంతకుముందే బయలుదేరిన పురాణ రచనకు జెందినదే. ఈ కాలమునకు కొంచెము వెనుక నుండినవాడు వేమారెడ్డి. ఈ మహామహుడు తెనుఁగు కవులలో ప్రత్యేకత నందినవాడు. సంస్కృత విజ్ఞాన వర్షము ఆంధ్ర ప్రపంచమున వెల్లివిరిసి, తెనుఁగు ధారగా బయలు దేరిన యూట యీయన కవితారూపము. పదాడంబరము లేక భావస్ఫూర్తి గలిగి, తెనుఁగుతనము పరిపూర్ణమయి, వేదాంతము, లోక వృత్తము నీతి, మొదలగు సర్వవిషయ ములను, రసగుళికలవలె సృజించిన యీయన కవితామృతము తెనుఁగు దేశమున నాబాలగోపాలము ననుభవించినదే. ఈతనిదే తెనుఁగు కవిత్వమున విశేషోక్తికాదు. ఇతర కవు లనేకుల విషయమునందు వలెనే, ఈతని కాలమును గూర్చియు భిన్నాభిప్రాయములు కలవు.

ఈ తరువాతి కాలము 1500 – 1600 వఱకు నుండిన కృష్ణదేవరాయల స్వర్ణయుగము. తెలుఁగు రాజుల సామ్రాజ్యము తెలుఁగు మంత్రుల మంత్రశక్తి తెనుఁగు కవుల దివ్య ప్రతిభ యిక్కాలమున ప్రజ్వరిల్లినది. రాయలు సంస్కృత కర్ణాట, తమిళాంధ్ర భాషల నన్నిటిని పోషించినను దేశంబు తెనుఁగు, 'దేశభాషలందు తెనుఁగు లెస్స' అని చెప్పు కొనెను. ఈయన కాలమున అష్టదిగ్గజములను మహాకవు లుండిరి. తెనుఁగు వాఙ్మయమున విశిష్టమని మనమిప్పుడు వాకొను ప్రబంధ రచనా విధానము ఈ కాలమున స్థిరపడినది

దీనికిని సంస్కృతమునందే మూలము, గలదు. అష్టాదశ వర్ణనములనుగూర్చి, రాజాద్యుత్తమ నాయక చరిత్రమును వ్రాయు పక్కి ఈనాటి తరువాతివారిలో చాలమందికి రాచబాట యయిపోయినది. ఇందు మార్గదర్శకుడు అల్లసాని పెద్దన. ఈతని మనుచరిత్రము తెనుఁగువారికి తెనుఁగు పంచ కావ్యములలో మొదటిదిగ పఠనీయముగ నున్నది. ఇందలి వరూధినీ ప్రవరాఖ్య పాత్రలు మిక్కిలి ప్రసిద్ధములు. నంది తిమ్మన్న పారిజాతాపహరణమున సత్యభామపాత్ర యొక విశిష్ట కల్పనము. సత్యభామ తన భర్తయగు శ్రీకృష్ణుని పాదముతో తన్నుట యను కథాంశమునకు మూలము శ్రీకృష్ణరాయల యంతఃపుర చరిత్రమున జరిగిన యొక సంఘటనము అని విమర్శకు లనుచున్నారు. కాని దీనికి ప్రమాణము లేదు. మాదయ్యగారి మల్లన యను కవి రాజశేఖర చరిత్ర యను నొక ప్రబంధమును వ్రాసినది, ఈ యుగముననే. నాదెండ్ల గోపమంత్రి యను నాయన కృష్ణార్జున సంవాద మను నొక చిన్న ద్విపద కావ్యమును ఇక్కాలముననే వ్రాసెను. ఈతడు కృష్ణదేవరాయలకు మంత్రియైన తిమ్మరుసునకు మేనల్లుడు. ఈతడు గుత్తి దుర్గమునకు, కొండవీటికిని పాలకుడై యుండెను. దుర్గ పరిపాలకులు, దండనాథులు, గ్రామకరణము లయినవారు తాము పండితులను ప్రోత్సహించి గ్రంథములు కృతినందుటయే కాక, స్వయముగా కావ్యములను రచించుచుండుట యొక ముఖ్యమయిన యాచార మిక్కాలమున నుండినది. ఇందుకు ఆదర్శపురుషుడు శ్రీకృష్ణదేవరాయలు.

ఈయన సంస్థానమున నిరంతరము కవితాగోష్ఠి జరుగుచుండెడిది. శాస్త్రవాదములు జరుపుచు పండితులు కావ్యవిమర్శన చేయుచుండినట్లు స్పష్టముగా దెలియుచున్నది. అల్లసాని పెద్దన, నంది తిమ్మన మొదలగు కవు లనేకులు అగ్రహారములను రాయలవలన పొందిరి. రాయలు స్వయముగా పల్లకినెత్తి అల్లసాని పెద్దనగారి నూరేగించినవాడు. రాయల సామంతులును దండనాథులును రాయలను అనుసరించుచుండినవారనుట వింతగాదు గదా! శ్రీకృష్ణదేవరాయలు అనేక సంస్కృతాంధ్ర ప్రబంధములను వ్రాసినట్లు నిదర్శనములు గలవు. ఆయనవ్రాసిన ఆముక్తమాల్యద ప్రౌఢమయిన ప్రబంధము. అనేక విషయములు గలిగి గొప్ప వర్ణనలతో నొప్పారుచు ఆంధ్రవాఙ్మయమున కొక యలంకారముగా నున్నది. ఆ గ్రంథమునుండి యానాటి యాంధ్రదేశజీవన విధానమున కొన్ని విశేషములు మన మెఱుఁగ నగును.

రాయల సంస్థానమున నుండిన యష్టదిగ్గజము లెవ్వరను విషయము వివాదస్థము. అల్లసాని పెద్దన, నంది తిమ్మన, ధూర్జటి, మాదయగారిమల్లన, అయ్యలరాజు రామభద్రుడు, పింగళి సూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు అనువారి యష్టదిగ్గజములని వాడుక. పై వారిలో కొందరు రాయలకాలమున మిక్కిలి చిన్నవా రయినట్లు ఇతర ప్రమాణములచే నూహించుట కవకాశము లున్నవి. పై వారిలో అయ్యలరాజు రామభద్రుడు రామాభ్యుదయమను ప్రబంధమును వ్రాసెను. ధూర్జటి కాళహస్తి

మాహాత్మ్యమను స్థలపురాణమును ప్రబంధముగా వ్రాసి ప్రసిద్ధి పొందెను. ఈతని కాళహస్తీశ్వర శతకము మిక్కిలి సరసమై కవి మనోవృత్తులను దెలుపుచున్నది. ఈకాలమున తెనుఁగు కవులు స్వతంత్రులయి స్వతంత్ర కల్పనలతో సంస్కృతము నందున్న మూలగ్రంథములను మించిన రచనలుచేసి మెప్పు గాంచిరి.

తెనాలి రామకృష్ణకవి (1500—1560) పాండురంగ మాహాత్మ్యమను పేరుగల ప్రౌఢప్రబంధమునువ్రాసి తెనుఁగున నొక శాశ్వతాలంకారము నొసంగెను. ఈతని పేరు ఆంధ్ర దేశమున అనేక విధములయిన కథలతో హాస్యరస ప్రధాన మగు సన్నివేశములతో గూడియున్నది. ఈతని రచనలో హాస్యరచనా వైశిష్ట్యము గలదు. పింగళి సూరన ఆంధ్ర వాఙ్మయమున నొక ప్రత్యేకవ్యక్తి. ఈయన రాఘవ పాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నమును గొప్ప ప్రసిద్ధివహించినవి. రామాయణ, భారత కథలను రెంటిని జతచేసి యొక్కసారిగా నొక్క కావ్యమును సంస్కృతాంధ్రముల భాషా పాటవమును మాధుర్యమును నిరూపింప గలిగినాడు. ఇంతకుముందు రాఘవ పాండవీయమను గ్రంథ మొక్కటి సంస్కృతమున నుండినది, గాని యది యీ యాంధ్రగ్రంథమున కేవిషయమునను సరిరాదు. కళా పూర్ణోదయముతో ఆంధ్రవాఙ్మయమను నాకాశమున పూర్ణ చంద్రోదయమయినది. ఇందలి కల్పనలు, కథాచాతుర్యము, సన్నివేశములు, పాత్రలసృష్టి మొదలయిన విశేషములు క్రొత్తమార్గమున జరిగినవి. అనేకములయి వేర్వేరు స్వభా

వములుగల పాత్రలు దీనియందు ప్రవేశముగాంచి యున్నవి. భారతమునందు ఎన్నియో పాత్రలున్నను వారిని సృజించిన వాఁడు వ్యాసుడు. నన్నయ తిక్కనలు గారు. ఇందు కొన్ని పాత్రల పేళ్లు, వీరిస్వభావము, వీరు కథావిధానమున రూపించిన స్వీయ ప్రత్యేకత, అభిరుచులు, అన్నియు సూరనగారి ప్రతిభ వలన నేర్పడినవి. ఇంతకుముందున్న తెనుఁగు కవుల ప్రతిభ పయి యనేక విషయములలో ప్రాచీన సంస్కృత కవులు ఏర్పఱచిన యొకానొక యెల్లిక నాధారముచేసికొనియే ప్రస రించినది. ఈయన ఆసీమల నతిక్రమించి కేవల స్వతంత్రమై యుజ్జ్వలమైన మార్గమున సంచరించినాడు. స్వర్గ మర్త్య లోకము లన్నిటియందును అకుంఠితముగా ప్రసరించిన దీయన కల్పన. ఇక వర్ణనలలోను పద్యరచనలయందును శైలి లోను భావములయందును గూడ నీ కావ్యమొక నూతనతను ఆంధ్రవాఙ్మయమునకుఁ బ్రసాదించినది.

ఈతనితో సమకాలికుఁడైన భట్టుమూర్తి లేక రామరాజ భూషణుడు అను నొక మహాకవి శారదామూర్తి యనదగినవాఁడే. సూరనకును మూర్తికిని కొంత స్పర్థ పరస్పర జిగీషయు ఉండిన దనవచ్చును. బట్టుమూర్తి, బట్టుకులమున బుట్టి తన వాతావరణమున నేర్పడిన యడ్డంకుల నతిక్రమించి పాండిత్యమును కవనశక్తిని సంపాదించి యభివృద్ధికి వచ్చిన వాఁడు. కృష్ణరాయల యాస్థానమున నుండిన పెద్దనాదికవుల కడ శిష్యుడుగా నుండెనని కథలు గలవు. ఆతని వసుచరిత్ర కావ్య మొక విచిత్రమయిన యుత్తమరచన. మనుచరిత్రమను ప్రబంధము ప్రసిద్ధమైయుండ దానిని అన్ని విధములను

మించవలెనని వ్రాసిన సంకల్ప మందు కన్పట్టుచున్నది. ఒక్క వసుచరిత్రమను ప్రబంధమునేకాక ఆజాతి గ్రంథములలో నిది తలమానికమనియు దీని నెక్కుడనుకరించుటయే కావ్య రచనా పరమావధియని యూహించి పిల్ల వసుచరిత్రములను రచించిన కవులనేకులు తరువాత బయలు దేరిరి. శబ్దశక్తివలనను అర్థశక్తివలనను సందర్భానుసారముగ స్ఫురించు భావములు, అర్థాంతరములు, అలంకారములు, చమత్కృతులు లెక్కకు మిక్కిలి యిందు గలవు. ఈతని హరిశ్చంద్ర నలోపాఖ్యానము సూరన మార్గము ననుసరించి, సూరన గ్రంథము నతిక్రమింప వలెనను ప్రయత్నముతో వ్రాయబడినట్లు తోచును. కాని సూరన కవితా మాధుర్యము ఇందు లేదని చాలమంది యభిప్రాయము. ఈతడు వ్రాసిన కావ్యాలంకార సంగ్రహము తెనుఁగు అలంకార గ్రంథములలో నొక విశిష్టతను సంపాదించి విన్నకోట పెద్దన పెట్టిన మార్గమును ముందునకు దెచ్చినది.

కృష్ణదేవరాయల యుగముతో తెనుఁగు వాఙ్మయము అనెడు ప్రవాహము బహుముఖముల ప్రవహించినది. గ్రంథ వైవిధ్యము, మార్గముల భిన్నత, కవులకు స్వాతంత్ర్యము ఏర్పడినది. ఈ లక్షణము లన్నిటను ప్రాచీన సంప్రదాయములు ఊతగా నేర్పడి చక్కని క్రొంగ్రొత్త సృష్టి సిద్ధమయినది. రాయల కాలమున తంజావూరు మధుర రాజ్యములు ఏర్పడి అందు తెలుఁగు రాజులు స్థిరపడుటచే నచ్చట ఆంధ్ర వాఙ్మయమును కవులును అభివృద్ధి గాఁజొచ్చిరి. దానివలన దక్షిణదేశ వాఙ్మయము అనబడు నొక విశిష్టశాఖ బయలు

చేరి ప్రత్యేక లక్షణములతో ఆదేశముల యందు వర్థిల్లినది. దానిని గూర్చి ప్రత్యేకముగ వ్రాయబడును.

ఈ యుగమునకు సంబంధించిన యితర ప్రసిద్ధ కవులనేకులు గలరు. వారివారి గ్రంథములలోని రచనలలో గల విశేషములు, నవ్యత కొంచెము నిరూపింపబడును. ఈ కాలమున బయలుదేరిన వైజయంతీవిలాస మనబడు నొక హృద్య గ్రంథమును సారంగు తమ్మయ (1510) యను నాతడు రచించెను. శైవభక్తుల చరిత్రములు, వీరశైవ వాఙ్మయమున చేర్కొనబడినవి. అట్లే వైష్ణవ యోగుల చరిత్రములును దక్షిణ దేశమున మిక్కిలిగాఁ బ్రచారములో నున్నవి. ఆ చరిత్రములలో నొకటైన తొండర డిప్పొడి యాళ్వారు కథ యిందు హృద్యముగా వ్రాయబడినది. నాయికా నాయకుల విషయమునను, రసపోషణయందును ఇందొక ప్రత్యేకత గలదు. అట్లే పన్నిద్దరు ఆళ్వారుల చరిత్రములను పరమయోగి విలాసమను పేర తాళ్ళపాక చిన్నన్న (1556) రచియించి యున్నాడు. వెన్నెలకంటి సూరన (1550) యను కవి రచియించిన విష్ణుపురాణము, పురాణశాఖకుఁ జెందినది. ఈ కాలమున సంకుసాల నృసింహకవి రచితమయిన కవికర్ణ రసాయనము అను గ్రంథము కొంత వైశిష్ట్యము వహించినది. కృష్ణదేవరాయలచే గౌరవింపబడిన చింతలపూడి యెల్లనార్యుడు రచించిన రాధామాధవము అనునది రాధామాధవుల శృంగారమును వర్ణించిన గ్రంథము. శృంగారరసము వర్ణించు పట్ల నితర ప్రబంధకవుల మార్గమునే యనుసరించినను ఈతడు రాధను మాత్రము పరకీయగా గాక స్వీయగా వర్ణించినాడు.

ఈ రాధ పరకీయగా వాఙ్మయమున ప్రశస్తి కెక్కినది. దాని విచారణము ఆశాఖయందు చేయబడును. పచ్చకప్పురపు తిరువేంగళనాధుడను కవి (1500–1560) వ్రాసిన చొక్కనాథ చరిత్రము, సంస్కృతమునందలి హాలాస్య మాహాత్మ్యము అను గ్రంథమునకు తెనుఁగు. చొక్కనాథుడను దేవుని యొక్క లీల లిందు వర్ణితములైనవి. బైచరాజు వేంకటనాథు డను కవి (1550) పంచతంత్రమును తెనిఁగించెను. ఈ గ్రంథ మింతకుమున్నే యొకసారి తెనిఁగింపబడినది. కలిదిండి భావనారాయణకవి (1550) విష్ణుపురాణమును తెనిఁగించెను. కంటముక్కల తిరుమలనాధకవి (1510) శైవాచార సంగ్రహము అను నొక శైవపూజా విధానాదికమును తెలుపు గ్రంథమును వ్రాసియున్నాడు. లింగముకుంట రామకవి(1550) మత్స్యపురాణము, వామనపురాణము అనువానిని తెనిఁగించి పురాణశాఖ నభివృద్ధిచేసెను. లింగముకుంట తిమ్మకవి యను నతడు పైకవికి తమ్ముడు సులక్షణసారము అను నొక లక్షణ గ్రంథమును రచియించెను. ఇది తెనుఁగు కవిత్వము వ్రాయు టకు పద్యలక్షణముల నెఱుగదలచు నభ్యాసకులకు మిక్కిలి యుపయోగకరముగా నున్నది. శంకరకవి యనునతడు హరిశ్చంద్రోపాఖ్యానమును చంపువుగా వ్రాసెను. ఈ కావ్యమునే గౌరన యింతకుముందు ద్విపదగా వ్రాసెను. తరువాత కంచి శరభకవి యను నాతడు మఱల నీ కథనే గ్రహించి చంపువుగా వ్రాసెను. ఈ కాలముననే భాస్కరాచార్యులను కవి వైశ్యపురాణమును వ్రాసెను. ఇందు వైశ్యుల యుత్పత్తియు వాసవీకన్యయొక్క చరిత్రమును.

వర్ణింపబడినవి. ఈమెయే కన్యకాపరమేశ్వరి యను పేరి నేఁడు వైశ్యులచే నారాధింపబడుచున్నది. మొల్లయను నొక కవయిత్రి రామాయణ కథను సంగ్రహముగా వ్రాసినది. కావ్యూరి యెల్లయకవి (1600) బ్రహ్మాండ పురాణములో నొక భాగమును దెనిఁగించెను. 1547 వ సంవత్సరమున దోనూరి కోనేరుకవి ద్విపద భాగవతమును రచియించెను. పద్యబాల భాగవత మను గ్రంథమునుగూడ నాతఁడే రచి యించెను. తరిగొప్పుల మల్లన (1600) వ్రాసిన చంద్రభాను చరిత్రము ప్రబంధపక్కిలోనున్న యొక గ్రంథము చదువ దగినదియే. అద్దంకి గంగాధరకవి యను నాతఁడు తపతీ సంవరణోపాఖ్యానమును వ్రాసి మల్కిభరాముఁడు అను మహమ్మదీయ ప్రభువున కంకిత మిచ్చెను. మహమ్మదీయ ప్రభువులును ఆంధ్రవాఙ్మయమును పోషించిరనుటకు పైవిషయ ముదాహరణము. అద్దంకి గంగాధరకవి, పొన్నగంటి తెలగన (1550) యను కవులు పై సంస్థానమున కవులుగా నుండిరి. తెలగన్న యయాతిచరిత్రమను అచ్చ తెనుఁగు కావ్యమును వ్రాసి మల్కిభరామునికడ నుద్యోగిగానున్న అమీనుఖానునకు కృతి నిచ్చెను. ఇందలి వైశిష్ట్యము భాషావిషయము. పూర్వకవులందరును తత్సమభూయిష్ఠ మయిన భాషను వ్రాయగా తత్సమములను బరిహరించి, కేవల మచ్చ తెనుఁగున వ్రాయుటకు సాహసించుట యీతని క్రొత్తత్రోవ. ఈ త్రోవ ననుసరించి (1750) లో కూచిమంచి తిమ్మకవి, నీలాసుందరీ పరిణయమును, అచ్చ తెనుఁగు రామాయణమును వ్రాసెను. ఎలకూచి బాలసరస్వతి యను

నొక కవి (1600) భర్తృహరిచే సంస్కృతమున వ్రాయబడిన నీతి శృంగార వైరాగ్యములను గూర్చిన శతకములను మల్లభూపాలుని పేరి సంబుద్ధితో తెనిఁగించెను. ఇది యొక నూత్న గ్రంథమును దెనుఁగునకు తెచ్చుటయే. ఈయన మార్గమునే యనుసరించి తరువాత ఏనుగు లక్ష్మణకవి (1780) పుష్పగిరి తిమ్మనయు నాంధ్రీకరించి యుండిరి. ఎలకూచి బాలసరస్వతి ఆంధ్రశబ్దచింతామణి కొక వ్యాఖ్య తెనుఁగు వచనమున వ్రాసి వ్యాకరణరచన కుపకారకు డయ్యెను. కట్టా వరదరాజు (1630) అను నాతడు రామాయణమును మఱల ద్విపదకావ్యముగా వ్రాసెను. ఇంతకుముందే రంగనాథ రామాయణము సుప్రసిద్ధమయి ప్రచారములో నుండినది. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణమును చంపువుగా వ్రాసెను. తిక్కన ఇంతకు ముందే నిర్వచోత్తర రామాయణము వ్రాసెను.

పయిని నిరూపింపబడిన కూచిమంచి తిమ్మకవి (1680–1760) యు నతని తమ్ముడగు జగ్గకవియు ఆంధ్ర వాఙ్మయ సేవ జేసిరి. మొదటివాడయిన తిమ్మకవి సర్వ లక్షణసారసంగ్రహము అను పేరుగల యొక పద్యలక్షణ గ్రంథమును వ్రాసెను. ఇందు వ్యాకరణము విషయము. రసికజన మనోభిరామము మొదలయిన యితర గ్రంథములు ఈతడు వ్రాసెను. ఈతని తమ్ముడు జగ్గకవి (1700–1760) చంద్రరేఖావిలాపము అను నొక గ్రంథమును వ్రాసెను. ఇది అసభ్యముగా నుండునుగాని కవి తన ప్రతిభాదికమును ఈర్ష్యకు పాలుసేసి యొక నూతన మార్గమును సృజించెను.

పూర్వకవుల ఉత్తమ వర్ణనల కన్నింటికిని విరుద్ధములయిన వర్ణనలను నైచ్యాపాదకములుగా కల్పించుట యిందలి విశేషము. కవి ప్రతిభావంతుడే. అడిదము సూరకవి యను నాతడు (1730–1780) కవిజనరంజనమను పిల్ల వసుచరిత్రము రామలింగేశ్వర శతకము, కవి సంశయ విచ్ఛేదము, ఆంధ్రచంద్రాలోకమును వ్రాసెను. ఈతని కవిసంశయ విచ్ఛేదమునందు గొంత వైశిష్ట్యము గలదు. గణపవరపు వేంకట కవి యను నాతడు చిత్రకవిత్వము బంధకవిత్వము అను రచనలు విశిష్టముగా గల ప్రబంధరాజపరమేశ్వర విలాసమును వ్రాసెను. మంగళగిరి ఆనందకవి యను నతడు (1750) క్రైస్తవుడయి వేదాంత రసాయన మను గ్రంథమును, యేసుక్రీస్తు చరిత్రమును ప్రబంధపాకమున వ్రాసెను. పిండిప్రోలి లక్ష్మణకవి యను నాతడు (1770–1840) లంకా విజయమను గ్రంథమును రెండర్థములు గలిగిన తిట్టు కావ్యముగా వ్రాసెను. ఇతని శత్రువగు ధర్మారాయుడను నతనిపై నీశ్లేష కావ్యము వ్రాయబడెను. ఇది యొక విశేషమే.

కృష్ణదేవరాయల యనంతరము ఆంధ్రవాఙ్మయ లక్ష్మి దక్షిణదేశమున ననేక భూమికలతో తంజాపురము, మధుర రాజ్యముల (1600–1770) వఱకును స్వీయవిలాసముల నెఱపినది. అందలి మోహాశృంగారాది లక్షణములును చాయలును తెనుఁగునాటఁగూడ చిత్రకవి సింగనార్యుని బిల్హణీయముననను (1750) చెళ్ళపిళ్ళ నరసకవి (1800) యామినీ పూర్ణతిలకావిలాసముననను గనుపించుచున్నవి. కృష్ణదేవరాయల యనంతరము దక్షిణదేశ వాఙ్మయమును బరి

హరించినచో పేర్కొనదగిన వైశిష్ట్యము కనుపట్టను. భట్టుమూర్తి పింగళి సూరన మొదలయిన మహామహులు గతించిన తరువాత ఆంధ్రవాఙ్మయము విశాలమయి బహు శాఖా విలసితమయి పోవుటచేత తరువాతి కవులకు పూర్వులు వ్రాసిన సంస్కృతానుకృతులనే మఱల మఱల వ్రాయుట ఆచారమయినది. భారతము నొకరు ద్విపదగాను, నొకరు వచనముగాను, తిరిగి రామాయణమునే మఱికొందరు మఱియొక అనుసరణగ్రంథముగను వ్రాయజొచ్చిరి. 1750–1850 వఱకు గల కాలమును క్షీణయుగమని గొందరు వ్యవహరించుచున్నారు.

ఆంధ్రవాఙ్మయమున ముఖ్యములైన యుగములు మూడు అని ముందే సూచించితిని. నన్నయ ముందటిది కేవల మజ్ఞాత యుగము. నన్నయనుండి పందొమ్మిదవ శతాబ్ది వఱకును సంస్కృతానుసరణము ముఖ్యలక్షణముగా గల యుగము అని స్థూలముగా చెప్పవచ్చును. మూడవది పాశ్చాత్య విజ్ఞాన ప్రభావము, స్వాతంత్ర్యేచ్ఛ మొదలగునవి గల నవ్యయుగమని చెప్పవచ్చును. 1611 వ సంవత్సరములో మచిలీపట్నములో ఆంగ్లేయులు ఫ్యాక్టరీ స్థాపించిరి. వారి యధికారముతోపాటు వారి విజ్ఞాన ప్రభావమును అఖిల భారతదేశమునందు వలెనే, ఆంధ్రదేశమునను, వాఙ్మయమునను సర్వతోముఖముగ ప్రసరించినది. మంగళగిరి ఆనందకవి వ్రాసిన వేదాంత రసాయనము, పాశ్చాత్య ప్రభావమును జూపుటలో నొక తొలిచాయ.

ఆతని తరువాత సి. పి. బ్రౌను దొరగారు 1824 లో తెనుఁగు పఠింపనారంభించి పండితుఁడయి తెనుఁగు వాఙ్మయమునకు మహోపకారమును చేసెను. ఆ తరువాత శ్రీ కందుకూరి వీరేశలింగంగారు (1848—1919) ఆంధ్ర వాఙ్మయముయొక్క నవ్యయుగ నిర్మాణమునకు అనేక మార్గములను జూపి యుగస్థాపకులయిరి. ఆంధ్రవాఙ్మయమున అనేకశాఖలు ఉప్పతిల్లినవి. నేటి భారతీయ వాఙ్మయములలో ఆంధ్రవాఙ్మయ మొక యుత్తమ వాఙ్మయముగా పరిగణింపబడుచున్నది.

తెనుఁగు కవుల రచనలగు సంస్కృతానుసరణములు మొదలగువాని గొప్పదనమును తక్కిన దేశభాషలలోనున్న యనువాదములు మొదలయినవి పఠించినవారు చక్కగా తెలిసికొనఁ గలరు. తరతమ భావజ్ఞానమునఁగాని యీ విషయ మెఱుఁగరాదు.

ప్రాచీనాంధ్రవాఙ్మయము రాజపోషణమున చాలగా పెఱుగుటచేత తెనుఁగునాట పాలించిన రాజవంశముల క్రమమును వాఙ్మయముతో వారికి గల సంబంధమును గొంచెము స్థూలముగా నెఱుఁగ నగును. ఆంధ్రదేశము నందలి రాజచరిత్రము ఆంధ్రు లనబడెడి శాతవాహనులతో ప్రారంభమగుచున్నది. వీరు సుమారు క్రీ. పూ. 220 — క్రీ. వె. 230 వఱకును ముప్పదిమంది రాజులు పాలించిరి. వీరి శాసనములన్నియు ప్రాకృతములోనే యున్నవి. వీరి వాఙ్మయము సత్తస ఈ (గాథాసప్తశతి), ప్రాకృతభాషలో నున్నది. వీరి తరువాతివారు ఇక్ష్వాకులు. వీరును సుమారు (225 - 275)

ఏబది సంవత్సరములు పాలించిరి. వీరి శాసనములును ప్రాకృత ముననే యున్నవి. తరువాతఁ బేరొక్కొనదగినవారు బృహత్ఫలాయన గోత్రులయిన రాజులు (300 – 310) వీరి శాసనములు ప్రాకృతమే. పల్లవుల శాసనములు క్రీ. పె. 250 మొదలు సుమారు 600 సం. వఱకును గనుపట్టుచున్నవి. ఇందు మొదటి భాగములోని శాసనములు ప్రాకృతమున నున్నవి. తరువాతి శాసనములలో సంస్కృత భాషలో వ్రాసినవిగూడ నున్నవి.

ఆనంద గోత్రజులు 375—500 వఱకును నేటి ఆంధ్ర దేశమున గొంత భాగమును పాలించిరి. వీరి శాసనములలో సంస్కృతము ప్రాకృతముగూడ నున్నవి. శాలంకాయనులు 325—500 వఱకును బాలించిరి. వీరి శాసనములు ప్రాకృత ములో నున్నవి. విష్ణుకుండినులు 500—610 సం. వఱకును పాలించిన ట్లూహింపనగును. వీరి శాసనములు సంస్కృత ములో నున్నవి. ఇంతవఱకును తెనుఁగునకు ప్రాముఖ్యము లేదు. మొదట ప్రాకృతమునకును, ఆ తరువాత సంస్కృ తమునకును బ్రచారము. తరువాతి తూర్పు చాళుక్యుల పాలనములో 616—1022 వఱకును తెనుఁగు శాసనములును సంస్కృత శాసనములును బయలువెడలినవి. తెలుఁగు తూర్పు చాళుక్యుల పాలనములో, రాజాదరణమును బొంది వైజ్ఞానిక భాష యయినది. ఆంధ్రమహాభారత రచన నన్నయచే సుమారు 1050 లో జరిగియుండును. 1118 వఱకును వీరి వంశజుడయిన కులోత్తుంగ చోళుని పాలనము జరిగినది. వీరి రాజధాని రాజమహేంద్రవరము. వీరి

కాలములోని మొదటి కవులు నన్నయయు నారాయణ భట్టును. వీరు ఆంధ్రవాఙ్మయ స్రష్టలు. నన్నిచోడుడు ఈకాలమువాడే యనవచ్చును. పావులూరి మల్లన, వేములవాడ భీమన యీ కాలమువారే యనవచ్చును. గణితశాస్త్రమును పద్యములలో వ్రాసిన పావులూరి మల్లన యొక్క పూర్వులు రాజరాజుచే గౌరవింపబడి రనవచ్చును. పయిని చెప్పబడిన తూర్పు చాళుక్యవంశజులవారు తరువాతి కాలములో నక్కడక్కడ బలవంతులయి ఆంధ్రవాఙ్మయ మును పోషించిరి. అట్టివారిలో విశ్వేశ్వరభూపుడు, విన్నకోట పెద్దనను పోషించెను. కాని వీరిది సామ్రాజ్యముకాదు. కాకతీయ సామ్రాజ్యము 1120 నుండి 1330 వఱకును ఓరుగల్లు రాజధానిగా వర్ధిల్లినది. ఇక్కాలమునం దనేక కవులు అభివృద్ధినందిరి. తెనుఁగు వాఙ్మయమున శైవశాఖ యభివృద్ధినొందినది. శ్రీపతి మల్లికార్జున పండితులు, పాల్కురికి సోమన యిక్కాలమువారే. మంత్రి భాస్కరుడు, తిక్కన, అన్నమయ్య, కేతన, మారన, మంచెన మొద లయిన మహాకవుల వలన ఆంధ్రవాఙ్మయము మిక్కిలిగా నభివృద్ధినందినది. వీరిలో గొందరికి రాజపోషణము ఉండి నదని యూహింపవచ్చును. రంగనాథుడును, గోన భూపతియు ఈకాలమువారే.

ఆ తరువాత రెడ్డిరాజుల పరిపాలనము. రాజమహేంద్ర వరమును (1385–1434) కొండవీడు పురమును (1325–1430) రాజధానులుగా రెండుశాఖలు ప్రబలినవి. వీరి కాలమున ఆంధ్రవాఙ్మయమునకు గొప్ప పోషణము లభించినది.

వీరిలో గొందరు రాజులు స్వయంకృతికర్తలు. పండితులు. కాటయవేమారెడ్డి కాళిదాస నాటకములకు వ్యాఖ్యవ్రాసెను. పెదకోమటి వేమారెడ్డి (1400-1420) అమరుక కావ్యమునకు శృంగారదీపికయను వ్యాఖ్యానమును రచించెను.

రెండవ సింగమనాయనికి (1389-1400) సర్వజ్ఞ బిరుదము లభించినది. తరువాత మాధవభూపతిరావు(1417-1430) శ్రీమద్రామాయణమునకు వ్యాఖ్య వ్రాసెను. కుమారగిరి భూపాలుని కాలమున వసంతోత్సవములు ప్రబలి కవులకు గౌరవము జరుగుచుండెను. ఈకాలమునందలి కవులలో భారతశేషమును పూర్తిచేసిన యెఱ్ఱాప్రగ్గడ ఆంధ్రవాఙ్మయమును విస్తరింపజేసిన శ్రీనాథుడు ముఖ్యులు. శ్రీనాథుడు రెడ్డిరాజ్యమున విద్యాశాఖాధిపతి. నాచన సోముడు ఇక్కాలమువాడే. మడికి సింగన యిక్కాలముననే అనేక గ్రంథములను రచించెను.

తరువాత వెలసినది విజయనగర సామ్రాజ్యము. 1335 మొదలు 1485 వఱకును సంగమవంశమువారు విజయనగరమును పాలించిరి. వీరికాలమున సంస్కృతాంధ్రాదిక భాషాకవులకు ప్రోత్సాహముండినది. ఈ కాలముననే ఆంధ్రదేశముయొక్క కొంత భాగము రెడ్డిరాజులచే పాలింపబడుచుండినట్లు ముందే నిరూపించితిని. జక్కనకవి, వినుకొండ వల్లభరాయుడు, దూబగుంట నారాయణకవి, దగ్గుబల్లి దుగ్గన, పిల్లలమఱ్ఱి పినవీరన, నంది మల్లయ్య, ఘంట సింగయ మొదలయిన కవులు ఈనాడే యుండిరి. శ్రీనాథుడు ప్రౌఢ దేవరాయల యాస్థానమున కనకాభిషేకమందెను (1408 సం,

కావచ్చు). ఆ తరువాత సుమారు రేఁడెనిమిదేండ్లు సాళువ వంశజులును తరువాత 1570 వఱకును తుళువ వంశజులును పాలించిరి. ఇక్కాలమున కప్పుడే ఆంధ్రవాఙ్మయము విశాలమయిపోయి యనేకమార్గములలో విలసిల్లినది. వీరిలో (1509–1529) శ్రీకృష్ణదేవరాయలకాలమున ఆంధ్రవాఙ్మయ మహాలక్ష్మి స్వర్ణ సింహాసనాసీనురాలయినది. రాయలు మహాకవి. అష్టదిగ్గజములచే ఆంధ్రవాఙ్మయ ప్రపంచభారము వహింపబడినది. అల్లసాని పెద్దన మొదలుకొని పింగళిసూరన వఱకు గలిగిన మహాకవులనుగూర్చి ముందు ముచ్చటింపబడినది. ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున దివ్యప్రభతో వెలిగిన మహామహులు వీరు.

తుళువవంశము తరువాత విజయనగర సామ్రాజ్యము సంకుచితమయిపోయి ఆరవీటివంశజుల పరిపాలన సాగినది. పెనుగొండ చంద్రగిరి రాజధానులుగా 1706 వఱకును వర్ధిల్లినది. పదునారవశతాబ్ది ఉత్తరార్ధమున ఆరవీటి రాజులను, వారి జ్ఞాతులును సామంతులునగు నంద్యాల ప్రాంతముల రాజులను ఆశ్రయించిన భట్టుమూర్తి, పింగళి సూరన్న మొదలగువారి చరిత్రము లిదివఱకే తెలుపఁబడినవి. విజయనగరమునుండి ఆంధ్రవాఙ్మయలక్ష్మి దక్షిణముననున్న నాయకరాజుల యాస్థానమున బ్రవేశించినది. 1549–167 వఱకును తంజావూరున తెనుఁగు సరస్వతి విశేషార్చనల నందినది. రఘునాథనాయకుఁడు విజయరాఘవుఁడు ప్రభువులయి యనేక గ్రంథముల వ్రాసిరి. అచ్చటి చేమకూర వేంకటకవి

మొదలగు ననేకులఁగూర్చి స్థలాంతరమున (దక్షిణాంధ్రయుగ వాఙ్మయ వ్యాసమున) ప్రస్తావింపబడును.

తరువాత ఉత్తరాంధ్ర దేశమున రాజ్యమంతయు చిన్న చిన్న ప్రభువులచేతులలో బడిపోయి విభక్తమయిపోయినను అందరు ప్రభువులును ఎంతో కొంతవఱకు కవులను పోషించుచు కృతుల నందుచునే యుండిరి. ఆంధ్రవాఙ్మయము ఆంధ్ర రాజులచేతను, గ్రామాధిపతులగు కరణముల చేతను, నియోగి ప్రభువులయిన మంత్రివర్యుల చేతను ధారావాహికముగా పోషింపబడుచునే యుండినది.

ప్రాచీనాంధ్రవాఙ్మయమున వెలసిన శాఖలను సంగ్రహముగా నీ క్రిందిరీతిని పేర్కొనవచ్చును. 1. భారత రామాయణములు. 2. పురాణములు. 3. శతకములు. 4. ప్రబంధములు. 5. యక్షగానములు. 6. ద్వ్యర్థి కావ్యములు. 7. ఉదాహరణములు. 8. గేయవాఙ్మయము. 9. ద్విపద వాఙ్మయము. 10. స్థలపురాణములు. 11. కథా వాఙ్మయము. 12. శాస్త్ర వాఙ్మయము. 13. వచన వాఙ్మయము.

**1. భారత రామాయణములు :—** 1. భారత రామాయణములును పురాణములు నొక్కటెగగా భావింపవలసినవే గాని యీ రెండిటియందును కావ్యధర్మములు విశిష్టములుగా నుండుటవలనను, నవి మిక్కిలి ప్రచారములో నుండుటవలనను వానిని వేరుగా నెన్నవచ్చును. సుమారు 1050 లో నన్నయచే నారంభింపబడిన భారతము సుమారు 200

సంవత్సరములకు తిక్కన, యెఱ్ఱనల వలన పూర్తియైనది. ఇదియే ఆంధ్రవాఙ్మయమునకు మూలస్తంభము. ఇది గద్య పద్యమయము. పిల్లలమఱ్ఱి పినవీరన (1450 – 1500) జైమిని భారతమును తెనిగించెను. వ్యాసభారతమునే ద్విపదగా తిమ్మయ, సోమన, బాలసరస్వతి యను ముగ్గురు, 16, 17 శతాబ్దముల నడుమ మఱల తెనిఁగించిరి.

రామాయణములలో మొదటిది భాస్కరరామాయణము. ఇది మంత్రి భాస్కరుఁడో హుళక్కి భాస్కరుఁడో తెనిఁగించెను. భారతమువలెనే యిదియును అనేక కవులచే పూరింపబడినదిగానే కన్పట్టుచున్నది. ఎఱ్ఱాప్రగ్గడ (1300 – 1350) రామాయణమును వ్రాసెనని చెప్పుకొనెనుగాని యది లభింపలేదు. రంగనాథుఁడో లేక గోన బుద్ధారెడ్డియో (ఇంకను వివాదస్థమే) రామాయణమును ద్విపదరూపమున వెలయించిరి. కట్టా వరదరాజు రామాయణమును మఱల ద్విపద రూపమున (1600) వెలయించెను. తిక్కన వీరికి మున్ను ఉత్తర రామాయణమును నిర్వచనముగా తెనిగించెను. కంకంటి పాపరాజు సుమారు 1625 సం. లో దీనినే తిరిగి చంపువుగా తెనిగించెను.

నవ్యయుగమునను భారత రామాయణభాగవతములు మఱల మఱల పలువురచే తెనిగింపఁ బడుచునే యున్నవి. నవ్యులలో మూడింటి యథామూలకాను వాదముల నొక్క చేతిమీఁదుగా నిర్వహించినవారును గలరు. ఉ. కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

2. పురాణములు :— ఈ జాతి గ్రంథములు 18 మహాపురాణములు 18 ఉపపురాణములు వ్యాసునిచేత వ్రాయబడినవని సంస్కృతమునందు ప్రచారములో నున్నవి. వీనియందు దేశచరిత్ర, సంఘచరిత్ర, నీతి, ధర్మము, క్షేత్ర ప్రాశస్త్యము మొదలయిన యనేక విషయములు కథారూపమున విరివిగా చేర్పబడి యుండును. ఈ పురాణము పంచ లక్షణము గలదిగా కవులు పేర్కొనియున్నారు. సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము అనునవి వీని పేళ్లు. ఈ గ్రంథములు మతవిషయమును శివ విష్ణుదేవతా ప్రాధాన్యమును గూడ నిరూపించుచునుండును. అగ్నిపురాణమున అలంకారశాస్త్రాదుల సంగ్రహముగూడ నున్నది. స్కాందపురాణము మహావిశాలమయి యనేక క్షేత్ర మాహాత్మ్యాదులు వ్రతవిధానములు మొదలగువానిని గూడ చేర్చుకొనియున్నది. భారతీయుల వైజ్ఞానిక, మత, నైతిక జీవితములకు నాదర్శములు అయిన యీ సంస్కృత గ్రంథము లెవ్వ రెప్పుడు వ్రాసిరనునది చరిత్రాత్మకముగ విమర్శింపబడి యనేకాభిప్రాయ భేదములకు నాలవాలమయి యున్నది. వాని రచనాకాల మెప్పుడయినను, నన్నయ కాలముననే బ్రహ్మాండాది నానాపురాణములు తెనుగు దేశమున ప్రచారములో నుండినవని యాతని భారతములోని 'బ్రహ్మాండాది నానాపురాణనిరతు' అను పదమువలన నెఱుగ నగును. ఈ వాఙ్మయమంతయు అఖిలభారతమునకు సంబంధించినదే, ప్రాదేశిక మాత్రముగాదు. దీనిని చాలవఱకు కవులు తెనుగులోని కనువదించిరి. మారన మార్కండేయ

పురాణము; శ్రీనాథుని కాశీఖండ, భీమఖండములు; స్కాంద పురాణాంతర్గతములు; మడికి సింగన పద్మపురాణము; హరి భట్టు మత్స్య కూర్మ నారసింహ పురాణములు; నంది మల్లయ ఘంట సింగయల వరాహపురాణము; పింగళి సూరన్న గరుడ పురాణము. విష్ణుపురాణము, దేవీభాగవతము, లింగపురాణము, బ్రహ్మాండ పురాణము, వాయుపురాణము, వామన పురాణము, భవిష్యోత్తర పురాణము మొదలయినవి తెనుఁగులోనికి స్వేచ్ఛానువాదములుగా వెలసినవి.

3. శతకములు :— శతకము అనగా నూరు అని యర్థము. నూరు పద్యములు గలిగిన యొక కావ్యవిశేషమున కీపేరు రూఢమయినది. తెనుఁగున నిట్టి శతకకావ్యము లనేకములు రచియింపబడి యాంధ్రభాష కలంకారములుగా నొప్పుచున్నవి. శతకసంఖ్యకు ఒక విధమయిన ప్రాముఖ్యము వేదకాలమునుండియు నుండినది. ప్రాకృతము నందలి కావ్యములలో నూఱుపద్యములు లెక్కగా వ్రాయబడిన గ్రంథము లుండినవి. హాలుని పేర సప్తశతి యని సంకలనము చేయబడిన ప్రాకృత గ్రంథము తెనుఁగుదేశమునకును తెనుఁగునాటి జీవనమునకును గొంత సంబంధముగలది. సంస్కృతమున భర్తృహరి సుభాషితములు మూడు శతకములు ప్రసిద్ధములు. మయూరుడు వ్రాసిన సూర్యశతకము సుప్రసిద్ధము.

ఇట్లు ప్రసిద్ధములైన శతకముల ఛాయ ననుసరించి తెనుఁగున శతకవాఙ్మయము బయలుదేరినది. సుమారు ఆరువందల శతకములు కనబడినవని శతకవాఙ్మయ కర్తలు చెప్పిరి. ఈ శతకములకు సాధారణముగా నొక మకుటము

అనగా తుది నొక నామము సంబోధనముగా నుండును. 'సర్వేశ్వరా, సుమతి' మొదలయిన నామములు తుదిని మకుటములు కాఁగా నా శతకముల కాపేళ్ళతోనే సర్వేశ్వర శతకము, సుమతి శతకము అను నామములు రూఢములు. సుమారు 12వ శతాబ్దమునుండిన వాడనదగిన పండితారాధ్యుల రచనను గూర్చి, వివరించుచు శతకము అను గ్రంథనామము పేర్కొనబడినది. ఆ తరువాతి వాడయిన సోమనాథుడు వ్రాసిన వృషాధిప శతకము, అన్నమయ్య వ్రాసిన సర్వేశ్వర శతకమును ప్రసిద్ధములు (1242). ఈ శతకములు భక్తిజ్ఞాన వైరాగ్య శృంగారములు, నీతులు, లోకవృత్తము మొదలగు నవి విషయములుగా రచింపబడినవి. తెనుఁగువాఙ్మయమున నీ శతక మొక వైశిష్ట్యమును బొంది పండిత పామరుల యాదరమును గాంచినది. ముందు జెప్పిన రెండును గాక ధూర్జటి కాళహస్తీశ్వర శతకము చాల ప్రసిద్ధమైనవానిలో నొకటి. 18, 19 శతాబ్దములయందీ శతకములకు విశేష మయిన ప్రచారము ఉండినది. కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వరశతకము, తెనిఁగింపబడిన భర్తృహరిశతకములు, (ఏనుగు లక్ష్మణకవి) భాస్కర శతకము, సుమతి శతకము, రఘువీర శతకము, దాశరథీ శతకము, నరసింహ శతకము, బాలగోపాల శతకము మొదలయిన శతకము లనేకములు తెనుఁగుదేశమున ప్రచారములోనున్నవి. ఈ శతకములను బెక్కింటిని భక్తి, శృంగారము మొదలయిన విషయముల ననుసరించి విభజించి సంపుటములుగా వావిళ్ళవారు ప్రచురించి యున్నారు.

4. ప్రబంధములు :— ప్రబంధము అను శబ్దము మిక్కిలి ప్రాచీనకాలమునుండియును కావ్యసామాన్యపరముగా సంస్కృతమున వాడబడుచుండినది. కాళిదాసు తన మాళవికాగ్నిమిత్ర మను దృశ్యకావ్యమును ప్రబంధముగా పేర్కొనెను. కాలక్రమమున తెనుఁగున 'ప్రబంధము' అను పదము ఒక వాఙ్మయజాతికి వాచకముగా వాడబడుచున్నది. సంస్కృతమున రఘువంశము, కుమారసంభవము మొదలయిన పంచకావ్యములను తెనుఁగు దేశమునందలి పండితులు చదువుకొని కాలక్రమమున, నందలి వర్ణనలు, మొదలయిన వాని నాధారముగా జేసికొని రచనలు చేయుచు వచ్చిరి. తిక్కన భారతమునందలి పర్వములను కథలను ప్రబంధమండలిగా పేర్కొనెను. ఎఱ్ఱాప్రగడ నృసింహాపురాణము, నాచనసోముని ఉత్తర హరివంశము, పిల్లలమఱ్ఱి పినవీరభద్రన శృంగారశాకుంతలము, శ్రీనాథుని నైషధము బయలు దేరిన యనంతరమే ప్రబంధమనుపేర ఒక కావ్యజాతికి పేరుగా ఉపయోగించు నవకాశములు బయలుదేరినవి. మనుచరిత్రము, ఆముక్తమాల్యద, పారిజాతాపహరణము మొదలయినవి ప్రబంధములుగా మనమందరము పేర్కొనుచున్నాము. వస్త్వైక్యము, ఏకనాయకాశ్రయత్వము, రసప్రాధాన్యము, వర్ణనాప్రాచుర్యము, శయ్యానైగనిగ్యము మొదలైన లక్షణములుగల యొక విశిష్ట సాహిత్యప్రక్రియ ప్రబంధమని సామాన్యముగా బేర్కొనబడుచున్నది. ఈ రీతిని వ్రాయబడిన కావ్యము లనేకములను తరువాతివారును వ్రాసి వాని నక్కడక్కడ ప్రబంధములని వాసు

చుండుటచేత 'ప్రబంధము' అను పేరు తెనుఁగున పయి యర్థవిశేషమున రూఢమయిపోయినది. ఈ ప్రబంధశాఖయు తెనుఁగున నొక వైశిష్ట్యమును బొందినది.

5. **యక్షగానములు :—** యక్షగానములు అను పేర తెనుగున అనేకములయిన గ్రంథములు వ్యవహృతములుగా నున్నవి. ఈ యక్షగానములు కన్నడమున గూడ నున్నవి. యక్షగానము అను శబ్దమునకు, యక్షులయొక్క గానము లేక జక్కులపాట యని యర్థము. పేరినిబట్టి చూచినచో నిది మొదట నొక పదముగా నిరువురు ముగ్గురచే పాడబడు చుండెననవచ్చును. అట్టి పాట లిప్పటికిని బుఱ్ఱకథలని పాడ బడుచునే యున్నవి. కాలక్రమమున ఈ యక్షగానములలో వేషములు బయలుదేరి దృశ్య ప్రబంధరీతులు పొడసూపినవి. క్రమముగా నివియే తెలుఁగు నాటకము లయినవి. వీనికి దక్షిణదేశ వాఙ్మయమున ముఖ్యముగా తంజావూరు సంస్థాన మున గొప్ప ప్రాముఖ్యము ఏర్పడి రాజాదరణము గలిగినది. రఘునాథుడు, విజయ రాఘవుడు తాము స్వయముగా యక్షగానములను వ్రాసియు వ్రాయువారిని ప్రోత్సహించియు ఈ వాఙ్మయశాఖను ముందునకు దెచ్చిరి. ఆ సంస్థానమున ఒక నాటకశాల యేర్పడి ఈ దృశ్యకావ్యములు మిక్కిలిగా ఆడబడుచున్నవి. ఇందు సంగీతము, పదకవిత్వము, ప్రబంధ ముల చాయలు, కథా వైవిధ్యము మొదలగునవి కలిసి వీని కొక వైశిష్ట్యమును సంపాదించినది. ఇందు ఆంధ్రవాఙ్మయ విధాన సర్వస్వ మున్నదని యొకరు స్థాపించిరి. ఈ శాఖలో ప్రోలుగంటి చెన్నశౌరి వ్రాసినదని చెప్పబడు సౌభరి

చరిత్రము మొదటి దనవచ్చును. ఇది 15 వ శతాబ్దిదని యూహ. అలబ్ధము. ఆ తరువాత చక్రపురి వీర రాఘవా ర్యుఁడు వ్రాసిన విప్రనారాయణ చరిత్రము 16 వ శతాబ్ది పూర్వార్ధము; కందుకూరు రుద్రకవి వ్రాసిన సుగ్రీవ విజయము; 16 వ శ. ఉత్తరార్ధము ప్రసిద్ధములు. ఆ తరువాత కంకంటి పాపరాజు వ్రాసిన విష్ణుమాయా విలాసము. ఈ జాతిగ్రంథములు సుమారైదువందల వఱకును గలవు.

6. **ద్వ్యర్థికావ్యములు :—** ద్వ్యర్థి యనగా రెండర్థ ములు గలది. ఒక కావ్యమునకు వేఱు వేఱుగా రెండర్థములు చెప్పి రెండు కథలను జతచేసిన రచనలు తెనుఁగున నొక వాఙ్మయశాఖగా బయలు దేరినవి. ఇవియును సంస్కృతములో గలవు. రాఘవపాండవీయము ద్వ్యర్థిగా 'కవిరాజు' అను కవిచే వ్రాయబడినది. ఈతడు క్రీ. శ. 12 వ శతాబ్దివాడు.

తెనుఁగున పింగళి సూరన వ్రాసిన రాఘవపాండవీయమే యీ జాతిలో మొదటి గ్రంథమనక తప్పదు. భీమన అంతకు ముందు వ్రాసినట్లు వినబడుచున్నది గాని యది లభింపలేదని యాయనయే చెప్పెను. సంస్కృతాంధ్రములు రెండును మేళవించుటచేతను, సూరన ప్రతిభ యసదృశమగుటచేతను తెనుఁగు రాఘవపాండవీయముముందు ఆ పేరి సంస్కృత గ్రంథము దివ్వటిముందు దీపమువలె నుండును. తరువాత రామరాజభూషణుని హరిశ్చంద్ర నలోపాఖ్యానము ప్రసిద్ధ మైన ద్వ్యర్థికావ్యము. తరువాత మూడుకథలు జోడించిన రాఘవ యాదవ పాండవీయము అను గ్రంథమును ఎలకూచి బాలసరస్వతి వ్రాసెను. నలయాదవ రాఘవపాండవీయము

అను నాలుగు కథలు ఒక రచనలో నిముడించిన కావ్యమును గునుగుటూరి వేంకటకృష్ణకవి వ్రాసెను.

7. **ఉదాహరణములు :—** ఉదాహరణము అను పేరితో ఒక విధమయిన లఘుకావ్యము తెనుఁగున ప్రచారములో నున్నది. ఏడు విధములయిన విభక్తులతోడి పద్యములను ఒక ప్రధానవిషయ వర్ణనలో వచ్చునట్లుగా, కళికలు, ఉత్కళికలు, కృతిపతి నామాంకితముగా నున్న యితర పద్యములు గలిసి యీ చిన్న కావ్య మేర్పడును. కృతిపతి నామమునుగూర్చిన పద్యము ఒకటి అన్ని విభక్తులతో గూడిన పద్యమొక్కటియు గలిగి సుమారు ముప్పది పద్యములవఱకును నిండుండును. ఇందలి కళికోత్కళికలు తాళ ప్రధానములైన పలురకముల రగడల వికృతులైన గేయములు. ఈ కావ్యములు సంస్కృతమునగూడ నున్నవి. ప్రాచీనములయిన కాళిదాసు కావ్యములలో ఉదాహరణములు గేయములుగానున్నట్లు ఊహించుట కవకాశములు దొరకుచున్నవి గాని వాని స్వరూప స్వభావము లెఱుకపడవు. తెనుఁగునందు పాల్కురికి సోమనాథుడు వ్రాసిన బసవోదాహరణము తెనుఁగు ఉదాహరణములలో మొదటిది. రావిపాటి త్రిపురాంతకుని త్రిపురాంతకోదాహరణము మిక్కిలి ప్రసిద్ధము. సుమా రిరువదివఱకును ఈ యుదాహరణములు లభించుచున్నవి. ఈ కావ్యముల లక్షణము సంస్కృత కావ్యలక్షణ గ్రంథమైన ప్రతాపరుద్రీయమున సూచింపబడినది. తెనుఁగు లక్షణగ్రంథముల యందును ఈ యుదా

హారణ లక్షణము వివృతమయినది. ఈనాడును ఎడనెడ ఉదాహరణకావ్యములు రచింపబడుచునే యున్నవి.

8. గేయవాఙ్మయము :— గేయ మనగా, తాళ లయాబద్ధముగా పాడుటకు తగినదని యర్థము. మనము చదువు భారత రామాయణములకును, పాడుకొను పాటలకును భేదము గలదు. అందలి పద్యములనుగూడ కొంతవఱకు రాగముచే చదువవచ్చును. కాని అందలి రాగాదులకు ప్రాధాన్యము ఉండదు. పద్యగేయ వాఙ్మయముల రెంటను గొంత అర్థము, కొంత గేయత్వమును ఉండకతప్పదు. వాల్మీకి రచితమయిన రామాయణమును మొదట కుశలవులు తాళ లయాబద్ధముగా గానముచేయుచుండినట్లు తెలియుచున్నది. గాని నేటి తెనుఁగు రామాయణము మనకు పద్యమయముగా దొరకుచున్నది. కుశలాయకము మొదలయిన పాటలు ప్రత్యేకశాఖగా లభించుచున్నవి. తెనుఁగు వాఙ్మయము యొక్క ఉత్పత్తియే గేయముగా నుండునని మొదట సూచించితిని. కావున నీ వాఙ్మయజాతి ప్రాచీనత నెన్న నలవిగాదు. శివగీతము లుండినట్లు పండితారాధ్య చరిత్రమునుండి ఆధారము పేర్కొనబడినది. వీరగాథలు కావ్యములుగా దేశమున వినబడుచునే యున్నవి. జానపద వాఙ్మయములో గేయశాఖ చాల ప్రాధాన్యము వహించినది. శ్రీనాథుని క్రీడాభిరామమున జక్కులపాటలు పేర్కొనబడినవి. భక్తి గీతములలో సుప్రసిద్ధములు తాళ్ళపాకవారి (15, 16 శ) సంకీర్తనములు ప్రధానములు, ఉత్తమములు. శృంగార గేయములలో క్షేత్రయ మువ్వగోపాల పదములు మిక్కిలి

ప్రసిద్ధములు. అవి అభినయమునకును బనికివచ్చునట్టివి. త్యాగయ్య కృతులతో తెనుఁగువారి ప్రతిభ పరాంకోటి నందినది. ఆ మహానుభావుని రచనలు సుప్రసిద్ధములయి దక్షిణ హిందూస్థానమున అమృతమయవాహినివలె ప్రవహించుచున్నవి. పల్నాటి వీరకథ, బొబ్బిలిరాజుకథ, దేశింగురాజుకథ, బంగారు తిమ్మరాజుకథ మొదలగునవియు గేయములుగా నేడు ప్రచారములో నున్నవి. ఈ వాఙ్మయ శాఖకు పల్లెటూళ్ళలో మిక్కిలి యాదరము గలదు.

9. ద్విపద వాఙ్మయము :— ద్విపద మనునది యొక ఛందస్సు. కావ్యము నంతటిని ఈ ఛందస్సులోనే వ్రాయుట యీ వాఙ్మయ లక్షణము. ఈ ఛందస్సులో గానమునకు గూడ ననుకూలమయినట్లు సామాన్యులకు నర్థమగునట్లు గ్రంథములు వ్రాయబడుచుండినవి. వీనికిని, పద్యప్రబంధములకును, కథ, అర్థము, భావములు మొదలగువానిలో విశేష భేదములేదు. కేవల బాహిరస్వరూపమున మాత్రమే భేదము. ద్విపద వాఙ్మయములో మిక్కిలి ప్రాచీనమయినవిగా లభించునవి పాల్కురికి సోమన బసవపురాణము, పండితారాధ్య చరిత్రము మొదలయినవి. రంగనాథ రామాయణము, తరువాత మిక్కిలి ప్రసిద్ధమయిన గ్రంథము. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, నవనాథ చరిత్రము ఈ శాఖలో మిక్కిలి ప్రసిద్ధము లయినవి. భారతము భాగవతముగూడ ద్విపద బద్ధములుగా వ్రాయబడినట్లు ముం దుదాహరించితిని. ఈ శాఖలో ననేక గ్రంథములు గలవు.

10. స్థలపురాణములు :— ఈ పేరుగల కావ్యములకే క్షేత్రమాహాత్మ్యములు అని పేరు. ఈ శాఖలోని గ్రంథములు పద్యగద్యమయము లయిన చంపువులుగా నున్నవి. వీనిలో మొదటి దనదగునది ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము. ఇది అహోబలక్షేత్ర ప్రాశస్త్యమును జెప్పును. ఒక డనేక పాపములుచేసి తుదకు క్షేత్రమును దర్శించియో క్షేత్ర స్వామిని స్తుతించియో స్వర్గమును బొందుట యీ కథలలో సామాన్యాంశము. శ్రీనాథుని కాశీఖండము, భీమఖండము, తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యము, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము, చాల ప్రసిద్ధములయిన ప్రౌఢ గ్రంథములు. ఈ క్షేత్ర మాహాత్మ్యములకు కొన్నిటికి మూలములు స్కాందపురాణమున గలవు. సాధారణముగా ప్రతి క్షేత్రమునకును ఒక మాహాత్మ్య ప్రతిపాదకమయిన గ్రంథము లభించుచుండును. శ్రీరంగమాహాత్మ్యము, వేంకటాచల మాహాత్మ్యము, హాలాస్యమాహాత్మ్యము మొదలయినవి నూటికంటె నధికముగా తెనుఁగు వాఙ్మయమున గలవు. ఈ జాతి గ్రంథములలో గొన్ని యక్షగాన రూపమునను నున్నవి.

11. కథా వాఙ్మయము:— ఈ పేర తెనుఁగులోని ప్రాచీన కావ్యములను గొన్నిటిని విడదీయవచ్చును అని ముందు తెలిపితిని. వీనిలో మిక్కిలి ప్రాచీనమయినది కేతన దశకుమార చరిత్రము. మంచెన కేయూర బహుచరిత్రము జక్కన విక్రమార్కచరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయము, కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, నారా

యణ, వేంకటనాథ భానుకవుల పంచతంత్ర నామక కావ్యములు, పాలవేకరికదిరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణకవి హంసవింశతి మొదలయినవి ఈ శాఖలోనివి. పై వానికన్నిటికిని సంస్కృతమున నాధారములు గలవు.

**12. శాస్త్రవాఙ్మయము :**—రసప్రధానమయిన కావ్యవాఙ్మయ మెట్లు సంస్కృతమునుండి తెనుఁగును బ్రవేశించినదో యట్లే శాస్త్రవాఙ్మయము గూడ సంస్కృతమునుండి తెనుఁగున ప్రవేశించినది. 11 వ శతాబ్దికే తెనుఁగునాటి కవులకును పండితులకును సంస్కృతమునందలి శాస్త్రవాఙ్మయము మిక్కిలి పరిచితమయిన దే. శాస్త్రవాఙ్మయము విషయబోధయే ప్రయోజనముగా గలది గావున నందు ఆనందజనకత యను ధర్మముపయిని దృష్టియుండదు. తెనుఁగున బయలుదేరిన శాస్త్రవాఙ్మయము గూడ కావ్యవాఙ్మయము వలెనే గద్యపద్యాత్మకమయిన చంపూరూపమున నావిష్కారము నందినది. పావులూరి మల్లన వ్రాసిన గణితము మొదటి శాస్త్రగ్రంథ మనవచ్చును. బద్దెన నీతి ముక్తావళి నీతి శాస్త్రమని మనము పరిగణింపవచ్చునా! నీతి కావ్యమార్గముతో మిళితమయియుండును గావున దీనిని కేవలము నీతి శాస్త్రమునకు సంబంధించినదానిగా నెంచ వీలులేదు. కేతన ఆంధ్రభాషాభూషణమును, విజ్ఞానేశ్వరీయమును వ్రాసి తెలుఁగు రచనలో వ్యాకరణశాస్త్ర ధర్మశాస్త్రములకు మొదటివాడయ్యెను. వేములవాడ భీమన వ్రాసినదని చెప్పబడు కవిజనాశ్రయము ఛందశ్శాస్త్రమునకును, అలంకార శాస్త్రములోని కొన్ని విషయములకును మొదటిది. లింగము

కూచిమంచి తిమ్మకవి సులక్షణసారము, అనంతుని ఛందస్సు, ఛంధస్సును గూర్చిన ప్రసిద్ధగ్రంథములు. కాకునూరి అప్పకవి రచించిన అప్పకవీయమున వ్యాకరణము ఛందస్సును గూడ గలవు. ఇది మిక్కిలి ప్రచారములో నున్న గ్రంథము. విన్నకోట పెద్దన వ్రాసిన కావ్యాలంకార చూడామణి, మూర్తికవి వ్రాసిన కావ్యాలంకార సంగ్రహము అలంకార శాస్త్రవిషయమున ప్రాముఖ్యము వహించిన గ్రంథములు. ఈ రెండును సంస్కృతమునందలి కావ్యాదర్శము ప్రతాపరుద్రీయము ఆధారముగాగల గ్రంథములు.

అడిదముసూరకవి కృతమగు ఆంధ్రచంద్రాలోక మొకటి సంస్కృతమునందలి జయదేవకృత చంద్రాలోక మాధారముగా గలది. ఆంధ్రశబ్దచింతామణి యను పేర సంస్కృతభాషలో వెలసిన తెనుఁగు వ్యాకరణమునకు ఎలకూచి బాలసరస్వతి తెనుఁగున వచనవ్యాఖ్య వ్రాసెను. కూచిమంచి తిమ్మకవి వ్రాసిన సర్వలక్షణసార సంగ్రహము గూడ నొక లక్షణ గ్రంథమే. తరువాత 19 వ శతాబ్దిలో మామిడి వెంకయ్య తెలుఁగు వ్యాకరణము, చిన్నయసూరి బాలవ్యాకరణము మొదలయినవి బయలుదేరినవి. తెనుఁగు వ్యాకరణములన్నిట నతివిశిష్టమైనది బాలవ్యాకరణము.

**13. వచనవాఙ్మయము :—** తెనుఁగున నింత విశాలమైన చంపూరూప వాఙ్మయముబయలుదేరినను, కేవల వచనరచన విశేషముగా ప్రాచీనకాలమున బయలుదేరలేదు. మనకు లభించు వచనభాగములు మొదట శాసనములలోనివి తరువాతివి భారతాది పురాణములయందున్న, ఆంధ్ర ప్రబంధ

ములయందును ప్రాచీనములయినవి. ఇవి సమాస జటిలము లయి అలంకార బహుళములయి సంస్కృతమునందలి దశకుమార చరిత్రము కాదంబరి మొదలగు గ్రంథముల శైలిలో నున్నవి. పై వచనములు కావ్యమార్గానుసారిగా నున్నవి. గద్యము, వచనము, అను రెండును సమానార్థకములుగా వాడుచున్నాము. ప్రాచీనులును నిట్లే వాడిరి. కాని కొన్ని యెడల నీ రెండిటికిని కొంచెముగా నర్థభేదము పరిమిత ప్రయోగమున రూఢమయినది. గద్య, బిరుదు గద్య, చూర్ణిక, వచనము, విన్నపము, అను పేళ్ళతో వచన రచనాభేదము లేర్పడినవి. ఇవి యన్నియును నియత మయిన గణబంధములేని వచన రచనలే. భక్తిప్రధానము లయిన వచనములు, విన్నపములు, కృష్ణమాచార్యులు, తాళ్ళపాకమువారు రచించినవి పదునేనవ శతాబ్దమునాటివి ప్రసిద్ధములు. ఇవి భావప్రధానములగుటచేత కావ్యజాతికిఁ జేరినవియే. కాశీ కాధీశ్వరవచనములు, భవానీ మనోహర వచనములు మొదలయినవి యీ జాతికిఁ జేరినవియే.

భారత సావిత్రి యను పేరంబరగిన వచనమును (1550) ఇప్పటికిని గొందఱు స్త్రీలు వల్లించుచుందురు. వేదాంత వ్యవహారసారమును దెలుపు వచన రచనములు పదునారవ శతాబ్దినాటివి గలవు. పదునేడవ శతాబ్దము తొలి భాగమున ఎలకూచి బాలసరస్వతి వ్రాసిన బాల సరస్వతీయము టీకారూపక వచన రచనలలో ప్రసిద్ధము. విశ్వనాథనాయకుని స్థానాపతిచే వ్రాయంబడిన రాయవాచక మొకటి విషయ ప్రధానమయిన రచన. సముఖము వేంకట

కృష్ణప్ప వ్రాసిన జైమిని భారతము(1730)సమీపమున బయలు వెడలినది. వచనవాఙ్మయము మొదట బయలు దేరినది దక్షిణ దేశముననే యనవచ్చును. కళువె వీరరాజు వ్రాసిన ఆంధ్రభారత వచనములోని (1704) ఆది, సభాపర్వములు ప్రచారములో నున్నవి. ఈతడు మైసూరు రాజ్యములోని వాఁడు. కొన్ని కథలు, వ్యాఖ్యానములు మొదలయినవి 'కాలము, కర్త' తెలియరాని వ్రాతలు తంజావూరి భాండాగారమున లభించుచున్నవి. 18 వ శతాబ్దముననే వచన వాఙ్మయమునకు ప్రాముఖ్యము వచ్చిన దనవచ్చును. ఇందుకు ముందు శాసనములలోను కొళ్ళు కదపాలు మొదలగు లౌకిక రచనలలోను వచనము ఉండినది. 19 వ శతాబ్దమున వచన వాఙ్మయము అభివృద్ధికి వచ్చుటకు పాశ్చాత్య వాఙ్మయప్రభావము ముఖ్య హేతువు. ఈ ప్రభావమునకును, ప్రాచీన ప్రబంధవాఙ్మయములోని గద్యముల పోలికలకును బాల్పడి బయలు దేరిన చిన్నయసూరి నీతిచంద్రిక (1856) క్రిందటి శతాబ్దమునందలి గద్యవాఙ్మయమునకు వేగుజుక్క యనవచ్చును. ఆ తరువాత గద్యవాఙ్మయ మనంతముగా బహుశాఖలుగా వెల్లివిరిసినది.

పయిరీతిని ప్రాచీనాంధ్ర వాఙ్మయముయొక్క స్వభావాదికము స్థూలముగా సంగ్రహింపబడినది. ఈ వాఙ్మయమును యుగములుగా విభజించుటలో మఱియొక పద్ధతిగలదు. ఆ యా కాలములందు ప్రసిద్ధులయిన కవులను యుగకర్తలుగా గొని తక్కినవారిని వారి కనుయాయులుగా గొనుట యొకపద్ధతి. ఈ పద్ధతి చొప్పున నన్నయ యుగము,

తిక్కన యుగము, ఎఱ్ఱన యుగము, శ్రీనాథ యుగము, కృష్ణదేవరాయ యుగము, అను రీతిని కొందరు ఆంధ్ర వాఙ్మయములోని యుగ విభజనమును ఏర్పఱచియున్నారు. ఇదియు నొకపద్ధతి కాకపోలేదు. యుగ కర్తయయినవాఁడు వాఙ్మయములో నొక క్రొత్తమార్గమును కనిపెట్టిన తరువాత నాతని ననుసరించిన వారందరు నాతని యనుయాయులని చెప్పుట యీపద్ధతిలోని ముఖ్య గుణము. స్థూలముగా నిరూపించు నిప్పట్టున నాయా కవిత్వములలోని సూక్ష్మభేదము లను నిరూపింప వీలులేదు. పయిగా వీరి కవిత్వమునందు సంస్కృత వాఙ్మయానుసారిత్వమను నొక ముఖ్యలక్షణము చాల నధికముగా గనుపట్టుటచేత నావిభాగమే యిందు ప్రధానము చేయబడినది.

ప్రాచీనాంధ్రవాఙ్మయము యొక్క ఉత్పత్తి వికాస ములు స్థూలముగా నిరూపించుట యీ సంగ్రహవ్యాసము యొక్క ప్రయోజనము.

# దక్షిణాంధ్రయుగ వాఙ్మయము

కొర్లపాటి శ్రీరామమూర్తి

విజయనగర సామ్రాజ్యము విజయధ్వజ మెత్తినది. తెనుఁగుసరస్వతి తేజరిల్లినది. ఆ మహాసామ్రాజ్యము అస్తమించినది. ఆంధ్రసరస్వతి అధోముఖి అయినది. తంజావూరు, మధుర, మైసూరు, పుదుక్కోట పాలకులు అందలములు పట్టిరి. ఆ పాలకుల ఆదరణలో అభివృద్ధి చెందిన ఆంధ్ర సాహిత్యమే దక్షిణాంధ్రయుగ వాఙ్మయము.

మధుర తంజావూరు పాలకులు నాయకరాజులు. వారు మొదట విజయనగర రాజులకు ప్రతినిధులు. క్రీ. శ. 1550 ప్రాంతమున అవి స్వతంత్ర సంస్థానములు. క్రీ. శ. 1565 తళ్లికోట పతనము తరువాత మధుర తంజావూరులతోపాటు మైసూరు పుదుక్కోటలును స్వతంత్ర సంస్థానములు. మైసూరుపాలకులు రాయాదివంశీయులు. పుదుక్కోటపాలకులు తొండమాన్ వంశీయులు. మధుర తంజావూరు పాలకులు నాయకరాజులు. తంజావూరను మాత్రము నాయకరాజుల తరువాత క్రీ. శ. 1674 నుండి మహారాష్ట్రులు పాలకులు. ఛత్రపతి శివాజి సవతి సోదరుడు ఏకోజీ అందు మొదటివాడు. నాయకరాజులవలె మహారాష్ట్రపాలకులును ఆంధ్రవాఙ్మయమును ఆదరించినవారే.

## రఘునాథరాయల తరము

తంజావూరు నాయకరాజులలో నాయకమణి రఘునాథ రాయలు. ఇతని రాజ్యకాలము 1600–31. శ్రీకృష్ణదేవ

రాయలవలె ఇతడును కవి. ఆస్థానకవులకు ఆశ్రయదాత. శ్రీకృష్ణదేవరాయల సభాభవనమునకు "భువనవిజయము" అని పేరు. రఘునాథరాయల సభాభవనమునకును "ఇందిరా మందిరము" అనిపేరు. శ్రీకృష్ణదేవరాయలు సంగీతవేత్త. రఘునాథరాయలును సంగీత వేత్త. / సంగీతవేత్త మాత్రమే కాదు, పారంగతుడు కూడను. సంగీతసుధ అను సంగీత శాస్త్రమునకు కర్త. అంతేకాదు, జయంతసేన మొదలైన రాగములు, రామానంద – ఆదిగాగల తాళములు, రఘునాథమేళ అను మేళాంతరము కనిపెట్టిన స్రష్ట. రఘునాథరాయల సభలో "పదచాళి, పేరణి, కోపులు, జక్కిణి, దురుపద, కేళిక, కొరవంజ, దేశి" మొదలైన నృత్యవిశేషములు నిత్యనీరాజనములు. గీత నృత్యములతోపాటు జంత్రవాద్యముల సమ్మేళనమున కావ్యగానము జరుగుటకూడ రఘునాథరాయల సభలోని విశేషము. ( రఘునాథరాయల కావ్యములు అనేకములు. రామాయణ(భాగ)ము, శృంగార సావిత్రి, వాల్మీకి చరిత్ర, నలచరిత్ర అను కావ్యములు నేడు లభించునవి. శృంగార సావిత్రి కర్తృత్వము ఇంకను వివాదగ్రస్తము. (రఘునాథరాయలు "అచ్యుతాభ్యుదయము" అను కావ్యము "జానకీ కళ్యాణ" మను చాటుకావ్యము, "రుక్మిణీకృష్ణ వివాహము" అను యక్షగానము వ్రాసినట్లు కలదు. ఆయారచన లన్నిట ప్రధానమైన విశేషము ప్రక్రియా వైవిధ్యము. అనగా కావ్యభేదత. రామాయణ భాగము సంస్కృత రామాయణమునకు ఛాయానుకరణము. వాల్మీకి

చరిత్ర, శృంగార సావిత్రీ ప్రబంధములు. ప్రబంధమనగా స్వతంత్రకల్పనతో కూడినదని స్థూలార్థము. ఇక నలచరిత్ర ద్విపదకావ్యము. ఇంతవరకు తెనుఁగు సాహిత్యమున ద్విపద కావ్యరచన లేకపోలేదు. పద్య గద్య ప్రధానములైన కావ్యములను వ్రాసిన ద్విపద కవులు తక్కువ. పైగా ద్విపద కావ్యములను ప్రబంధములు చేయు పద్ధతి కూడ కలదు. ప్రబంధ కవు లెవరును ద్విపద కవులు కారు. నిజమునకు ద్విపద దేశిచ్ఛందస్సు. సంస్కృతమునందలి ద్విపద కంటె తెనుఁగు ద్విపద భిన్నము. అసలు ద్విపద కావ్యరచనలో ప్రముఖుడు పాల్కురికి సోమనాథుడు. అతనికావ్యములలో ఆనాటి మత ప్రభావమున కవితాస్థాయి తక్కువ. కవితాస్థాయిగల ద్విపద కావ్యములు గోన బుద్ధారెడ్డి రామాయణము, గౌరన హరిశ్చంద్ర, మొదలైనవి. భారత భాగవతములుకూడ ద్విపద కావ్యములైనవి. ఆ శ్రేణికి చెందిన ద్విపద కావ్యములు మరల రఘునాథరాయల రచనలు. ఆ ద్విపద కావ్యములలో "అచ్యుతాభ్యుదయము" మరొక విశిష్టమైన ప్రక్రియ. అందలి విశేషము చారిత్రకముగా రాజుయొక్క దినచర్య వ్రాయుట. ఆ రాజును మరెవ్వరోగాదు. ఆ రచన చేసిన వానికి తండ్రియే. రఘునాథరాయల తండ్రి అచ్యుత నాయకుడు. అచ్యుతనాయకుని దినచర్య ఆ నాడెట్లు జరిగెనో అట్లే వ్రాయబడినది అచ్యుతాభ్యుదయము. నిజమునకు అచ్యుతాభ్యుదయము నేడు లభించని గ్రంథము. లభించిన రఘునాథాభ్యుదయము దీనికి అనుకరణముగ పై ఊహ.

ఇకమిగిలిన "రుక్మిణీకృష్ణవివాహము" "జానకీకళ్యాణ చాటుకావ్యము" అనుప లబ్ధములే. రుక్మిణీకృష్ణ వివాహము

యక్షగానమని రఘునాథాభ్యుదయమున కలదు. యక్ష గాన మొక ప్రక్రియాభేదము. గేయనృత్య రూపము. ఇది పాల్కురికి సోమనాథుని కాలమున 'ఆడెడు పాడెడు' నది కావచ్చును. "కీర్తింతు రెద్దాని కీర్తి గంధర్వులు గాంధర్వమున యక్షగాన సరణి" అని యక్షగాన నామకరణము అందిచ్చిన శ్రీనాథుని కాలమున గాన ప్రధానము. గానమునకు నృత్య మును అనుబంధమైనది యక్షగానము. మొత్తముమీద రఘు నాథరాయల రచనలు వివిధ ప్రక్రియలు. ప్రక్రియావైవిధ్యమే గాక రసవత్తరమైన కవితా రచనమును రఘునాథరాయల ప్రత్యేకతయే.

"చెప్పవలెఁ గప్పురంబులు
గుప్పలుగాఁ బోసినట్లు ఘుంకుమపైపైఁ
గప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనన్ గవిత్వము సభలన్"

అని వాల్మీకిచరిత్రలో రఘునాథరాయల కవితా నిర్వచనము. రామాయణభాగమున ఆశ్రమవర్ణనము అట్టిదే.

ముదితపస్సులచేతి యుదకుండికల తొండ
ములఁ దెచ్చు గజపోతములను గంటె!
వలచుట్టికొనుచు నివ్వరి యొండుగులకుఁ గా
వలియున్న జింకపిల్లలను గంటె!
వృక్షమ్ము కొమ్మల వ్రేలాడు జపమాలి
కలు మూనులకునిచ్చు కపులఁగంటె!
రువ్వెచ్చు మునికుమారుల వేద పాఠమ్ము
లకుఁ దప్పుదిద్దు శారికల గంటె!

హోమ వేళ లెఱుంగుచుఁ దామె వచ్చి
కుండలిడ నిండునటుల పొల్గురిసి మిగిడి
శాలములకుఁ బోవు గోగణంబులనుగంటె !
యిందు మహిమంబు లేమన నిందువదన !

ఈ ధోరణిలో ఆంధ్రసాహిత్యమున ఇంతకుముందు ఆశ్రమవర్ణన చేయని కవులు లేరు. ఇంత అందముగా చేసిన కవులును లేరు. నాందీపద్యమైన నన్నయగారి పద్యమునకిది పందెముచరచునది. అంతే కాదు, ఆలంకారికులు తిర్యగ్గత శృంగారము ( పశుపక్ష్యాదులు తిర్యక్కులు ) రసాభాస మన్నను రఘునాథరాయల వర్ణనమది రసభాసమానమే.

"ఒక్క మహీజశాఖపయి నొక్కెడ వేడుకఁగూడియుండి యొం
డొక్కటి ఱెక్క విప్పుకొని యొప్పుగఁ గప్పుచునొయ్యఁ బల్కుచున్
ముక్కున మేను గీఱుచును మోమున మోమును జేర్చి మిక్కిలిన్
మక్కువనుండఁ గ్రౌంచ మిథునంబు గనుంగొన సంభ్రమంబుగన్"

ఇట్లే శృంగార సావిత్రిలో ఇంకొక కవితా విశేషము. అది సాంకేతిక భావప్రకటన. ఇది నన్నయ సభాపర్వమున ఇతోధికముగా చూపినదే. అయినను మరల అందుకొన్నది రఘునాథరాయలు. శృంగార సావిత్రిలో సత్యవంతుని వెంట సావిత్రి అడవికి బయలు దేరినది. నారదుడు చెప్పిన దుర్ముహూర్తము సమీపించినది. అప్పుడు సావిత్రి అన్నది,

"ఆమైఁ జూచితె ప్రాణనాయక ! గజం బా పెంటి యేనుంగుతోఁ
గామక్రీడకుఁ బా ఱెడింగలని సింగంబుండుటన్ కానరే
దేహానోయన నేమిగాదు శరభంబెంతే దృఢారంభమై
యా మూలం గని పొంచియున్నయది సింహంబున్ గ్రహింపన్ దమిన్"

అనంతర కథలో సత్యవంతుని స్వప్నవృత్తాంతమును సాంకేతికమే. వీనితోపాటు రఘునాథరాయల కవిత్వములోని మరొక ప్రధానవిశేషము స్థానప్రకృతి వర్ణనము. అసలాంధ్ర సారస్వతమున స్థానప్రకృతి యెడ రసపరవశుడైన కవిసార్వభౌముడు శ్రీనాథుడు. భీమఖండమున గోదావరీతీర కేదార సీమలు, కదళీవనములు, పుండ్రేక్షుభూములు, కాశీఖండమున ఆంధ్రదేశము, దక్షారామవనవాటిక అట్టివి. తదుపరి శ్రీకృష్ణదేవరాయల మధురానగర వర్ణనము, విల్లిపుత్తూరి వర్ణనము ద్రావిడ దేశమునందలి వాస్త విషయములే. మరల రఘునాథరాయల వాల్మీక చరిత్రలోని తంజాపుర వర్ణనము అందలి గుడి గోపురములు, పూలతోటలు, శాలిధాన్య విశేషములు, నారికేళ వనములు, చెఱకుమళ్ళు సర్వము తంజాపూరు సహజ వాతావరణమే. సహజ వాతావరణమేగాక సహజ వర్ణనమును రఘునాథరాయల ప్రత్యేకతయే. సహజ వర్ణనలకు సమ్రాట్టు శ్రీకృష్ణదేవరాయలు. ఈ విషయమున కూడ రఘునాథరాయలు శ్రీకృష్ణదేవరాయల శిష్యుడే. నల చరిత్రలోని "పుచ్చిపచ్చని తోకప్రురుగులు వెడలి లుల,లుల మంచు తొల్చుచునుండ" అను రఘునాథరాయల ధ్వన్యనుకరణము, ఆముక్తమాల్యదలోని "చుఱుచుఱుమన నెత్తురు వెలికుఱుకుచు" అను శ్రీకృష్ణదేవరాయలధ్వన్యనుకరణమునకు ఆడుగుజాడయే. ఇన్నివిశేషములుకల ఈరఘునాథరాయల కవితలో ఒక పెద్దలోపము కూడ లేకపోలేదు. అనేక స్థలములలో ఔచిత్యదృష్టి లేకపోవుటే ఆ లోపము. రామాయణ

మున అయోధ్యావర్ణన * శృంగార సావిత్రిలో విశ్వామిత్రుడు మేనక వెంటపడుట, వాల్మీకి చరిత్రలో సప్తఋషులు తంజావూరు స్త్రీల సౌందర్యమును చూచుట మొదలైనవి అట్టి అనౌచిత్యములు. ఇందుకు హేతువు కాలప్రభావము. అనగా ఆనాటి జీవనము ప్రతిఫలింపజేయు ప్రయత్నము.

రఘునాథరాయల ఆస్థానమున రామభద్రాంబ, మధురవాణి అను కవయిత్రులు, కృష్ణాధ్వరి, చేమకూర వేంకటకవి అను కవులు కలరు. రఘునాథరాయల ఆస్థానమున కవిచౌడప్పకూడ కాలువెట్టినట్లు ఒక చాటువు కలదు.

> సేరుతునని మాటాడగ
> వారిజభవు నంతవాని వశమా ? తంజా
> వూరి రఘునాథనాయని
> గారి సభన్ గుండవరపు కవిచౌడప్పా.

ఇంతకంటె మరి ఇతరాధారము లేదు.

కవయిత్రులైన రామభద్రాంబ, మధురవాణి సంస్కృతాంధ్రములలో కవన మల్లిన జాణలు. వీరి తెనుగు గ్రంథములు నేడేమియు కానరావు. తెనుగునందేగాక సంస్కృతమందు, ప్రాకృతమందుకూడ, ఆశుకవితా ప్రవీణలు, సమస్యాపూరణ సమర్థలు అని "రఘునాథాభ్యుదయ" మను యక్షగానమును బట్టి తెలియనగు సమాచారము. రామభద్రాంబ గురువు చెంగల్వ కాళకవి. కాళకవి తన

---

* "నకామీ నకదర్యోవా నృశంసః పురుషః క్వచిద్ద్రష్టు మయోధ్యాయాన్నా విద్వాన్నచ నాస్తికః" అని వాల్మీకి అనగా రఘునాథరాయలు అయోధ్య "విటులకుఁ గొలకుల నున్న తంగేటిజున్ను !" అనుట గమనార్హము.

'రాజగోపాల విలాసము'లో రామభద్రాంబ కవిత్వము "మాకంద మంజరీ మధురఝరీ మాధుర్య రచనా విశేషమ్ము" అన్నాడు. ఈ విశేషము శ్రీనాథుని ఆంధ్రనైషధము నందలి "మందారద్రుమ మంజరీ మధురఝరీ మాధుర్య మాధుర్య వాక్సందర్భము" నకు జ్ఞాపిక. శ్రీనాథుని శైలీసౌభాగ్యమును రామభద్రాంబ సాధించినదేమో! "రఘునాథాభ్యుదయము"ను బట్టి రామభద్రాంబ, మధురవాణికూడ మంచి కవనశక్తికలవారని స్పష్టము.

కవియైన కృష్ణాధ్వరి నైషధ పారిజాతీయమను ద్వ్యర్థి కావ్యమును వ్రాసినదిట్టు. తొల్లి భీమనమాట ఏమోగాని, ద్వ్యర్థికావ్యరచనలో ।పితామహులు పింగళి సూరన, రామరాజభూషణుడు అను ప్రబంధ కవులు. అదిమొదలు ద్వ్యర్థికవులు అనేకులు బయలుదేరిరి. అందులో కృష్ణాధ్వరి ఒకడు. ఆతని నైషధ పారిజాతీయము నలచరిత్ర, పారిజాతాప హరణ కథల జోడింపు. ద్వ్యర్థికావ్యమొక ప్రక్రియాభేదము. రసనిర్భరము కాకపోయినను కథానిర్మాణము చమత్కారావహము. కృష్ణాధ్వరి అందు కృతకృత్యుడు.

"సరసులలోననే మెలగు జాణకవుల్ మదిమెచ్చ పెద్దయా
నురుతర బుద్ధి జృంభణనయోగణనం బృథుకాంతిమత్త్వసం
భరణుడు రక్తి రంగెనయుపాటలవర్ణ మృదు ప్రచారణం
బరగు పదక్రమంబులను బ్రహ్మరథోచితుఁ డెంచిచూచినన్."

ఇది హంసపరముగాను కవిపరముగాను అర్థద్వయము కల పద్యము. ఇట్లే కావ్యమంతట సుకుమారశ్లేష కలదు.

ఇక చేమకూర వేంకటకవి. ఈతడు కవి. ఈ దక్షిణాంధ్రయుగమున ఇతడే ధ్రువతార. ఈతని కృతులు – విజయ

విలాసము, సారంగధర చరిత్ర. విజయవిలాసమున అర్జునుడు తీర్థయాత్ర వెడలుట, ఉలూచి, చిత్రాంగద, సుభద్ర అను కన్యల పరిణయమాడుట ఇతివృత్తము. ఇది మహాభారతము నందలి కథయే. కాని భారతమున కథావస్తువు రేఖా మాత్రము. అట్టి కథావస్తువు స్వతంత్ర కల్పనలతో చేమకూర పాకమునబడి ఉజ్జ్వల ప్రబంధమయినది. ఆలంకారికముగా అనేక విశేషము లున్నప్పటికి అన్నిటికంటె విజయవిలాసమున ప్రధానమైనది తెనుఁగుదనము. ఆ నుడికారపుసొంపు అనితరసాధ్యము. 'అణిమెఱుంగు ముత్తెపు టొయారపు ముగ్గులు' – 'చందుర కావిపావడ పిసాళిరుచుల్ సరిగంచు జీరపైఁజిందులు త్రొక్క' – 'చెల్లెల వెన్నెలా పెరటి చెట్టుగ నాటిన పారిజాతము' వంటి పసిడి పలుకులు కోకొల్లలు. "ఆనతి యిచ్చెనా యది శిలాక్షరము" "దానమిచ్చెనా యేనుగుపాడి" "నిత్యకళ్యాణము పచ్చతోరణము" వంటి జాతీయములు జాతిరత్నములు. "సవ్యసాచి నింద్రోపలరోచిఁ జూచి తలయూచి యులూచి రసోచితంబుగన్" వంటి అనుప్రాస మొక అలవోక. ఇక యమకము ఈతని సొత్తు. "అమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు" "రాకొమరు నెఱులు వలపు రాకొమరులు" – "మనసు భద్రమయ్యె మన సుభద్ర కిపుడు" "ఈ వెలంది యొడల్ పైడిలో వెలంది" – ఇత్యాదిగ భాష, భావము మేళవింపబడిన ఈ కావ్యము జాను తెనుఁగునకు ఒక జయపతాక. ఇక సారంగధర చరిత్ర. ఇది చారిత్రకము కాదు. ప్రధానముగా తెనుఁగు కవిత్వమును తీర్చి దిద్దజేసిన చాళుక్య రాజరాజునకు సంబంధించినది అసలే కాదు. రాజమండ్రిలో సారంగధర మెట్ట కలదు గాక.

నెల్లూరుజిల్లా కొవ్వూరుతాలూకా పెమ్మారెడ్డి పాలెమున చిత్రాంగికోట చిహ్నములు, కలవట*[1]. అసలీకథ అందీయబడిన మొదటి గ్రంథము నవనాథచరిత్రలో కథారంగము రుద్రపురము. రాజు రాజమహేంద్రుడు. ఆతని పట్టపుదేవి చంద్రవతి. స్వయంవరప్రాప్త, శోభవతి. ఈమె చంద్రావతి కొడుకు చంద్రశేఖరుని మోహించి బంతివంకను కథ నడిపించినది. రాజమహేంద్రవరము రాజధానియైన చాళుక్య రాజరాజునకు సారంగధరుడను కొడుకే లేడు. అయినను కట్టుకథ అల్లబడినది. అదిమరి అతివ్యాప్తిలో నున్నది. నవనాథ చరిత్రలోని పై కథ చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రలో కొంత మారినది. ఇతరుల రచనలలో ఇంకను మారినది. చేమకూర వేంకటకవి కథలో కథారంగము మాళవదేశములోని రాజమహేంద్రము. రాజు రాజరాజనరేంద్రుడు. కులసతి రత్నాంగి. ఉంపుడుకత్తె చిత్రాంగి*[2], బంతికి మారు పావురము. కథావిషయమటుంచి కావ్యపరముగా నిదియు తెనుఁగుదనమునకు మూదలయే. పాత్రచిత్రణ కూడ ప్రశంసా పాత్రము. "కలదమ్మా యిటువంటి కానిపని, యోకామాక్షి! యీ వెఱ్ఱిబుద్ధులు నీకేల ఘటిల్లెనమ్మ!... తగదమ్మా ధర్మమూహింపుమా!" అను సారంగధరుని అభ్యర్థనము, అందుకు చిత్రాంగి "పరిరంభం బొనరింపరా, కరుణాపైఁజూపరా, యాలకింపరా, యేరా యధరామృతం

---

* 1 భారతి వ్యాసము శ్రీ ఒంగోలు వేంకటరంగయ్య

* 2 కలరాయిల రాయనికిన్, గులసతి రత్నాంగి భోగకుటిల కోణా, తిలకము చిత్రాంగియు.

బొసగి, నన్ మన్నింపరా" అను అభ్యర్థనమును దైన్యరేఖా శబలితములుగా ఉభయ కుశలములు. ఉపరి, సారంగధరుని నిరాకరణకు చింతనిప్పులు రాల్చుచు చిత్రాంగి "ఇదిగో! నీ యంగమచ్ఛంబు నాచే, ఈ లోననే రాజు రావలెగదా, చెక్కింతు నీ కీలుకీలు, కానీ, ఇందులకేమి?" అని బొమ్మ తాటించినది. సంభాషణ మిది పాత్ర స్వభావ ప్రకటన సమర్థము. అది సజీవపాత్ర సాక్షాత్కరణ శిల్పము. అన్నిటికంటె కరచరణ ఖండితుడైన సారంగధరుని అవస్థా చిత్రణము కరుణారస పరాకాష్ఠ — "హా జననీ! హా జనకా!" యని "భూవరసూతి కీలెడలు బొమ్మ విధంబున భూస్థలి వ్రాలి",

"తలవరులేఁగ లేఁగపులి తండము నెత్తుటి గాలుకై హళా
హళి మెయిఁదాఁగ డాఁగలయినట్టి వృకంబులు క్రొంబొదల్ రొదల్
చిలుకుచు నీఁగ నీఁగలును జీమలు దొంతరగాఁగఁ బైపయిన్
బిలబిలమూఁగ మూఁగవలె బెగ్గిలి పల్కఁగ లేక వేదనన్"

"సొమ్మసిలి, కొంత తడిసినఁ గ్రమ్మఱఁ దెలివొంది లేచి"

" — ఎందుఁబోతిరో
తలవరులార! మీరయిన దగ్గర వచ్చి వధించి పోవరే
యలమట కోప నోర్వఁగములార! అయో! దవకీలలార! తన్
బొరియఁగఁ జేయరే వెతలఁబొందఁగ లేను"

అను సారంగధరుని ఆవేదనము హృదయవిదారకము. స్మరణ మాత్ర భయావహము. మొత్తముమీఁద చేమకూర వేంకట కవి విజయవిలాసము, సారంగధర చరిత్ర, చేవకల జీవద్రచనలు. ఈ రెండు కృతులు ఈ యుగమునకే గాక ఆంధ్ర

సాహిత్యమునకే గౌరవదాయకములు. ఈ విధముగ ఆంధ్ర సరస్వతి దక్షిణాధీశు ముత్యాలశాలను దీనారటంకాల తీర్థమాడినది.

రఘునాథరాయల నాటికే మధురలో వెలువడిన గ్రంథము "రాయవాచకము" అను వచన కావ్యము. ఇది విశ్వనాథనాయని స్థానాపతి కృతము. దీని రచనాకాలము 1530 అని పలువురి అభిప్రాయము. కాని ఇందు భాగ్యనగర నిర్మాణము — ఇప్పటి హైదరాబాదు — పేర్కొనుటచే పదునారవ శతాబ్ది తుదిగాని పదునేడవశతాబ్ది ఆదిగాని కావలెనని అర్వాచీన నిర్ణయము. రచనాకాల మెప్పుడైనను రాయవాచకము మధురశాఖను ప్రథమ రచనమే. ఇది వచనగ్రంథమగుట ఇతోధిక విశేషము. పైగా చారిత్రక విషయము. విజయనగర సామ్రాజ్యము శంకుస్థాపనము మొదలు శ్రీకృష్ణరాయల విజయయాత్రల వరకు ఇందు వివరింపబడినది. కట్టుకథలును లేకపోలేదు. ఇతివృత్తము కంటె ఇందలి వచనరచనమే ఎక్కువ విశేషము. సరళమైన శైలి. సజీవమైన వ్యావహారిక ధోరణి. సలక్షణమైన గ్రాంథిక ధోరణియు కలదు. సమష్టిపై రాజకీయ వ్యవహారభాష కిది రాచబాట. అంతేకాదు. ఆంధ్రవాఙ్మయమున అరుదైన వచనకావ్యముగ ఆణిముత్యము.

రఘునాథరాయల పూర్వ మీ ప్రాంతమున వచ్చు కప్పురపు తిరువెంగళకవి ఒక ప్రసిద్ధకవి. ఇతని కృతి చొక్కనాథ చరిత్ర. అది క్షేత్రమాహాత్మ్య ప్రతిపాదకమైన ద్విపద కావ్యము. రచనాకాలము 1530. తిరువత్తూరు

పాలకుఁడైన గోళ్ళపెద రామనాయకునికి అంకితము. మలయధ్వజ పాండ్యుని కూతురు మీనాక్షీదేవిని వివాహమాడి చొక్కనాథ నామధేయమున మధురాగృహమేధి అయిన పరమేశ్వరుని చౌషష్టిలీల లిందు వర్ణితము. ఇదే హాలాస్య మాహాత్మ్యము.

## విజయరాఘవుని తరము

రఘునాథరాయల తరువాత విజయరాఘవ నాయకుఁడు తంజావూరు పాలకుఁడు. అతని రాజ్యకాలము 1633-73. తండ్రివలె ఇతఁడును తానుగాకవి. కవి పోషకుఁడు కూడ. విజయరాఘవుని సభపేరు విజయరాఘవ విలాసము. అందు "శారదా ధ్వజము" అలరారినది. అసలే విజయరాఘవుని అంఘ్రితలమున సాహిత్య గండపెండారమే ఘల్లుమన్నది. రఘునాథరాయల సభలోవలె విజయరాఘవుని సభలోను సంగీతమునకు పట్టాభిషేకము. "కేళికలు, పదములు, దరువులు, పేరణులు మొదలైన బహువిధ నాట్యములు అభినయించుట – యక్షగానము, జోల, సువ్వాల, ధవళములు, ఏలలు వినిపించుట – కళావతుల అనుదినచర్య*. అంతగా పరాకోటినందినది ఆ నాటి పదకవిత. విజయరాఘవుని, అతని ఆస్థానకవుల రచనలు ప్రధానముగా యక్షగానములే. ప్రబంధములు సకృత్తు. పదకవితా పితామహుఁడైన క్షేత్రయ్య పాదము పెట్టినదీ విజయరాఘవుని సభ.

విజయరాఘవుని ఆస్థానకవి చెంగల్వ కాళకవి. రాజగోపాల విలాసము, పసుపులేటి రంగాజమ్మ అను

* చెంగల్వ కాళకవి – రాజగోపాల విలాసము – అవతారిక.

కి వయిత్రి మన్నారుదాస విలాసము, ఉషాపరిణయము అనునవి మాత్రము ఆనాటి ప్రబంధములు. రాజగోపాల విలాస మొక రమ్యప్రబంధము. శ్రీకృష్ణుని అష్టమహిషులు అష్టవిధ శృంగార నాయికలుగ ఆలంకారికమైన కల్పన ఇందు అపూర్వము. చంపకారణ్య మాహాత్మ్యము, హరిద్రా నదీతీర్థ మాహాత్మ్యము కూడ అనుసంధించబడినవి. నిర్వహణము నిపుణము. కవితాధార ధారాళము. వర్ణనలు ప్రబంధఫక్కి. ఇక ఉషాపరిణయము హరివంశ కథ. ఉష, అనిరుద్ధుల వివాహము ఇందలి విషయము. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున, నాచన సోమనాథుని ఉత్తర హరివంశమున అవి ఉదాత్తములు. రంగాజమ్మ ప్రబంధమున ప్రాబంధిక స్థాయి, పౌరాణికప్రతిపత్తికూడతక్కువ. సమకాలికమైనసమాచారము కలదు. శ్రీకృష్ణుని కొలువు సింగారము ఆనాటి రాజుల పద్ధతి. మన్నారుదాస విలాసము స్వతంత్ర ప్రబంధము. అందు విజయ రాఘవుని వివాహము ఇతివృత్తము. ప్రబంధ వర్ణనలు అధికము. మన్నారుదాస విలాస ప్రబంధము కంటె రంగాజమ్మ మన్నారుదాస విలాస నాటకము ప్రసిద్ధము. కారణము పక్రియాభేదము. అనగా నది యక్షగానము. నాటకమనుట నాటి సముదాచారము. విజయ రాఘవుని తరమున యక్షగాన రచనయే ప్రత్యేక విశేషము.

విజయరాఘవుడే అనేక యక్షగానములు వ్రాసిన వాడు. ౧. కాళీయ మర్దనము :— ప్రసిద్ధమైన భాగవత కథయే. ప్రారంభోపసంహారము లోక ప్రత్యేకత. విజయ రాఘవుని ఇలవేల్పు, రాజగోపాలస్వామిని గోభిలుడు, గోప్రళ

యుడు అను ఇద్దరు మునులు కాళీయమర్దన నాట్యము చూడ గోరగా, ఆ దైవము వారిని కాళిందీ తీరమునకు పంపి, తానంతః పురమునకేగి బాలకృష్ణుడై కాళిందిచేరి కథ ప్రారంభించును. కాళీయమర్దన కథ కాగానే రాజగోపాలస్వామి నగరప్రవేశము, నిజసఖుల నీరాజనము, కొలువు కూటము వగైరాతో కథాంతము. అసలు కథ అంతర్నాటకము వంటిది. అంతర్నాటకము సంస్కృత నాటకసంప్రదాయము. (హర్షుని ప్రియదర్శిక అంతర్నాటకముగల మొదటి సంస్కృత నాటకము.) ౨. ప్రహ్లాద చరిత్ర :— ఇది కూడ భాగవత ప్రసిద్ధ కథానకమే. కథా నిర్వహణము మాత్రము స్వతంత్ర కల్పన. అందును ప్రహ్లాదుని విద్యాభ్యాస ఘట్టము చక్కని నిదర్శనము. "గురువాక్యము :— నమో హిరణ్యాయ అనవోయీ. ప్రహ్లాద వాక్యము :— నమో హిరణ్యాంబరాయ........." విప్రుల అభిచార హోమము అనగా చేతబడి ఆనాటి విషయమే. ఇందు పాములవాని పాత్ర సహజ చిత్రణ. పురోహితుల మాటలు వ్యావహారికము. "ఎత్తావధాని: ఓరీ! వజ్రశుంఠ! వయసు చెల్లితేనే నీవొక పెద్దవహరా? నావలె వేదశాస్త్రులు పరీక్షయిచ్చేవు?"—ఈ పురోహితులు విజయరాఘవుని సమకాలికులే. ఈ యక్షగానమున విలక్షణ పాత్ర ఆస్థానసంతోషి. ఆంగ్లనాటకములందలి , "Court - fool" అను పాత్రకు యాదృచ్ఛిక సాదృశ్యము. అంతేకాదు. ఈ యాస్థాన సంతోషికి సంభాషణలేదు. "ఇక్కడ విదూషకుడు హాస్యపు మాటలాడేది" అని మాత్రమే ప్రయోగ సూచన. ఇది పాత్రధారికి సంభాషణలు కవికృతములు కారాదను ఒకానొక ఆధునిక దృష్టికి అనుకోని ఆద్య ప్రకృతి.

3. పూతనాహరణము :— ఇదికూడ భాగవత ప్రసిద్ధమైన ఇతివృత్తమే. ఇందు పూతన మంమలమారిగా కల్పన. పూతన కళేబరము కొనిపోవుటకు నందుడు పిలువగా వచ్చిన గొల్లల సంభాషణ, తిమపరి ద్విజుల సంభాషణ కూడ పాత్రోచిత భాష. "సింగావధానులు:- కొన్ని తప్పు మంత్రాలు చెప్పి దబ్బర హోమాలు చేసి నాలుగు పాడియావులు గ్రహించుకోవచ్చునే!"—పదునేడవ శతాబ్దిలోని పౌరోహిత్యమిది!

4. విప్రనారాయణ చరిత్ర :— ఇది పన్నిద్దరాళ్వారులలో ఒకడైన విప్రనారాయణుడు లేక తొండరడిప్పొడి యాళ్వారు అను వాని చరిత్ర. ఇంతకు పూర్వమున్న చెదలువాడ మల్లన్న విప్రనారాయణ చరిత్ర, సారంగుతమ్మయ్య వైజయంతీ విలాసము ప్రబంధములు. ఇది యక్షగానము. ఇంతకు ముందు చక్రపురి రాఘవాచార్యులు విప్రనారాయణ చరిత్రయక్షగానము వ్రాసినట్లు కలదు. ఇక విజయరాఘవుని యక్షగానమున విప్రనారాయణునికథ విజయరాఘవుని కాలమందే—అదికూడ తంజావూరులోని మన్నారు గుడిలోనే – జరిగినట్లు, అసలు చోళరాజు అంతర్ధానమై విజయరాఘవుడే స్వయముగ విజయంచేసినట్లు విపరీత కల్పన. ఇందు రచనా పరముగా విశేషము ఒక విలక్షణమైన చూర్ణిక. సంస్కృతమున చూర్ణమొక వచన భేదము. "అనావిద్ధ లలిత పదం చూర్ణమ్." అని వామనుని లక్షణము. అనగా సమాసములు లేని అలతి అలతి పదముల వచన రచన. కాని తెనుగు చూర్ణిక ఎట్లో పెద్దడ నాడే దీర్ఘసమాస బంధురము. శైలితోపాటు తెనుగు చూర్ణిక దైవపరమైన వచన స్తోత్రము. మొల్లరామాయ

ణము లోని చూర్ణికమాత్రము బిరుదుగద్యమే. కాని విప్ర నారాయణచరిత్రలోని చూర్ణిక ఈ రెంటికిభిన్నము. సంస్కృత భాషలో సంభాషణము ఈ చూర్ణిక. అంతేకాదు సంస్కృత చూర్ణలక్షణలక్షితము. ఈ యక్షగానమున మరొక విశే షము అన్యభాషా వ్యవహారము. పూజారిమాటలు కేవలము తమిళము. ఇందలి పదములు నేటి వచన గీతముల వంటివి. "మీతో మాకేటి మాటలు! విన బ్రాతిగాదు మీపాటలు! భవనంబులు పర్ణ శాలలు! మాపాటలు హరిమీది ఏలలు!"— మొత్తముమీద విజయరాఘవుని యక్షగానములలో ఇద విశిష్టము. ౫. రఘునాథాభ్యుదయము :— రఘునాథా భ్యుదయము యక్షగానము, రఘునాథనాయకాభ్యుదయము ద్విపద కావ్యము అనుట కలదు. కాని రెండును కవిచే రఘునాథాభ్యుదయము లని వ్యవహరింపబడినవే. ఈ రెంటికి ఇతివృత్త మొకటే. అదే విశేషము. ఒకటి యక్షగానము, మరొకటి ద్విపద కావ్యము అయినను రెండును ఇతివృత్తము చేతనే ప్రత్యేకత కలవి. రఘునాథరాయల దినచర్య ఇతి వృత్తమగుటయే ఆప్రత్యేకత. ఒక రాజుయొక్క దినచర్యను మాత్రమే ఇతివృత్తముగా గైకొన్న రచన లింతవరకు లేవు. రఘునాథరాయల అచ్యుతాభ్యుదయము ఇట్టి రచనలలో మొదటిదగును. ఇది రెండవది. ఇందు విజయరాఘవుని తండ్రి అయిన రఘునాథరాయల దినచర్య విషయము. రఘునాథ రాయలు మేల్కొనుట మొదలు మరల శయనించుటవరకు యథాతథముగ దినచర్య ఇందు వర్ణితము. వాస్తవికమైన విషయమే వస్తువు. ఈ రెండు గ్రంథములందే రఘునాథ రాయల, విజయరాఘవుని సభలపేరులు పేర్కొనబడినవి.

తంజనపు రఘునాథ రాయల సభావిశేషము లిందు బహుళము. రఘునాథరాయల కొలువు సింగారము మొదలైన సర్వ విషయములు సహజవర్ణనలు. రామభద్రాంబ, మధురవాణి అను కవయిత్రుల ఆశుకవిత్వము, సమస్యాపూరణము ద్విపద కావ్యమునలేని యక్షగాన విశేషము. అట్టిభేదములు అరుదు. రెండు గ్రంథములలోను పంక్తులకు పంక్తులే సమానము. గ్రంథము లివి రెండును చరిత్రోపయోగులు. రచనాపర ముగా ప్రక్రియా భేదము ప్రధాన విశేషము.

ఇక విజయరాఘవుని ఆస్థాన కవుల యక్షగానములు :— పసుపులేటి రంగాజమ్మ మన్నారుదాస విలాస నాటకము, పట్టుపుకవి కామరుసు వేంకటపతి సోమయాజి విజయరాఘవ చంద్రికా విహారము, కోనేటి దీక్షితచంద్రుని విజయరాఘవ కళ్యాణము ఇంచుమించు ఒకటే ఇతివృత్తములు. విజయ రాఘవుని వివిధ వివాహములే కథా విషయములు. ప్రబంధము లందువలె ప్రభువు అయిన విజయరాఘవుడు నగర యాత్ర వెడలగా నారీలోకమునకు నాడీవేగము! ఇతఃపూర్వమే నన్నెచోడుడు ఈ దారికి సూత్రధారి. ప్రబంధములను తలదన్నిన ప్రణయకలాపము ఈ యక్షగానముల ప్రతాపము. కవితాకన్య రాజులకు పరిచారిక అయిన సందర్భ మిది. రంగాజమ్మ మన్నారుదాస విలాసమున మన్నారు దేవుని తిరునాళ్ల ఊరేగింపు హడావిడిలో కాంతిమతి అను రాకుమారి విజయరాఘవుని చూచి వివశురాలగుట, చెలి కత్తె రాయబారము నెరపుట, రాజగురువు శతక్రతు శ్రీనివాస తాతాచార్యులవారు ముద్రవేయుట—పెండ్లికి—ఆ కాంతిమతీ

విజయరాఘవుల కళ్యాణము ఇతివృత్తము. ఇందు వచనము పాత్రోచితభాష, ప్రశంసార్హ్మములు. జ్యోస్యులవేషాగాధాలు-విద్వాంసుల యద్వాతద్వాలు – ఎఱుకత సోది – గొల్లల సుద్దులు– ముత్తైదువుల ముచ్చటలు – ముఖ్యమైన ముచ్చటలు. కామరసు వెంకటపతి విజయరాఘవ చంద్రికా విహారమున లీలావతి అను రాకుమారి "వెన్నెల షికారు" వెడలిన విజయరాఘవుని చూచి వివశురాలగుట, చెలికత్తె రాయబారము లీలావతికి చెలికత్తెరూపమున రంభ ఓదార్పు, అందుకు విజయరాఘవుడు అర్జునావతార మగుట, కడకు లీలావతి విజయరాఘవుల వివాహము – ఇతివృత్తము. ఎఱుకత సోది, సమకాలిక సమాచారము, స్థాన ప్రకృతి సహజవర్ణన మొదలైనవి కలవు. ఇక కోనేటి దీక్షితుని విజయరాఘవ కళ్యాణముకూడ విజయరాఘవుని వలపు వక్కాణయే. విజయరాఘవుడు వేటకు వేంచేయుట, అరణ్యమధ్యమున అంతఃపురకన్య సిద్ధముగా నుండుట, ఆ మదన మంజరి మదన వికార అగుట, చెలికత్తె రాయబారము, మరల శతక్రతు శ్రీనివాస తాతాచార్యులవారి ముద్ర, వివాహము, పాడినపాటే. విజయరాఘవుని కొలువున విద్వాంసుల కవుల సాహిత్యగోష్ఠి యీయక్షగానమున ప్రత్యేకాకర్షణ. పాత్రోచిత భాష, చెంచు ప్రసంగములు, ముత్తైదువుల ముచ్చటలు మామూలే. ఇక పురుషోత్తమ దీక్షితుని తంజాపురాన్నదాన మహానాటకము అన్నిటికంటె ఘనము. దీనిని "హాస్యాద్భుత రసప్రధానముగ హావణించితినని" కవి కంఠోక్తి. అద్భుతమేమోగాని హాస్యాస్పదమే. దీనికి సత్రమరులు అని మరొకపేరు. ఆనాటి సత్రముల అధ్వాన్నస్థితికి మాత్రమే

గాక ఆనాటి సాహిత్యముయొక్క అధ్వాన్నస్థితికిసైత మిది నిదర్శనము. తంజాపుర సత్రమున పప్పుతిప్పాభట్లను బ్రాహ్మణ బ్రువుడు ఉత్తరాది వెంగసానితోను, జక్కుల రంగసానితోను సాగించిన విరసమైన సరసమిందలి విషయము. ఇందు లంఝెమ్మగారు మొదలైన అసభ్య పదములు బాహాటము. భాషాపరముగ ఇందు వ్యావహారికభాషలో వృత్త రచన యొక విశేషము.

"క్రూస్తున్నన్నవి కోకిలంబులవిగో కోలాహల ప్రక్రియన్
వేస్తున్నాడు మనోభవుండమిషుగా వేమారు నీవున్ననున్
చూస్తుందానవు నీకు ధర్మమవ వే శుద్ధాత్ముడన్ బ్రాహ్మడన్
త్రెస్తున్నానిదె గూర్తమొక్కటి రతిందేలింపవే లంఝమా !

ఇది తిప్పాభట్లు "రాగాన చదివే పద్యం". ఇంచు వచనము ఇతోధికమైన విశేషము. అనగా నిది వచన ప్రధానమైన యక్షగానము.

ఆస్థానకవులతోపాటు విజయరాఘవుని కొడుకు మన్నారు దేవుడు కూడ మంచికవి. ఇతని విజయరాఘవాభ్యుదయము నేను లభింపని గ్రంథము. లభించిన హేమాబ్జనాయికా స్వయంవరము యక్షగానము. ఇందు పౌరాణిక ప్రతిపత్తి తక్కువ. హేమాబ్జనాయిక అనగా లక్ష్మీదేవి. రాజగోపాలస్వామి విష్ణువు. సముద్ర మథనము, అమృత విభాగము అయిన తరువాత ఆ లక్ష్మీనారాయణుల వివాహము ఇందలి విషయము. ఇందు జగన్మోహిని వర్ణన చమత్కారజనకము. మోహినీకాంతకు "తనదు చిహ్నము లెల్ల తన యంగములనె గనుపట్టునట్లు"గా కల్పన మది

కవితా వైచిత్రి. ఇక ప్రధానపాత్ర హేమాబ్జనాయిక ప్రబంధనాయిక మాదిరి. ఆమె విరహబాధను అరసి విజయరాఘవుడే వివాహ నిశ్చయము చేయుట విపరీత కథనము. ముత్తైదువుల ముచ్చటలు, పురోహితుల ప్రసంగములు పాత్రోచితభాషను హాస్యజనకములే. ఆస్థానకవుల యక్షగానములకంటె ఇది అనేక విధముల నయము.

ఇతివృత్తము లీస్థితి. సాహిత్యస్థాయి తానన్మాత్రము. కాని పరాకోటి నందినది పదకవిత. శృంగార పదములు, సాంగత్య పదములు, చెంచుపదాలు, దరువులు, కొరవంజి దరువులు, ధవళములు, శోభనములు, సువ్వాలలు మొదలైన బహుపదము లీ యక్షగానముల భాసమానములు. యక్షగానము లివి సర్వమును ఆస్థానమున ఆరుబయట కూడ ఆడబడినవే. ఇవిగాక విజయరాఘవుడు ప్రత్యేకముగా గోపికాగీతలు, భ్రమరగీతలు మొదలైన గేయ ప్రబంధములు, వాల్చిచి, గుజ్జరివిల్వేదు, చౌపదములు, పదచాళికలు మొదలైన నాట్యప్రబంధములు కూడ వ్రాసినట్లు ప్రహ్లాదచరిత్ర అవతారికలోని సమాచారము. విజయరాఘవుని తరమున ప్రధానమైనది పదకవిత్వమే.

కేవల పదకవితామూర్తి · క్షేత్రయ్య. పుట్టుపేరు వరదయ్య. పెట్టుపేరు క్షేత్రయ్య. బహుక్షేత్ర పర్యటనమే తన్నిమిత్తము. క్షేత్రయ్య పదములు త్రివిధము. ఒకటి- విజయరాఘవుని మీది పదములు :— ఇవి విజయరాఘవుని శృంగార విషయములే. ఆశృంగారము అతివేలము. అంతే గాదు పదములివి ప్రభుదాస్య ప్రతిపాదకములే. ఒక ఉదా

హరణము, "కలికిరో! అచ్యుత విజయరాఘవేంద్రుండు కంతుకేళి కూడగా పలుమారు చప్పర గిలకలపట్టె మంచము ఘులఘులు మనగా, మెలతరో ఆసద్దు ఆపె వినీనని మెల్లనే ననుగూడెనే చెలియా! ఇటువంటి వాడు రానేల?" — ప్రసిద్ధమైన క్షేత్రయ్య పదము "మగువతన కేళికామందిరము వెడలెన్" అన్నది విజయరాఘవుని వలపుకత్తె పరమని కొందరి అభిప్రాయమే. రెండు — మధుర తిరుమలేంద్రుని మీది పదములు :— తంజావూరు నాయకరాజు విజయ రాఘవుడు వలెనే మధురనాయకరాజు తిరుమలేంద్రుడు. అతనిమీద చెప్పిన పదములే మధుర తిరుమలేంద్రుని మీది పదములు. ఇవికూడ విజయరాఘవునిమీద పదములు వంటివే. "వేడుకతో నడచుకొన్న విటరాయడే" మొదలైనవి. మూడు — మువ్వగోపాలుని మీది పదములు :— ఇవి ప్రసిద్ధ క్షేత్రయ్య పదములు. మువ్వగోపాలుడు క్షేత్రయ్య ఇష్టదైవము. క్షేత్రయ్య భక్తిపారవశ్యమే ఈ పదముల పర మార్థమట. ఈ భక్తి మధురభక్తి. మధురభక్తి యనగా నిది* ప్రతిజీవాత్మయు స్త్రీ. పరమాత్మయొక్కడే పురుషుడు. జీవాత్మలన్నియు పరమాత్మను పొందుటకై యోగమార్గము నవలంబించుటకై నాయికా సదృశములు. ఆ నాయికలకు అనగా జీవాత్మలకు, నాయకుడు అనగా పరమాత్మ శ్రీకృష్ణుడు. ఆనాయికానాయకుల ఐక్యమే రాధాకృష్ణ తత్త్వము. అదే మధుర భావము. తదారోపమైన, ఆధ్యాత్మికమైన, అలౌకిక శృంగారము మధురభక్తి. కాని క్షేత్రయ్య పదములు లౌకిక పరిధిని దాటలేదు. సభ్యతా పరిధిని మాత్రము దాటినవి.

* శ్రీ విస్సా అప్పారావు పీఠిక.

"ఇన్నాళ్ళవలె కాదమ్మా" "పచ్చిమోడలి దానవురా" "ఇంతలోనే అల్లలాడి నన్నుగూర్చి" "వెదకితేరాపోయి వేరు వెళ్లింకి" మొదలైన పదములు మోతాదుమించిన మోహపరవశములు. "క్షేత్రయ్య పదములు పచ్చియనుట పచ్చి" అని ఒకరి అభిభాషణము. అది చమత్కారమైన శబ్దచాలనము. క్షేత్రయ్య విటరాయడని జనశ్రుతియే. అంతే కాదు. అదే భక్తి అయిన "It is doubtful whether we are spiritualising sex or sexualising spirit." అన్న* కట్ట మంచివారి విచికిత్స అర్థవంతము. ఇక పదము లివి గాన యోగ్యములు మాత్రమేగాక అభినయార్హము లగుట వీని ప్రత్యేకత. రచనాపరముగా పదలాలిత్యము తెనుఁగుదనము పరకోటి. "ఈనిన పులివంటి కోపము" "చేతకాసు లేనివాని చేసైగలే" "మీరేమైన నాగ్చేరో తీర్చేరో" "వెన్నెల చిచ్చుల రాత్రులు" "మోవి పానకము" మొదలైన పలుకులు పసిడి పలుకులే.

మొత్తముమీద విజయరాఘవుని కొలువున, వీథివీథుల కూడ పదకవితా ప్రవాహమే. ఈ కాలమున మధురశాఖ తాపత్రయము ప్రబంధ రచనమే. అది లింగనమఖి తిరుకామ కవి సత్యభామా సాంత్వనము. మధుర నాయకరాజు ముద్దళఘురికి అంకితము. రచనా కాలము 1670. ఇక రచనా విషయము — ఇది తంజావూరు పదకవితా పతనావస్థకు సదృశమైన ప్రబంధ కవితా పతనావస్థ. నరకాసురవధకు ముందును తరువాతను సత్యభామను సమాశ్వసించుట

* క్షేత్రయ్య సంచిక, విశాఖపట్నము.

సత్యభామా స్వాంతనమందలి కథావస్తువు. సాంత్వనమనగా సమాశ్వాసనము. నాచన సోమనాథుని, తదనుసారి బమ్మెర పోతనామాత్యుని కథానిర్వహణ మెంత ఉదాత్తమో, తిరుకామకవి కథానిర్వహణమంత అనుదాత్తము. శ్రీకృష్ణుని తనయులయిన ప్రద్యుమ్నాదులు వేశ్యవాటికలో మదిరాపాన మత్తులై ఒళ్ళుమరచి పడియున్నట్లు ప్రారంభము. మరి కథా ప్రయోజనము గల మహేంద్రుడు శరణార్థి అగుచును శచ్యా శ్లేషను వదలడు. శ్రీకృష్ణుడు సమరాంగణమున విరహవిహ్వ లుడై సత్యభామను రప్పించుకొన్నట్లు కల్పనము! పరమాత్మ కేకాదు, కావ్యాత్మకే ఇది కళంకము. తిరుకామకవి మరియొక రచన ధేనుకామహాత్మ్యము. ఇది వచన కావ్యము. ధర్మరాజు గోదానము చేయుట, గోదానఫలము ఇందలి విషయము. అలతి అలతి వాక్యముల వచన రచన అధికము. సరళమైన గ్రాంథికమే. వ్యాకరణ స్ఖాలిత్యములు బహుళము. ద్విత్వానుకార సముచ్చయము బహుధా ప్రయు క్తము. "అది యెవరున్ను యెఱుంగరు. ఇది నిశ్చయము. నేనున్ను ఉత్తములైన మునులున్ను పతివ్రతా స్త్రీలున్ను యెఱుంగుదురు." — మధురశాఖను మధురఫలము వచన కావ్య రచనమే. ఇది ముద్దళఘురి సవతి సోదరుడు చొక్క నాథ నాయకునికి అంకితము. ముద్దళఘురికి అంకితము చేసిన మరొకకవి గణపవరపు వెంకటకవి. ఇతడు లాక్షణికుడుగా, ప్రబంధ రాజవెంకటేశ్వర విజయవిలాస గ్రంథకర్తగా ప్రసి ద్ధుడే. ఇతడు ముద్దళఘురికి అంకితమిచ్చినది విద్యావతీ దండ కము. <u>దండకమును</u> ఒక ప్రక్రియాభేదము. విద్యావతి అన వేశ్య ముద్దళఘురిని ప్రేమించగా అత డామెను తన నాట్యశా

లలో సన్మానపాత్రను చేయుట ఈ దండకమందలి విషయము. వెంకటకవి మరొక రచన పెద్దళఘురి విజయము. అది తంజావూరునకు సంబంధించిన యుద్ధముగురించిన చాటు కృతి. ఇది కూడ ఇదివరకు లేని క్రొత్త ఫక్కీ రచనమే. విలక్షణములైన రచన లివి. ఈ విధముగా మధుర శాఖను ప్రధానముగా వచన కావ్యము తంజావూరు శాఖను యక్షగానము విజయ రాఘవుని తరమున దక్షిణాంధ్రయుగ వాఙ్మయమునందలి విశేషము.

## శ హా జీ త ర ము

తంజావూరు నాయకరాజుల పాలన 1672 తో ముగిసినది. ఛత్రపతి శివాజీ సవతి సోదరుడు ఏకోజీ అది మొదలు తంజావూరు పాలకుడు. ఏకోజీ తరువాత శహాజీ కాలమున తంజావూరున మరల తెనుఁగు వాఙ్మయము వెలసినది. శహాజీ రాజ్యకాలము 1684 – 1712. శహాజీపేర యక్షగానము లిరువది కలవు. అందు పౌరాణికేతి వృత్తము లెక్కువ. పౌరాణిక ప్రతిపత్తి మాత్రము తక్కువ. సాంఘికేతి వృత్తములు సకృత్తు. శహాజీ ఆస్థానకవులును యక్షగాన కర్తలే. విజయరాఘవుని ఆస్థానకవులకు వీరు అనుగుసహోదరులు. విజయరాఘవుని వివాహకథలు వారికివలెనే శహాజీ వివాహకథలు వీరికి విషయము. శహాజీ తరమునందలి యక్షగానముల ప్రధాన విశేషము మార్గనాటక ప్రభావము. కొరవంజి ఒకడు కొసరు. యక్షగాన ప్రాయములైన ప్రబంధ నాటకములు, పల్లకి సేవాప్రబంధములు, శహాజీ ప్రత్యేక రచనలు.

శహాజీ యక్షగానములు :— 1. కిరాత విలాసము 2. కృష్ణవిలాసము 3. గంగాపార్వతీ సంవాదము 4. జల క్రీడలు 5. త్యాగరాజ వినోదచిత్ర ప్రబంధనాటకము 6. ద్రౌపదీ కళ్యాణము 7. పంచరత్న ప్రబంధ నాటకము 8. పార్వతీ పరిణయము 9. రతి కళ్యాణము 10. రామ పట్టాభిషేకము 11. రుక్మిణీ సత్యభామా సంవాదము 12. వల్లీ కళ్యాణము 13. విఘ్నేశ్వర కళ్యాణము 14. విష్ణువల్లకి సేవాప్రబంధము 15. శంకర పల్లకి సేవాప్రబంధము 16. శచీపురందరము 17. శాంతాకళ్యాణము 18. సీతా కళ్యాణము 19. సతీపతి దానవిలాసము 20. సతిదాన శూరము.

శహాజీ యక్షగానములలో పౌరాణిక ప్రతిపత్తి తక్కువ. ద్రౌపదీ కళ్యాణములో స్వయంవరమైన తరువాత ద్రుపద మహారాజుమీద దుర్యోధనాదులు దండెత్తగా ప్రతి ఘటింపఁదలఁచిన పార్థునితో ధర్మరాజు, "వినవోయీ! అర్జునా! వారిగొడవ మనకేల? మనము కన్యకా మణిని దోడ్కొని పోవుదము రావోయీ" అనుట — పార్వతీ కళ్యాణములో పరమేశ్వరుఁడు పార్వతి దగ్గరనుండి వెడలిన తరువాత "పడతియో భోగానఁ బడకపోయె" అనుట — వల్లీ కళ్యాణములో కుమారస్వామి "మనసిచ్చి దాని మరుకేళి గూడుట యెన్నఁడో" అనుట వగైరా అందుకు నిదర్శనము. ఇక శచీపురందరములోని కపిలకణ్వామహర్షులపాత్ర చిత్రణ పరమ ఘోరము. ఋషిపాత్రల నోట "శుద్ధీ బద్ధీ లేని తిట్ల వర్షము!" వారి శిష్యుని సంగతి చెప్పనక్కరలేదు. రుక్మిణీ

సత్యభామా సంవాదము, రతి కళ్యాణము మొదలైన పౌరాణిక యక్షగానముల పాత్రలు ప్రబంధ పాత్రలు మాత్రమే. సమధికమైనది సమకాలిక సమాచారము. ద్రౌపదీ కళ్యాణములో ద్రుపద మహారాజునకు తలవరులు, ఆ తలవరులకు మెరుగు తుపాకులు, శచీపురందరములో పుగాకుతోట మొదలైనవి. ఇక ప్రతి పురాణదంపతుల కళ్యాణమునకు తంజావూరే కథా రంగము. విజయరాఘవునివలె శహాజీ కూడ పెండ్లిపెద్ద. అసలీ కళ్యాణములు పౌరాణిక పురుషులకుగాక దేవాలయ ప్రతిమలకైన పక్షమున వైపరీత్యముండదు. బొమ్మల పెండ్లిండ్లలో మనుష్యులు పెండ్లి పెద్దలగునట్లే దేవాలయ కళ్యాణ మహోత్సవములలో పాలకులు పెండ్లి పెద్దలగుట సావకాశము. అదే "దేవుని పెండ్లికి అందరును పెద్దలే" అను సామెత అయినదేమో! — అట్టి ఆచారము తొలి రచనలలో ఉద్దేశపూర్వకమై తరువాతి రచనలలో అనుకరణమాత్రమే కావచ్చును. ఇంతకు నిది ఊహామాత్రము. ఇక మరొక విశేషము, శచీపురందరములోని ఆధునిక ప్రహసనములకు అలవాటైన నిష్ఠలేని భక్తి విషయము. అది వక్రదంతుని వ్యవహారము "హరిః ఓం అగ్నేయం యజ్ఞమధ్వరం విశ్వతః పది బూరెలు ......... ముద్దపప్పు రూకల సంచి దాచవే తాభిర్నోవడా భవ ..."

సకృద్రచనమైనను సాంఘికేతి వృత్తమైన ప్రతిదాన శూరము నాటకీయముగ నాణ్యము. పరమేశ్వరుడు ప్రత్యక్షమగునుగాక, ప్రధానమైనది సాంఘికేతి వృత్తమే. అంగిరసము దాన వీరము. అంగరసమైన శృంగారము అతి

మాత్రమైనను అంగిరసోపస్కారకము. దేవుని మహాత్మ్యము కంటె మానవుని మనస్తత్త్వమిందు ప్రధాన విశేషము. మోరోభట్టు అను బ్రాహ్మణుడు మాదిగస్త్రీయెడ కాము కుడై ఒక వంక శిష్యుడు మరొకవంక ఆమె ఎంత వారించి నను వినక, ఎట్లైన వాంఛాఫలసిద్ధికి వదరుచు ఆమె భర్త అక్కడికి వచ్చి అదలించినను అదేపాట పాడును. నీచాభి జాత్యమైనను ఉత్తమ ప్రవృత్తిగల ఉదార కుటుంబి ఆ మతంగ స్త్రీభర్త ఆ బ్రాహ్మణునికి తన దారను ధారవోయును. అప్పుడు మోరోభట్టు అకస్మాత్తుగా విద్యుద్ఘాతము తగిలినవానివలె పరివర్తన మంది పశ్చాత్తప్తుడగును. అంతటితో కథ ఆగలేదు. బ్రాహ్మణుడు పశ్చాత్తప్తుడై ఆమె తనకు అక్కర లేదనెనే కాని ఆమె భర్త దాన తిరస్కారము చేయరాదని శాసించును. దాన మిచ్చిన తరువాత ఆమె తన భార్య కాదని ఆ కుటుంబి, పరివర్తన మంది పరదార వలదని ఆ బ్రాహ్మణుడు పంతము లాడుటలో వారిద్దరి మధ్య ఆ స్త్రీ రెంటికి జెడిన రేవడ అయినది. ఆ స్థితిలో పరమేశ్వర సాక్షాత్కారము. దానభంగము రాకుండ, దాంపత్య ధర్మగ్లాని కలుగకుండ చేయును. కథాంత మటుంచిన మనస్తత్త్వ ప్రధానమై సంఘర్షణాత్మకమైన సంఘటనతో నాటకీయత జీవనాడిగా సాగిన యక్షగానమిది. ఇందు సంస్కృత శ్లోకములు ఎక్కువ. కాని యెక్కడికక్కడ అర్థవివరణము అందీయబడినది. అనేక యక్షగానములలో ఇది అగ్రేసరము.

శహాజీ రచనలలో ప్రబంధ నాటకమను పేరుగల రెంటిలో త్యాగవినోదచిత్ర ప్రబంధనాటక మొకటి. ఇది

యక్షగానప్రాయము. ఆరంకములుగ ఉండుట అపూర్వ విశేషము. ఇక రెండవది పంచరత్న ప్రబంధనాటకము. ఇది విలక్షణమైన రచన. ఇందు కథగాని సంఘటనగాని లేదు. పరమేశ్వరుని కొలువునకు 1. బిరుదుమిటారులు 2. నవసిద్ధజోగి 3. చెంచునట్టువోజు 4. బిరుదుబంటు 5. సాదనకాంద్రు వచ్చి నాట్యముచేయుట విషయము. రత్నములవంటి నటపంచకముయొక్క నాట్య ప్రబంధ మగుటను పంచరత్న ప్రబంధనాటకమని పేరు. ఇది ఘన నాట్యశాస్త్ర వైఖరుల మించునని కవి కంఠోక్తియే. ఇక పల్లకి సేవాప్రబంధములు. ఇవి రెండు. 1. విష్ణుపల్లకి సేవా ప్రపంధము 2. శంకరపల్లకి సేవా ప్రబంధము. పల్లకి సేవా ప్రబంధ మొక ప్రత్యేకరచన. విష్ణుశంకర విశేషణములు తత్పరమగుటనే. ప్రధానమైన ప్రక్రియా స్వరూపము రెంటను సమానము. విష్ణుపల్లకిసేవా ప్రబంధరచనావిధాన మిది:— కలశవారాసి నందన (లక్ష్మి) నారాయణుడు రాలేదని విరహ విహ్వలయై ప్రాణేశ్వరుని తోడితెమ్మని ప్రాణసఖులను పంపగా ఆ ప్రాణసఖులు హరి సన్నిధికివచ్చి ఆయనను వర్ణింతురు. అంతలో హరి పేరోలగము. సర్వ గీర్వాణాదుల ఆగమనము. వారలకై వారము. లక్ష్మిదేవి ప్రాణసఖులు స్వాగతములలో విష్ణు సంకీర్తనము. ఆ సఖులు మంజువాణి, ప్రియంవద అను వారలు. వారు నారదుని పిలిచి తమ మనవి వెన్నునితో తెలుపుమని వేడుదురు. నారదు డట్లు చేయనందున అక్షతలు వేయుదురు. తదుపరి, హరి వాహన మైన పతంగకులాధిపుని (గరుడుని) అడుగుదురు. అతడు కూడ అంతే. అప్పుడు హనుమంతుని ఆశ్రయము. అక్కడ

చూపు అంతే. కడకా సఖులే కంజాక్షునికి అంజలి ఘటించి వచ్చినపని చెప్పగా హరి అంగీకారము. అప్పుడు బోయీలు పల్లకి తేగా పల్లకీసి, పల్లకీనెక్కిన శ్రీహరిని శ్రీసఖులు వర్ణింతురు. ఆమీద హెచ్చరికలు చేయుచు స్వామిని శయ్యామందిరమునకు తీసికొనివత్తురు. అక్కడ మరల ఆత్మసఖిని ప్రశంసింతురు. క్రమముగ లక్ష్మీనారాయణులకు మంగళహారతి. వనజనాభునికి లాలి. ఆరగింపు. ఆఖరికి పవళింపుసేవ. కార్తిక ఏకాదశిరాగా అనగా తెల్లవారగా సూతమాగధుల మేలుకొలుపులు. పిమ్మట "శోభనము నుడివే క్రమము"తో ముగింపు. అందింపు వచనములతో అంతట పదకవితా రచనము. ఇక ప్రదర్శన పద్ధతి * "పల్లకిసేవా ప్రబంధములు చిత్రమైన కల్పనతో కూడిన నాట్యాధిక్య ప్రధానములైన నాటకములు ... నాట్యకళా ప్రవీణులైన తిరు[illegible]లు ఇందునిమిత్తము పల్లకిబోయీలలో ముందువారు, వెనుకవారు, రెండు గుంపులుగ ఏర్పడి కథ వినిపింతురు. చిత్రమైన పరికల్పనమిది." నిజముగ ప్రత్యేకమైన ప్రక్రియా విశేషమిది. నిన్న మొన్నటిదాక తంజావూరు ప్రాంతమునందలి దేవాలయములలో ఇవి ప్రదర్శితములు. శహాజి రచనల రాశిలో ఇవి రమణీయములు.

ఇక శహాజీ ఆస్థాన కవులు:— కవిగిరి రుక్మాంగద చరిత్ర వినా అందరి రచనలు యక్షగానములే. అందు నివర్తి శేషాచలకవి సరస్వతీ కల్యాణము, బాలకవి సుబ్బన్న పంచకన్యాపరిణయము వినా అందరి యక్షగానములు ఒకశే

* శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ.

అచ్చు. అనగా శహాజీ వలపు వ్యాపారములు. శహాజీ ప్రయాణమగుట, ఒకానొక రాకుమారి మోహాపరవశ అగుట, ఆ మోహము రాజునకును అంటువ్యాధి అగుట, విరహము, ఆఖరికి వివాహము – ఇది విషయము. నివర్తి శేషాచలకవి శహాజీ విలాసము; దర్భాగిరిరాజు శాహేంద్ర చరిత్రము, రాజమోహన కొరవంజి, రాజకన్యాపరిణయము, సర్వాంగసుందరీ విలాసము, లీలావతీ కల్యాణము, బాలకవి సుబ్బన్న లీలావతీ శాహరాజీయము అటువంటివి. గిరిరాజు వాద విజయము క్రొత్తపుంత. వారవనిత లిద్దరికి నాట్యవిద్యా నైపుణ్యమున వాదమువచ్చి అందొకతె తన వైదుష్యము ప్రదర్శించి శహాజీని మెప్పించి శయనించి తీరెదనని శపథము చేసి సాధించుట కథావస్తువు. సమష్టిపై ఫలస్వామ్యము ప్రభుదాస్యమే. ఆ ప్రభువుల అనుభవ మట్టిదైనను వారి రచనలు పౌరాణికములు. వీరి రచన లివి! అనుభవమున కట్టి అవకాశము లేక యిట్టి రచనలేమో — స్వభావము కంటె అభావమును కొందరి ఆత్మీయత. ఇక గమనార్హమైనది యక్షగాన రచనా పరిణామము. దేశి విశేషమైన యక్షగానము శహాజీ తరమున మార్గనాటకమునకు మక్కువ పడినది. ఇష్టదేవతాస్తుతిలో విఘ్నేశ్వరుని ప్రవేశ మొక విశేషము. అవతారికా ప్రాయములైన నాంది ద్విపదలు కలవు. అంక విభజనము ఆరంభమైనది. ప్రయోగ సూచనలతోపాటు శహాజీ ప్రవేశపెట్టినది సూత్రధారి వచనము. ఈ సూత్రధారి మార్గనాటక సూత్రధారికంటె మరొకతీరు. ఆంగ్లనాటకములందలి "Commentator" వంటి పాత్ర. అంతకంటె పాత్రలను పరిచయముచేయుట, పలుకరించుట కూడ

ఈ యక్షగానసూత్రధారిపనులు. సంభాషణలతో సహా ఆస్థానసంతోషి కలదు. నాటకము లేవి ఉదారవేష భాషా భూషితములని పేర్కొనబడినవి. అతి ముఖ్యమైనది కొరవంజి అభిధానము. అది దర్భాగిరిరాజు వ్రాసిన రాజమోహన కొరవంజి. కొరవంజి అనగా ఎరుకత. ఎరుకత పోడి ఎప్పటి విశేషమే. కాని పాత్ర ప్రాధాన్యమే కొరవంజి నామ సార్థక్యము. అనగా కొరవంజి పాత్రకు ప్రాధాన్యముకల యక్షగానమే కొరవంజి.

శహాజీ కాలమున మైసూరు పాలకుడు కంఠీరవరాజు. కంఠీరవరాజు యక్షగానములు కొరవంజి అభిధానము కలవి. కంఠీరవరాజు కొరవంజి కళ్లై అని ప్రసిద్ధము. కంఠీరవరాజు రాజ్యకాలము 1704–1713. కంఠీరవరాజు కొరవంజి కళ్లై నాలుగు రకములు. ౧. ఆంధ్ర కొరవంజి. ౨. ప్రాకృత కొరవంజి ౩. తిగళ కొరవంజి ౪. తమిళ కొరవంజి. ఆంధ్ర కొరవంజి వస్తువు కంఠీరవరాజు శ్రీరంగనాథుని దర్శించి తిరిగి వచ్చుచుండగా పాంచాలదేశపు రాజకుమారి కాంచనలత చూచి మోహించుట, కొరవంజి ప్రవేశము, వివాహ సంధానము–ఇతివృత్తము గతానుగతికమే. ఇదివరకు రాజు అనుభవము ఆస్థానకవులు వ్రాసిరి. కాని ఇది రాజు అనుభవము రాజే వ్రాసికొన్న సందర్భము. ఇదికాక కంఠీరవరాజు ప్రత్యేకరచన పంచాయుధ కళ్లై. విష్ణుమూర్తి పంచాయుధములు కంఠీరవరాజును కాపాడునట్లుగా ఆ యా పాత్రల అభినయము కలవి పంచాయుధ కళ్లై. తానే తుమ్మికొని తానే చిరంజీవ యనుకొన్నట్లు ఇది స్వీయాశీర్వచనము.

ఇందువలన అన్యకర్తృకమై, ఇట్లు రాజుపేర చలామణీ అగుచున్నట్లు అనుమానము. ఎవరు వ్రాసినను కంఠీరవరాజు పేర లక్ష్మీరాజవిలాసము మొదలైన బహురచనలు కలవు. అందు వసంతోత్సవ విలాసము కొంతవిశేషము కలది. అది కంఠీరవరాజుముందు ప్రదర్శించినట్లు, అందుకొరకు మల్లిక, మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన నటీమణులు స్త్రీపాత్రలు ధరించినట్లును అందలి సమాచారము. అంతేకాదు. ఆనటీమణులలోని మల్లిక అనునామె కంఠీరవ రాజును చేపట్టి వివాహమాడుట అందలి విషయము. ఇక పదకవిత ఇందును పాడినపాటే.

కంఠీరవరాజు కంటె ముందు మైసూరు శాఖను మరొక యక్షగానము కలదు. అది కెంపరాయలు వ్రాసిన గంగాగౌరీసంవాద విలాసము. ఇదే మైసూరు శాఖను తొలిరచనము.

తంజావూరను శహాజీ తరువాత తుక్కోజీ లేక తుళజాజీ (1728 – 36) మరల యక్షగానకర్త. ఇతని కృతులు రెండును ఇంకోధిక విశేషములు. ౧. శివకామసుందరీ పరిణయము. శివకామసుందరి అనగా పార్వతి. ఈకృతి విశేషము రచనా పరము. ప్రారంభమునందలి "జయసర్వ జగదీశా" అను శివస్తుతి సంస్కృతనాందీ సంప్రదాయము. అందు "శివకామసుందరీ మనోహర" అను సంబుద్ధి కథాసూచకము. అనగా వస్తు నిర్దేశము. తదుపరి "నాంద్యంతే సూత్రధారః" అని కలదు. వసంతవర్ణన మొకడు సంస్కృత ప్రస్తావనా సదృశము. సూత్రధారునితోపాటు పారిపార్శ్వకుని ప్రవేశ

మును విశేషము. ఇతివృత్తమున వేదాంత విచారణ కలదు. అందును విద్య అవిద్య అను పాత్రలు. కర్తకుగల వేదాంత దృష్టి ఫలితముగ సమష్టిపై శృంగారము సరసము. ౬. రాజ రంజన విద్యావిలాసము. ఇది కేవలము వేదాంతవిషయక యక్షగానము. "సంసారములో నున్నప్పటికిన్ని పూసలలో దారమువలె నిస్సంసారివై నిరామయుండవై యుండవోయి!" అను శివుని ఉపదేశము ఇందలి తత్త్వప్రతిపాదనము. ఇతివృత్త నిర్వహణము సాంకేతికము. ఇది కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు మానసపుత్రిక. మోహునిరాక మోహన రాగమున, శంకర సాక్షాత్కారము శంకరా భరణ రాగమున మలచుట శిల్పచమత్కారము. రంగముపై నున్న · పాత్ర మాటలలో మరొకపాత్రపేరు తలపెట్టగ ఆపాత్ర ప్రవేశించుట మరొక శిల్పకల్పనము. రచన సరళము. సంస్కృతనాటక సంప్రదాయమైన నాందీ ప్రస్తావనలు సూత్రధార పారిపార్శ్వకులతోసహా ఇందలి విశేషము. ఇతివృత్త స్వీకారమున, తన్నిర్వహణమునకూడ సంస్కృతనాటక ప్రభావము సమధికము. బహువిషయము లచే నిది భవ్యమైన యక్షగానము.

## విజయరంగ చొక్కనాథుని తరము

తంజావూరులో శహాజీ మొదలు తుక్కోజీ వరకు మధురపాలకుడు విజయరంగ చొక్కనాథుడు (1706 – 32). ఇతని తరము శహాజీ తరమునకు సమకాలికమైనను, మధుర శాఖను తెనుగు సాహిత్యము ప్రధానముగ వెలసినది

విజయరంగ చొక్కనాథుని కాలమున అగుటచే ఇతనిపేర నొకతరము పరిగణించుట అవసరము. వచన రచనా ప్రాధాన్యము ఈ తరమునందలి ఇతోధిక విశేషము.

విజయరంగ చొక్కనాథుడు తానుగా కవి. రఘునాథ రాయలు, విజయరాఘవ నాయకులవలె కవిమాత్రమే గాక ఆస్థానకవులకును ఆశ్రయదాత. అంతేకాదు, విజయరంగ చొక్కనాథుని దళవాయి సమ్ముఖము వెంకటకృష్ణప్ప నాయుడు కూడ ప్రసిద్ధకవి. ఇంకను ప్రసిద్ధుడైన శశాంక విజయ కర్త శేషము వెంకటపతికూడ ఈ కాలములోనివాడే.

విజయరంగ చొక్కనాథుని కృతులు రెండు. 1. శ్రీరంగ మాహాత్మ్యము. 2. మాఘమాహాత్మ్యము. ఇవి రెండును వచన కావ్యములు. ఆంధ్రసాహిత్యమున అరుదైన వచన కావ్యములు ప్రత్యేకముగా వెలసినవి విజయరంగ చొక్కనాథునితరమునందే. శ్రీరంగమాహాత్మ్యము క్షేత్రమాహాత్మ్య ప్రతిపాదకమైన వచనకావ్యము. విష్ణుభక్తాగ్రగణ్యుడైన నారదమునికి దేవదేవుడు శ్రీరంగము యొక్క మాహాత్మ్యమును తెలుపుట ఇందలి విషయము. ఇటులే మాఘమాసము యొక్క మాహాత్మ్యము తెలుపునది మాఘమాహాత్మ్యము. ఈ రెండు గ్రంథములును అముద్రితములు. వీనిని శ్రీ గిడుగు రామమూర్తిపంతులు గద్యచింతామణిలో ఇట్లు పరిచయించిరి. "ఈ పుస్తకములో చేర్చినవి అనేకవిధములైన గ్రంథములలోనుంచి మాదిరిగా ఎత్తి వ్రాసిన ఖండములు. వ్యావహారిక భాషలో ఆ యా గ్రంథములు రచితమైనవని రుజువుచేయడము కోసమే." అని. ఈ రెంటి తాళగ్రంథ

ముల లేఖనపద్ధతి విలక్షణమే. "శ్రీరంగ్గంబ్బనం బరగిన విష్ణుస్థలంబ్బు మాహాత్మ్యంబ్బు" మాదిరి. "అప్పటికింప్పలుక రింపనైతి" "శ్రీరంగ రాజాజూచి" "నవబ్రాహ్మలు" వంటి లేఖనవైఖరియు లేకపోలేదు. అనేక తాళ పత్రప్రతులకు ఆయా లేఖనపద్ధతి పరిపాటి. అంతమాత్రమున వ్యావహారికభాష కాజాలదు. రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాష అనుటకు కారణము ఆలోచనీయాంశమే. పంతులుగారి "ఆంధ్రభాషాభిషక్కుల భాషాభేషజము"లో "ప్రాచీనాంధ్ర గ్రంథములలోగాని నేటి మన వ్యవహారములోగాని ఉన్న భాష వాస్తవమైనది. అందులోగాని ఇందులోగాని లేనిది కృత్రిమ భాష." — "మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన ప్రబంధాలుతప్ప తక్కినవన్నీ వాడుక భాషలోనే రచించినారని ఆ ప్రతులు చూస్తే తెలుస్తుంది." అను వాక్యములు కలవు. అగుచో పైవచన గ్రంథములు వ్యావహారిక భాషారచనలే అనవలెను. కాని మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన ప్రబంధములకు మకుటమేగాక, పంతులు గారికిని ప్రమాణగ్రంథమైన ఆంధ్రనైషధము తాళపత్రప్రతులందును ఇట్టి రచనమే కలదు. అందలిభాష వ్యావహారికమని ఎవ్వరును అనలేరు. పంతులుగారును అనలేదు. అట్టి నైషధమునను అనేకదోషములు లేఖకుల మూలమున కలవు. ఆంధ్ర విశ్వవిద్యాలయములోని ఒక తాళపత్రప్రతిలో "వొల్ల ననుమాట కర్థమో యుత్పలాక్షి" అని కలదు. ఇక్కడ కవిపాఠము యతి మైత్రినిబట్టి 'ఒల్ల' అని స్పష్టము. ఇట్టివి అనేకము. ఈ విధమైన లేఖనపద్ధతి ఆంధ్రసాహిత్య పరిషత్

గ్రంథాలయములోని అనేక తాళపత్రప్రతులందు కలదు. కారణము లేఖకుల దోషము. లేఖకుల దోషము లెట్టివో అప్పకవి చెప్పినదే. అంతేకాదు. గ్రాంథిక భాషకు వ్యావహారిక భాషకు వ్యత్యాసము లేఖనపద్ధతి కానేకాదు. వ్యాకరణానుసారమైనది గ్రాంథిక భాష, ఉచ్చారణానుసారమైనది వ్యావహారిక భాష. భాషకుగల వ్యవహారధర్మము ఉచ్చారణమే. శ్రీ గురజాడ అప్పారావు కన్యాశుల్కము అట్టి వ్యావహారిక భాష. అట్లుకానిది గ్రాంథికము కాకపోయినను కృతక భాషయే. కనుక విజయరంగ చొక్కనాథుని గ్రంథములు రెండును ఇతర గ్రంథములకువలె లేఖనపద్ధతి, లేఖక దోషములు తొలగించిన గ్రాంథిక భాషయే. వ్యాకరణస్ఖాలిత్యములు దక్షిణాంధ్రయుగములోని సర్వగ్రంథములకు సహజలక్షణము.

విజయరంగచొక్కనాథుని దళవాయి సమ్ముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు మఱొక రెండు వచనకావ్యములు వ్రాసిన కవి. ౧. జైమిని భారతము. ౨. సారంగధర చరిత్ర. మొదటిది పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినిభారత చంపూకావ్యమునకు, రెండవది చామకూర వేంకటకవి సారంగధర చరిత్ర చంపూ కావ్యమునకు వచన రూపానువాదములు. ఇందలి వచనమును గ్రాంథికమే. శైలి సరళము. వ్యాకరణ స్ఖాలిత్యములును కలవు. అవి కర్తృకృతములో, లేఖక కృతములో వచనగ్రంథములలో నిర్ణయించుట అసాధ్యము. పై వచన కావ్యములతోపాటు సమ్ముఖము వెంకటకృష్ణప్ప నాయకుని ప్రబంధములు ౧. అహల్యా సంక్రందనము

౨. ఏకాశ్వాసమైన రాధికాసాంత్వనము అనునవి. రాధికాసాంత్వనములోని పద్యములు తరువాత ముద్దుపళని రాధికాసాంత్వనములో కలవు. పద్యములకు పద్యములు ముద్దుపళని సంగ్రహించినదో, మరెవరేని అట్లు మహిళకు అన్యాయము కల్పించిరో చెప్పలేము. ఈ రెండుపనులును సావకాశమే. ఇక అహల్యాసంక్రందనము అతిప్రసిద్ధమైన అహల్యాకథయే. కాని పౌరాణిక ప్రతిపత్తిలేదు సరికదా పాత్రానౌచిత్యము పరమావధికము. అహల్య సృష్టికొరకు దేవతలకు, అయిన ఋషులు అందరికి, నడివీథి నాట్యములు! ఒక యోగిని ఇంద్రుని దూతిక! మరి అహల్యేంద్రుల ప్రవర్తన శ్రుతిమించిన శృంగారము. కవితారీతి గొప్పదే. కాని అసభ్యాసహ్యము.

విజయరంగ చొక్కనాథుని ఆస్థానకవి కుందుర్తి వెంకటాచలపతి. మిత్రవిందా పరిణయము కార్తికమాహాత్మ్యము అను ప్రబంధములకు కర్త. మిత్రవిందా పరిణయము వర్ణనలకు ప్రసిద్ధము. సంకుసాల నృసింహకవి కవికర్ణ రసాయనముకంటె మించినవర్ణన లిందు మిక్కుటము. శ్రీకృష్ణుడు మిత్రవిందను (ఈమె అష్టమహిషులలో ఒకతె) పరిణయమాడుట ఈ ప్రబంధమునందలి ఇతివృత్తము. ఈ వెంకటాచలకవి భారత భాగవత రామాయణ వచనకావ్యములు వ్రాసినట్లు మిత్రవిందాపరిణయమునుబట్టి తెలియనగు సమాచారము.

విజయరంగ చొక్కనాథుని కాలములోని వాడైన శ్యామరాయకవి రామాయణ వచన కావ్యకర్త.

ఈ కాలమునకు చెందిన ప్రసిద్ధుఁడైన ప్రబంధ కవి శేషము వేంకటపతి. ఇతని ప్రబంధము శశాంకవిజయము. ఇందలికథ తారాశశాంకుల రహస్యవర్తనము. ఇంతకు పూర్వము వ్రాయబడిన పురాణములందు కావ్యములందు ఈ కథ ప్రసక్తమే కాని ఈ శశాంకవిజయమున ఆ ప్రవర్తనము సమర్థింపబడినది. "తాటాకులలోని వ్రాసిరి పరాంగన గూడిన పాపమంచు" అని తార వాదము. [అసలీ "లోకము లోని" పద్యము అంతకుముందే లోకములోని పద్యము. పుత్తేటి రామభద్రకవి. సకల కథాసార సంగ్రహము నందలి "కలిమిం గొందఱు శ్రోత్రియుల్" అను పద్యమున కిది అందమైన ప్రతిబింబము ]* ఈ శశాంకవిజయమునకూడ కవితారీతి గొప్పదే. కాని ఇదికూడ అసత్కావ్యము. ఈ శశాంక విజయము విజయరంగ చొక్కనాథునిమంత్రి వంగల సీనయ్యకు అంకితము.

వంగల సీనయ్య కృతిభర్త మాత్రమే కాదు, కృతి కర్త కూడ. ఇతని కృతులు పదములు. ఇతఁడు "ఘనయ దేశీయ ....... సంగీత విద్యా విశారదుఁడు, వీణావినోద భూలోక నారదుఁడు, సరస పద పద్య గద్యరచనా భోజుఁడు" అని శశాంకవిజయము అవతారికలోని సమాచారము. ఇతని పదములు "మన్నారు రంగ" అను మకుటము కలవి. అతి ప్రసిద్ధమైన "శివపూజాపరురాలనురా" అను పదమీతనిదే. అదే చాలు అశ్లీలమునకు! "మోము మోమునకు జేర్చకురా-సీనామముతోడ భూతి గూర్పకురా వేమఱు తొడభిత్తు

---

* కీ. శే. మానవల్లి రామకృష్ణకవి.

వేడుకరా" అని ప్రయోగము! శివభక్తిపేరిట శివమోహితపది శృంగారమే కాదు వైష్ణవద్వేషము కూడ. ఈ పదములందే "శ్రీవైష్ణవులంటే చేరనురా" అని హెచ్చరిక. వైష్ణవ పరమైన క్షేత్రయ్య పదములు, శైవ పరమైన వంగల సీనయ్య పదములు పదలాలిత్యమునందు భక్తిపేశీరక్తియందు సమానములు.

పద, పద్య, గద్య రచనములతో పాటు యక్షగాన రచనముకూడ విజయరంగ చొక్కనాథుని తరమునందు కలదు. విజయరంగ చొక్కనాథుని ఆస్థాని తిరుమలకవి "చిత్రకూట మాహాత్మ్యము" అను యక్షగానమునకు కర్త. దీనికి "తిల్ల గోవిందరాజు నాటకము," అని కూడ పేరు. తిల్లా దేవి అనగా పార్వతి. ఆమె చిత్రకూటమున కేగుట, అందు వలన విరహమును భరింపలేక వేటకంకను పరమేశ్వరుడు ఆపర్వతమునకేగి ఆమెను కలిసికొనుట ఇందలి కథావస్తువు. ఇది "వచన చమత్కార వైఖరి మీరగను" "నర్తన యోగ్యముగ"ను వ్రాసినట్లు కవికంఠోక్తియే.

శ్రీపతి రామభద్రకవి హాలాస్య మాహాత్మ్యమను వచనకావ్యము ఈకాలములోనిదే. ఇంకను ప్రబంధములు లెక్కకు వచ్చునవి ఉన్నప్పటికి మధురశాఖను ప్రత్యేక రచనము వచనకావ్యమే.

మధురశాఖతోపాటు మైసూరుశాఖను ఈ కాలమున వెలసినది వచనకావ్యమే. మైసూరు దళవాయి కళులె వీరరాజు(1704–24) వచనకావ్యములు వ్రాసిన ప్రసిద్ధ కవి. మహాభారతము ఇతని రచన. ఇందు తుపాకుల

అనంత భూపాలుని సహాయము కలదు. ఈ కావ్యము పూర్తిగా లభింపలేదు. లభించినంతవరకు ఇది వ్యాస భారతాను సారమని తెలియనగును. ఇందు భగవద్గీతకూడ అనుసరింపబడుట విశేషము. ఈ భారత వచనముకూడ వ్యావహారికచ్ఛాయలు, వ్యాకరణ స్ఖాలిత్యములు వినా గ్రాంథికమే. శైలి సరళము. దీర్ఘవాక్యరచనము కలదు. ఈ మహాభారత వచనకావ్యమున సహాయము చేయుటేగాక తుపాకుల అనంత భూపాలుఁడు స్వయముగా "విష్ణుపురాణము" "రామాయణ సుందర కాండము" అను వచనగ్రంథములు వ్రాసిన కవి.

కళులై వీరరాజు కొడుకు నంజరాజు కూడ వచన కావ్యములు వ్రాసిన కవి. ఇతని కాలము 1704-24. ఇతని కావ్యములు ౧. హాలాస్య మాహాత్మ్యము ౨. కాశీ మహిమార్థ దర్పణము. హాలాస్య మాహాత్మ్యము ప్రధానముగా గ్రాంథికము. కాశీమహిమార్థ దర్పణము ప్రధానముగా వ్యావహారికము. ఉదాహరణ:– "ఒకానొక కాశీ పట్టణము భూమియందున్నదైనాగాని అక్కడ వాసం చేసుకొని ఉండేవారికి పునర్భవాదులులేవు గనుక తాను భూమి గదా అయినాగాని స్వర్గమందు ఉండేవారికి పునరావృత్తి గలదు,..." ఇట్టివి పూర్వకవుల వ్యావహారిక భాషాకావ్యములు. ఇంతకుముందును ఇట్టివి కలవు. ఈ కాశీమహిమార్థదర్పణము స్కాందపురాణములోని కాశీఖండమునకు వచనరూపానువాదము. తొలుత నిది కర్ణాట భాషలో వ్రాసి తరువాత తెనుఁగున వ్రాసినట్లు గ్రంథాంత గద్యనుబట్టి తెలియనగును.

ఈ విధముగా ఎక్కడెడ ప్రబంధములు, పదములు, యక్షగానములు ఉన్నప్పటికి విజయరంగ చొక్కనాథుని కాలమున ప్రధానముగా వెలసిన ప్రక్రియ వచనకావ్యము. ఆంధ్రసాహిత్యమున అదుద్వైత వచనకావ్యమును తాను వ్రాసి, వ్రాసినవారిని తాను పోషించి, ఆదరించిన విజయరంగ చొక్కనాథు డెంతయు ప్రశంసాపాత్రుడు.

## ముద్దుపళని తరము

ఈమె ప్రసిద్ధురాలు అగుటచే ఈమెపేరున ఈ పేరు. ఈ కాలమున తంజావూరు పాలకుడైన రెండవ ఏకోజీ (1736 – 37) రామాయణ ద్విపదకావ్యము, విఘ్నేశ్వర యక్షగానము వ్రాసినవాడు. ఏకోజీ తరువాత ఏలిక అయిన జయసింహుని (1737 – 40) ఆస్థానమునగల నెల్లూరి శివరామకవి కామకళానిధి అను కామశాస్త్రమునకు కర్త. జయసింహుని తరువాత అతని సోదరుడు ప్రతాపసింగు మహారాష్ట్ర పాలకుడు. ఇతని కాలము 1740 – 62. ఈ కాలమున ముద్దుపళని కవయిత్రి. ఈమె ప్రసిద్ధయే.

ముద్దుపళని కృతి – రాధికాసాంత్వనము అను ప్రబంధము. ఈమె రాధికాసాంత్వనమునకు సమ్ముఖము వెంకటకృష్ణప్పనాయకుని ఏకాశ్వాస రాధికాసాంత్వనముతో గల సంబంధము ఇదివరకు చెప్పబడినదే. ముద్దుపళని రాధికాసాంత్వనము లింగనమఖి తిరుకామకవి సత్యభామా సాంత్వనమునకు పైస్థాయి. ఈ ప్రబంధము ఎత్తుగడయే ఇళాదేవి సమర్త! ఇళాదేవిని శ్రీకృష్ణుని కడకు పంపుచు

రాధచేసిన బోధ రాసక్రీడారణరంగము. తదుపరి రాధ విప్రలంభశృంగారము తదతీతము. అనేకములైన అసభ్య శృంగార గ్రంథములను నయమనిపించు అసత్కావ్య రాజమిది. కవుల చరిత్రలో కందుకూరి వీరేశలింగము పంతులుగారు ఇట్లనిరనియే ఈ గ్రంథ పీఠికలో బెంగుళూరి నాగరత్నమ్మగారి సమర్థనము. ఎంత సమర్థించిన అనౌచిత్యము అనౌచిత్యమే. ముద్దుపళని అశ్లీలవర్ణనలు ముద్దుగొలుపువారికి ముందే వందనము. అట్టివర్ణన శ్రీనాథుఁడు చేయలేదా? అనవచ్చును. శ్రీనాథుడేల? శ్రీహర్షుడే చేసినాడు. అనిచెప్పి నైషధమున అనౌచిత్యము లేదని కాదు. బహుగుణ భాసమానమైన నైషధమునకు బహు దోష బంధురమైన రాధికాసాంత్వనమునకు సాపత్యమే సాహసము. ఇతర గ్రంథమైన క్రీడాభిరామమున అట్టి వర్ణనలు పాత్రోచితములు. పాత్రౌచిత్యమే పరీక్షానికషము. రాధికాసాంత్వనమున పాత్రలు పౌరాణికములు. క్రీడాభిరామమున ధూర్తపాత్రలు. ధూర్త శృంగారము వర్ణించుటే ఆప్రక్రియ లక్షణము. ఇక ధూర్జటికూడ ఒక అశ్లీలవర్ణన చేసినవాడే. అది పాత్రవిరుద్ధము కాదు కాని అనౌచిత్యమే. కాని అనేక ఔచిత్యములు కల కావ్యములో అదొక అనౌచిత్యము. అనేక అనౌచిత్యములే కల కావ్యము రాధికాసాంత్వనము. అయినను కవితాధార అద్భుత మనవచ్చును. కూచిమంచి జగ్గకవి చంద్రరేఖావిలాప మున కవితాధార ఇంకను అద్భుతము. అని చెప్పి అది సత్కావ్యమా? అట్లే రాధికాసాంత్వనము సత్కావ్యమే

అనిన "సాధుస్తస్మైనమః" — సమష్టిపై ముద్దుపళని నాభికానాంత్యానము శేషము వేంకటపతి శశాంకవిజయము కంటె అసభ్యాన్వయము. ఇక ముద్దుపళని పాశురములు రేక నప్తపదుల కర్త్రి అనుట కల్పన. పాశురములనగా అరవ భాషలో, ఆముక్తమాల్యదలోని గోదాదేవిచేత చెప్పిన వైష్ణవగీతములు. వాని సంఖ్య 30. అందు పదిమాత్రమే ఆంధ్రానువాదములు ఉపలబ్ధములు. అవి ముద్దుపళని కృత ములుకావు. శ్రీనివాసదేశిక విరచితములు.

ప్రతాపసింగు తరువాత రెండవ తులజాజీ, అతని తరువాత ప్రతాపసింగు కొడుకు అమరసింహుడు తంజావూరు పాలకులు. అమరసింహుని కాలమున (1788 - 89) మాతృ భూతకవి పారిజాతాపహరణయక్షగాన కర్త. ఇది విలక్షణ మైన యక్షగానము. ఇందు మార్గనాటక ప్రభావము, ఇతర దేశినాటక ప్రభావము, ప్రబంధ ప్రభావము కూడ కలవు. అయిదంకములుగా విభజింపబడుట సంస్కృత నాటక సంప్రదాయము. భామాకలాపము బాణీ ఇతర దేశినాటక ప్రభావము. సుదీర్ఘములైన వర్ణనలు, ప్రత్యేకాంతగద్యలు ప్రబంధప్రభావము. మరొక విశేషము, తమిళ కర్ణాట మహారాష్ట్ర భాషలలో బాహాటములైన సంభాష ణలు. ఇతివృత్తము ప్రసిద్ధమైన పారిజాతాపహరణప్రబంధము నందలిదే. ప్రబంధకర్త ముక్కుతిమ్మన ముద్దుపలుకులును ఇందు కలవు. మొత్తముమీద మాతృభూతకవి పారి జాతాపహరణ యక్షగానము విలక్షణము.

## రఘునాథ తొండమాన్ తరము

తంజావూరు, మధుర, మైసూరులతోపాటు పుదుక్కోట కూడ సాహిత్యరంగమే. పుదుక్కోట పాలకులు నాయక రాజులే. కాని వీరికి "కోటి" ఇంటిపేరు. "తొండమాన్" బిరుదునామము. 1766–89 నడుమ పుదుక్కోట పాలకుడు కోటి రఘునాథ తొండమాన్ "పార్వతీ పరిణయము" అను ప్రబంధమునకు కర్త. ఈ ప్రబంధము కాళిదాసు కుమార సంభవమునకు, నన్నెచోడుని కుమారసంభవమునకు అను కరణములు కల స్వతంత్ర రచన. కాళిదాసు కుమార సంభవము ఉదాత్తరసాన్వితము. నన్నెచోడుని కుమార సంభవము ఉదాత్త, అనుదాత్త లక్షణముల ఆకరము. రఘునాథ తొండమాన్ పార్వతీపరిణయమునందు అనుదాత్త విషయములే అధికము.

కృత్యాది పద్యము తొలి పాదమునందే "శ్రీమత్పర్వత రాజ్య కన్యను వరించేవేళ" అని వ్యాకరణస్ఖాలిత్యము. మరల వ్యాకరణ విశేషములు కావ్యమున మలచిన కవి ఇతడు. ఇతని హిమాలయ పర్వతమున "జరుగుడు బండలన్నిలిచి జట్టున జాఱెడు వేల్పు బోగపుం దరుణులఁజూచి, యజ్వలు, వృథాకృత ఏవ మఖః పురా" అనుకొందురట! అంతే కాదు. హిమవంతుడు "కస్తూరి వీణెలఁగానుకగాఁ దెచ్చు కోయకు జీతంబు గొప్పచేయు"నట! ఇందలి సంగీత ప్రేమ ఆ రఘునాథ తొండమాన్‌దే. కాని సంఘమున కది నైతిక పతనము. సాహిత్యమునకు ఔచిత్యపతనము కూడ. ఇక పార్వతి వర్ణన — ఇందు పార్వతి మేనకాహిమవంతుల కన్న

సంతానము కాదు. దత్తపుత్రిక - నన్నెచోడుని పార్వతి వర్ణన వలె పరమానౌచిత్యము. తారకాసురుడు,

> "శైవి వినుపింప భాగాయె శంకరా భరణంబటంచును ప్రస్తుతించు
> శార్దూల వృత్తంబు చదివిన నిది కంద పద్యంబు గణములెంచుమనుచు
> నటతాళమునఁ జాత్రమాడుచు వచ్చిన ఘాతుకరూప కాంగముఁ జైన
> పాణిపియాన నుపన్యసించినవానిఁ బద్మినీ లైంగిక ప్రశ్నమడుగు"

అని ఒక వర్ణన. ప్రతాపరుద్రీయములోని పేరిగాని ప్రభుత్వమున కిది పైచేయి. కావ్యమంతట పౌరాణిక ప్రతిపత్తి విరళము: పార్వతి తపస్సు పరీక్షించుటకు వృద్ధవిప్రునిరూపమున వచ్చిన పరమేశ్వరుని ఆమె చెలికత్తెలు "నీలకంఠుని యేల నీవు దూషితివంచు ....", "చెంపగొట్టి" నట్లు, "గిండి దోచి" నట్లు, "నెత్తిగొట్టి" నట్లు కల్పించుటకంటె కావ్యజగత్తున మరి అనౌచిత్యముండబోదు. పార్వతీపరమేశ్వరుల వివాహ సందర్భమున రంభోర్వశుల రగడ సమకాలిక సందర్భమే. వివాహానంతరము పార్వతీపరమేశ్వరుల శోభనాది వర్ణనము శ్రుతిమించిన శృంగారమే. సమష్టిపై ఇదికూడ అనుత్తమ ప్రబంధమే.

రఘునాథ తొండమాన్ ఆస్థానమున నుదురుపాటి వెంకన్న ప్రసిద్ధకవి. ఇతని కవితారచన "పార్వతీకళ్యాణము"ను యక్షగానము. ప్రసిద్ధగ్రంథము "ఆంధ్రభాషార్ణవము." అచ్చికపదముల నిఘంటువిది. రఘునాథీయమను అలంకార శాస్త్రము, మల్లుపురాణము అని మల్లుర గురించిన పురాణము ఇతర కృతులు. మల్లుపురాణమువలె నవనప్ప

అను వాని "ఖడ్గలక్ష శిరోమణి" ఖడ్గభేదముల గురించిన గ్రంథము. ఈ రెండును వాఙ్మయేతరములు.

ఈ కాలమున మరొక ప్రసిద్ధకవి కస్తూరి రంగకవి. ఇతడు డూప్లేకడ దుబాసి. "ఆనందరంగరాట్ఛందము" ఇతని లక్షణ గ్రంథము. ఈ రంగకవి కూడ పదకర్త. "కస్తూరి రంగ రంగా కావేటి రంగ రంగా" అను మకుటము కల పదము లితనివే. పదకర్త పేరు ప్రపంచకర్త పేరు కూడ మకుటమే.

## త్యాగరాజు తరము

పదునెన్మిదవ శతాబ్ది పరభాగము, పందొమ్మిదవ శతాబ్ది ప్రథమభాగము, ప్రపంచవాఙ్మయమునకు ప్రాధాన్య వివక్షకలకాలము. ఆకాలమున 1769 లో జరిగిన ఫ్రెంచి విప్లవము ఫలితముగ పాశ్చాత్యసాహిత్య మొక ప్రత్యేకా ధ్యాయము. ఆ సాహిత్యమునకుగల ప్రత్యేకత ఆత్మీయమైన అనుభూతికి రసచిత్రణము. ఆకాలమునకు సమకాలమున, ఆ సాహిత్యమునకు సమధర్మమున, స్వతంత్రముగ ఆంధ్ర సాహిత్యమున వెలసిన మహాకవి త్యాగరాజు. త్యాగరాజు కీర్తనలన్నియు ఆత్మీయమైన అనుభూతికి రసచిత్రములే. ఆధ్యాత్మిక ప్రతిపత్తి అధిక విశేషము. కీర్తనలతోపాటు యక్షగానములును త్యాగరాజు ప్రత్యేక భావనాఫలములు.

త్యాగరాజు ఇంటిపేరు కాకర్ల. ఊరు తిరువయ్యారు. కాలము 1756 – 1847 మధ్యకాలము.

త్యాగరాజు కృతులు నిజమైన భక్తికి నీరాజనములు. ప్రతికృతి రసప్రసరము. రాగప్రధానము. రసభావేతరంగితమైన రామభక్తి త్యాగరాజస్వామి సర్వస్వము. అంతేకాదు. "కామసంబుచేత తత్త్వము పలుకుచు కామదాసులై కరుణ మాలి మదిని, భూమి సంచరించి పొట్టనింపుచును తామే పెద్దలటయ్య!" అని నాటి సంఘదౌర్భాగ్యమును ఖండించిన యుగపురుషుడు త్యాగరాజు. దక్షిణాంధ్రయుగవాఙ్మయ మను అఘపంకమున త్యాగరాజు కృతులు అనర్ఘపద్మములు. అవి పదివేలు. మధురభక్తి మాటున లౌకిక శృంగారము గాక పరకాష్ఠనందిన పరమార్థనిష్ఠతోడి ఆత్మ పావిత్ర్యమే, త్యాగరాజు తత్త్వప్రతిపాదనము. "సంగీతమునకు సౌందర్యముతోపాటు సౌశీల్యము నొసగినది త్యాగరాజు" అనుమాట* అర్థవంతము. క్రాంతదర్శనముతోపాటు దివ్యదర్శనమును త్యాగరాజు తపస్సిద్ధి. ధన్యమైనది దక్షిణాంధ్రయుగ వాఙ్మయము. పవిత్రమైనది పదకవిత. కేవల భక్తిమాత్రమే కాదు కల్పనాశక్తి సయితము త్యాగరాజు ప్రత్యేకత. అందుకు యక్షగానముల అన్యథా కల్పనములు నిదర్శనములు.

త్యాగరాజు యక్షగానములు మూడు. ౧. సీతారామ విజయము. ఇది అచ్చయికూడ ఈనాడు దొరకకపోవుట దురదృష్టము. ౨. నౌకావిజయము. ఇతివృత్తము గోపికా వస్త్రాపహరణమే కాని, భాగవతమునందలి అనౌచిత్య శంక కలుగకుండ అన్యథా కల్పనము. సహస్రగోపికలు సౌందర్య గర్వితలు. వారికి గర్వభంగము సేయుట శ్రీకృష్ణునియత్నము.

* డాక్టర్ కె. వి. ఆర్. నరసింహం.

అందుకు నౌకావిహారము. అకస్మాత్తుగ గాలివాన, గాఢాంధకారము. ఆ స్థితిలో నావ అడుగుభాగము చిల్లు పడినది. నీరు లోనికి రాసాగినది. నీరువచ్చెనా నౌకా భంగము! ప్రాణహాని! ఏమిటి కర్తవ్యము? సౌందర్య గర్విత లైన గోపికలు శ్రీకృష్ణుని అడిగిరి. నీరురాకుండ కంచుకములు విప్పి కప్పుడని కృష్ణుని ఆదేశము. అగతికమైన అవస్థ. అట్లు చేసినను అదేస్థితి. కట్టుపుట్టములు కూడ విప్పి కప్పుడని మరల శ్రీకృష్ణుని ఆదేశము. చావుబ్రతుకుల సమస్య. ఒకవంక ప్రాణహాని! మరొకవంక మానభంగము! రెండును ప్రాణాంతకములే! ప్రాణమున్న కదా మానభంగమునకై మథన! కట్టుపుట్టములు విప్పి కప్పకున్న ప్రాణప్రయాణమే. అంతకంతకు నావ అడుగుభాగమునుండి అధికముగా నీరువచ్చి నిండుచున్నది. మరి ఆలస్యము చేసిన మొదటికే మోసము! ఎవ్వరికిని ప్రాణములన్న ఆశయేకదా! ప్రాణరక్షణార్థము పాపము గోపికలు కట్టుబట్టలు విప్పిరి. కప్పిరి. కాని ఇంకను నీరు అట్లే వచ్చుచున్నది. అప్పుడు వారికి అర్థమైనది, అది శ్రీకృష్ణుని మాయ అని. వెంటనే పాదాక్రాంతలయిరి. అప్పుడు శ్రీకృష్ణుని అభయహస్తము. ప్రమాదము తప్పినది. గోపికల సౌందర్యగర్వ మణగినది. ఇది సహజమైన, సంభవమైన, సంఘటన. ఇటువంటి కల్పన ఇంతకుముందు లేదు. కేవల మిది త్యాగరాజు ఉపజ్ఞాఫలము. కథాకల్పన మిది అనిదంపూర్వమే కాదు అపూర్వము కూడ. 3. ప్రహ్లాద భక్తవిజయము. ఇందును భాగవత కథను మించిన కల్పనలు బహుళము. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని సముద్రములో

పడవేయించగా సముద్రుడు ప్రహ్లాదుని మహాభక్తుడని సేవిం చుట మొదలైనవి. ప్రహ్లాదుడు సముద్రుని హరిసాక్షాత్కార మునకు మార్గము అడుగ సముద్రుడొసగిన సందేశము త్యాగ రాజస్వామి సందేశమే. "ఆత్మార్పణమే షోడశోపచారము లుగ భావించి భగవదారాధన సేయుటే కర్తవ్యము." అని యా సందేశము. ఈ రెండు యక్షగానములును మార్గనాటక ప్రభావము కలవే. నాందీ ప్రస్తావనలు కలవు. ప్రహ్లాద విజయము అయిదంకములు. అటు కృతులు, ఇటు యక్షగాన కృతులు, అపూర్వరచనలైన త్యాగరాజు ఆంధ్రసాహిత్య మునకే గర్వకారణము.

త్యాగరాజు తరువాత మెలట్టూరి వెంకటరామశాస్త్రి ప్రసిద్ధుడు. కూచిపూడి భాగవత నాటకములవలె మెలట్టూరు భాగవత మేళనాటకములు ప్రదర్శన ప్రధానములు. కూచి పూడి భాగవతులకు సిద్ధేంద్రయోగివలె మెలట్టూరు భాగ వతులకు ఈ వెంకటరామశాస్త్రి గురుపాదుడు. వెంకటరామ శాస్త్రి బహు గ్రంథకర్త. ప్రహ్లాదచరిత్ర, రుక్మాంగదచరిత్ర, మార్కండేయచరిత్ర, ఉషాపరిణయము, హరిశ్చంద్ర, సీతా కళ్యాణము నేడు లభించునవి. ఇవన్నియు నాటకములనబడిన యక్షగానములే. ఈ యక్షగానములలో ప్రావేశకీధ్రువ సంస్కృత నాటకసంప్రదాయము – క్రొత్త విశేషము. వీరు దేశమంతట తిరిగి ప్రదర్శించుట ప్రధానవిశేషము.

తదుపరి రెండవ శివాజీ (1833 – 55) ఒక యక్షగాన కర్త. దానిపేరు అన్నపూర్ణవిజయము. ఇదికూడ మార్గ

నాటక ప్రభావము కలదే. అంకవిభాగముతోసహా ఈ యక్షగానమున తుదిని పాత్రధారులపట్టిక యుండుట విశేషము.

శహాజి మొదలు శివాజీవరకు మహారాష్ట్రులు సంగీత సాహిత్యవేత్తలుగా స్పష్టము. అన్యదేశస్థులకు ఆంధ్రభాష అబ్బనివిద్య, ఆంధ్రకవిత్వము అందనిఫలము కాదుగాని, మహారాష్ట్రుల ఆంధ్రకవనము కొంత అనుమానాస్పదము. కారణములు ౧. మహారాష్ట్రులు సంస్కృతాంధ్ర తమిళ భాషాపోషకులని మాత్రమే తచ్చరిత్రకారుల అభిప్రాయము. ౨. ఆంధ్రకవులని తెలుపు అవతారిక లొకపెద్ద ఆధారము కాదు. శరభోజీ దళవాయి ఆనందరావు పేరనున్న విద్యా పరిణయము అను సంస్కృత నాటకము వేదకవి కృతము. ఆ విద్యాపరిణయమును అనుసరించినట్టిదే తుక్కోజీపేర నున్న రాజరంజన విద్యావిలాసము. ఈ రెండును ప్రబోధ చంద్రోదయమునకు మానసపుత్రికలు. ఆనందరావుకివలె తుక్కోజీకిని నేపథ్య సంగీతము కలదేమో!—శివాజీ అన్నపూర్ణ విజయమున తుది ఆశీర్వాదము అన్యకర్తృకము. 3. శహాజీ 1693 లో నలభైయారుగురు పండితులకు బహుమానమొసగిన శహాజీరాజపురము - అసలుపేరు తిరువసనల్లూరు - అను విద్యానిలయమున ఆంధ్రపండితుల సంఖ్య అధికము. మహారాష్ట్రుల ఆంధ్రకావ్యములును అధికము. కనుక ఆంధ్రపండితుల కర్తృత్వము అవకాశము. కనీస మా పండితుల సహకారము తప్పనిసరి.

## మరికొందరు కవులు

ఇక దక్షిణాంధ్రమున ఇతరత్ర ప్రసిద్ధులైన కవులు.

౧. చల్లా సూరయ్య :– ఇతని కృతి వివేకవిజయ మను యక్షగానము. ప్రబోధచంద్రోదయమున కిదియు మానసపుత్రిక. ఇతనికాలము పదునేడవ శతాబ్దితుదిగాని పదునెనిమిదవ శతాబ్ది మొదలుగాని అగును. ౨. ఆలూరి కుప్పన :– ఇతనికి ఆంధ్ర కాళిదాసు అని బిరుదు. ఇతనికృతి ఆచార్య విజయము లేక పార్థసారథి విజయము అను యక్షగానము. ౩. సారంగపాణి :–ఇతడు పదకర్త. సారంగ పాణి పదములని వ్యవహారము. భర్తృహరి సుభాషితము వంటివలె ఈ పదసముచ్చయమున శృంగారనాయికా పదములు, సామాన్య శృంగారపదములు, జానపద శృంగార పదములు, భక్తివైరాగ్య పదములు అను వర్గీకరణముండుట విశేషము. పెక్కు పదములు వేణుగోపాలాంకితములు. ౪. ఉత్తరగోపురవచనము :— ఇది కవి, కాలము తెలియని వచనకావ్యము. ఇందలి వచనము విలక్షణమైనది (భావ వచనము వంటిది). రాముని బలములను సేనాధిపతులను రామలక్ష్మణులను చూడగోరి రావణుడు గోపురమెక్కి శుక్రాచార్యుల నడిగి ఎదిరి బలమును ఎరిగి సాగించిన ఆలోచన ఇందలి వస్తువు. మరొకవచనకావ్యము మధుర మంగాపుంశ్చలీవిలాసము. ఇందు అశ్లీలములు అసభ్య విషయములు అత్యధికము. ఈ వచనకావ్యములో నడుమ ఒక పెద్ద రగడయుండుట విశేషము. మధురరాణి మంగమ, ఆనెగొంది చినవెంగరాయలు మొదలగువారితో నడిపిన

రహస్య వర్తనము ఇందలివస్తువు. తంజావూరు విజయరాఘవ నాయకుఁడు మధురచొక్కనాథనాయకుడు ఇందు ప్రసక్తులు. ఇది వ్యావహారిక వచనము. ౫. రేవణూరి అనంతయ్య :– ఇతని కాలము పదునేడవ శతాబ్ది. గాధేయోపాఖ్యాన మితని గ్రంథము. అచ్చుపడిన భాగము అసమగ్రము. అది పంచమాశ్వాసమనియే ప్రకాశకులమాట. ఇందలి "అవధరింపు" వచనమే, ఇది రామాయణమునందలి విశ్వామిత్ర చరిత్రమనుటకు సూచన. వాల్మీకిరామాయణమున బాల కాండమున 51 సర్గ మొదలు 65 సర్గ వరకు విశ్వామిత్ర చరిత్ర. గాధేయోపాఖ్యానమునందలి పంచమాశ్వాసము 61 సర్గ మొదలు. వాల్మీకిరామాయణమునందలి రచనావైభవము, రసప్రాభవము, అనువాదములకు అందనిఫలములు. అనంతయ్య రచనయు అందుకు లక్ష్యమేకాని దక్షిణాంధ్రయుగ లక్షణములు లేకపోవుట విశేషము. విశ్వామిత్రుని చిత్తజవేదన కొంత ముదిరినను మొత్తముమీద నిది లక్ష్యశుద్ధిగల గ్రంథము. ఇందు "యోగభోగానుకూల వచోగరిమ" కల మేనక వరూధినికంటె వగలాడి.

"ప్రకృతి నీలోనడంచు నభ్యాసి వెకద నీకవుంగట నన్నెడలేక తనువు
లేకముగఁజేర్చి యద్వైత పాకలక్ష్మి మెండుగ నఖండ సుఖలబ్ధి
నుండవయ్య"

అన్నది మేనక ఆ విశ్వామిత్రుని. అంతేకాదు, మంచిగడసరి.

"ననుఁగలసి మలసి విలసిలు మనయము నేనతి పవిత్రనయ్యెద, నీచే
నినుము పరుసంపు సోకున గనకంబగు విధము మాటిగాధితమారా"

ఇట మేనక వివేకము, అనంతయ్య యుక్తినైపుణి ప్రశంసా

పాత్రములు. అతిసూక్ష్మములైన అంశములందు సైతము అనంతయ్య రచన మూలమునకు విధేయము. "ఉదర వటపత్రము" వంటి రూపకము, "కన్నుల కరవెల్లదీరగ కనుంగొనె" వంటి జాతీయము, "మృణాల సూత్రాంతర మప్యలభ్యం" అను కాళిదాసు భావమునకు "పద్మనాళ తంతువున కంతరంబీయక" అనెడు అనువాదము అనంతయ్య రచనలోని మచ్చుతునకలు. మోతాదు మించినది "చేమకూర యమకము". మొత్తముమీద వాల్మీకి కాళిదాసుల కవితా వైభవమును కనులారచూచి, చేమకూర వేంకటకవి చేరువకువచ్చు కవి అనంతయ్య. ఇతని గ్రంథము సరసప్రబంధము.

## ఉపసంహారము

ఆంధ్రసాహిత్య చరిత్రలో నిర్దిష్టమైన, నిర్దుష్టమైన యుగ విభజనము కవి పరము. ఇది స్థలపరము. స్థలవిశేషముతోపాటు సాహిత్య వైలక్షణ్యమును స్పష్టము. అది కర్తృ భాషా వస్తుప్రక్రియా తత్త్వాదికముగ బహుముఖము. కవయిత్రులు కర్తృవిశేషము. వ్యాకరణస్ఖాలిత్యములు, వ్యావహారికచ్ఛాయలు, ప్రధానముగ పాత్రోచితభాషా ప్రాచుర్యము భాషాపరమైన వైలక్షణ్యము. పదకవిత్వము, కేవలవచనము, యక్షగానము మొదలైనవి ప్రక్రియావైవిధ్యము. అభ్యధికమైనది అసభ్యశృంగారము. అది యుగ ధర్మమనుట పరిపాటి. అలనాటి గాథాసప్తశతి అటుంచి పదునొకండవ శతాబ్ది నన్నెచోడుని కుమార సంభవము, పదునైదవ శతాబ్ది వల్లభామాత్యుని క్రీడాభిరామము, దక్షిణాంధ్ర

యుగము నందలి శృంగారమునకు దాయాదములే. అంతే కాదు. సరిగా ఈ యుగమునకు సమకాలమున కూచిమంచి తిమ్మకవి రసికజన మనోరంజనము, జగ్గకవి చంద్రరేఖా విలాపము, అజ్జరపు పేరయ్య లింగము ఒడయనంబి విలాసము మొదలైనవి ఇందుకు మోస్తరులే. స్వేచ్ఛా శృంగారము సంఘటీపనమున ఏనాఁడును కొందరికి నిరాఘాటము. సాహిత్య మునకు మాత్రము ఔచిత్యము జీవగఱ్ఱ. "ఔచిత్యం రస సిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం"— అట్టి ఔచిత్యము దక్షి ణాంధ్ర యుగమున మిక్కిలి అరుదు. సమకాలిక సమాచార మును ఇట్టిదే కాని చారిత్రకముగా మాత్రము మిక్కిలి ఉప యోగకరము. ప్రధానముగ ప్రక్రియా వైవిధ్యము, పదకవితా ప్రాధాన్యము, పాత్రోచిత భాషా ప్రాచుర్యము, వచన రచనా వైశారద్యము, ప్రశంసాపాత్రములు. సరస గ్రంథ ములు సక్కృత్తైనను గ్రంథ వైవిధ్యము సమధికమైన దక్షి ణాంధ్రయుగ వాఙ్మయమున కిది దిగ్దర్శనము.

## Bibliography


౧. దక్షిణాంధ్రయుగవాఙ్మయ చరిత్ర—డాక్టర్ కె. వి. ఆర్. నరసింహం (ముద్రితాముద్రితములు)

౨. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము—శ్రీ నిడదవోలు వెంకటరావు

౩. విజయరాఘవునిమీఁది పదములు, మరొక పదకవి-వంగల సీనయ్య — శ్రీ తిమ్మావఝ్ఝల కోదండ రామయ్య

౪. ఇందిరామందిర సందర్శనము — శ్రీ కొమ్మనమంచి జోగయ్యశర్మ

౫. యక్షగానములు— డాక్టర్ యస్. వి. జోగారావు

౬. తెనుఁగు వచనము— శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి

౭. Maratha rule in Carnatic — Sri C. K. Srinivasan.

# చారిత్రక నైపథ్యము

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 1857 సంవత్సరంలో జరిగింది. ఫలితంగా భారతీయుల సమరసన్నాహశక్తి సన్నగిల్లింది, బ్రిటిష్ ప్రభుత్వం స్థిరపడింది. స్వాతంత్ర్యాభిలాషులు పరప్రభుత్వాన్ని ప్రతిఘటించడానికి సాధనాంతరాలు అన్వేషించసాగేరు. క్రమంగా స్వాతంత్ర్యోద్యమ వికాసం కొనసాగింది.

ఏమైనా, భారతదేశంలో నూతన సంస్కృతికి పునాదులు వేసినవారు బ్రిటిష్‌వారే. 1857 లోనే కలకత్తా, బొంబాయి, మద్రాసు నగరాలలో మూడు విశ్వవిద్యాలయాలు నెలకొల్పారు. ఆ విశ్వవిద్యాలయాలలో చేరిన ఆనాటి యువకులు స్థిరపడిన బ్రిటిష్ పాలనలో ఆంగ్లసాహిత్య పఠనం వల్ల స్వీయసాహిత్యవ్యాసంగానికి ఉద్దీపితులయ్యారు. ఆ దేసమయంలో సర్. విలియమ్ జోన్స్ సంస్కృతగ్రంథ సంశోధనం చేయడం జరిగింది. అందువల్ల విశ్వవిద్యాలయాలలో సంస్కృతం పఠనపాఠనవ్యవహారమయింది. నాటి విద్యార్థులు సంస్కృతాధ్యయనంవల్ల కూడా సముత్తేజమందేరు.

ఆంగ్ల నవలాకారులయిన స్కాట్, లిటెన్, జేన్ ఆస్టిన్, డికెన్స్, థేకరీ మొదలైనవారి నవలలు చదవడం వల్ల నవచైతన్యం కలిగింది. క్రమంగా కీట్సు, షెల్లీ, బైరన్ మొదలైన ఆంగ్లకవుల భావకవిత్వం కూడా ప్రాబల్యానికి రాసాగింది.

అటు ఆంగ్లసాహిత్యం, ఇటు సంస్కృత సాహిత్యం — ఈ రెండిటి అధ్యయనంవల్ల భారతీయుల ఆధునిక వాఙ్మయానికి అంకురార్పణ జరిగింది. ఆధునిక వాఙ్మయం వలని ప్రప్రథమ ఫలం గద్యరచన. అంతకు ముందు భారతీయుల సాహిత్యరంగంలో పద్యరచనదే పైచేయి. గద్యరచనసకృత్తే. ఆధునికవాఙ్మయం ఆరంభంతో గద్యరచనకి ప్రాముఖ్యం వచ్చింది. అసలీ యుగాన్నే గద్యయుగం అనవచ్చు. షేక్స్పియర్, గోల్డ్‌స్మిత్, షెరిడాన్, మోలియర్ మొదలైన వారి ఆంగ్లనాటకాలతో పాటు, కాళిదాసు, శూద్రకుడు, భవభూతి మొదలైన వారి సంస్కృత నాటకాలవల్ల — సుమారు ఎనిమిదిశతాబ్దులు సుప్తప్రాయమైన నాటక ప్రక్రియకి నాందీవాచనం జరిగింది. ఆ యీ చైతన్యంవల్ల ఆధునిక వాఙ్మయస్రష్ట బంకించంద్ర ఛటర్జీ. ఆయన ప్రభావమే అన్ని ప్రాంతీయ భాషల ఆధునిక వాఙ్మయారంభానికీ ఆస్కారం.

## సంఘ సంస్కారోద్యమం

భారతదేశం మొత్తంమీద సాంస్కృతిక పరిణామం తెచ్చినది సంఘ సంస్కారోద్యమం. పందొమ్మిదవ శతాబ్ది లోని ప్రథమభాగంలోనే హిందూసమాజంలోని దురాచారాల నిర్మూలనకి సంఘసంస్కరణం ప్రారంభమయింది. 1830 ప్రాంతంలో రాజా రామమోహనరాయలు ఇంగ్లండు వెళ్ళి 'సహగమన' దురాచారనిర్మూలనకి వాదించడం జరిగింది. ఫలితంగా తరువాత బ్రిటిష్ ప్రభుత్వం సహగమన దురాచారం తొలగించింది. తదుపరి 1865 నుండి

బెంగాల్‌లో బ్రహ్మసమాజం శ్రీ కేశవచంద్రసేన్ ఆధ్వర్యం లోను, గుజరాత్‌లో ఆర్యసమాజం దయానంద సరస్వతి, మహారాష్ట్రదేశంలో మహాదేవ గోవింద రెనడేల ఆధ్వర్యం లోనూ అభివృద్ధికి రానాగాయి.

ఆసంఘ సంస్కరణోద్యమాల ప్రభావం ఆంధ్రదేశం లోనూ ఆరంభమైంది. బ్రహ్మర్షి సర్ రఘుపతి వెంకట రత్నంనాయుడుగారి నాయకత్వాన బ్రహ్మసమాజం స్థాపించ బడింది. సంఘదురాచార నిర్మూలన కార్యక్రమం కొన సాగింది. బాల్యవివాహ నిరసన, వితంతు పునర్వివాహ ప్రోత్సాహం, అస్పృశ్యతానివారణ, అనాధ శిశు సంరక్షణ, దేవదాసీ విమోచన, వ్యభిచారఖండన మొదలైనవి ఆనాటి సంఘసంస్కర్తల ఉన్నతాశయాలు. సర్ రఘుపతి వెంకట రత్నం నాయుడు ఉపన్యసించడం, వ్రాయడం ఇంగ్లీషులో జరిగింది. ఆయన అరబీ పర్షియా భాషల్లో సైతం నిష్ణాత. సర్ రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి ప్రభావంలో రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులు తెలుగు వాఙ్మయంలో చైతన్యకారకుడు. నాయుడుగారు నాటిన సంస్కార భావాలకు పంతులుగారు సమర్థులైన ప్రచారకులు. ఆభావాలు ఆంధ్ర పండితులైన పంతులుగారు వచనమూ, ప్రహసనము అనే ప్రక్రియలద్వారా సాహిత్యంలో సమర్థంగా ప్రవేశపెట్టి నవ్యసాహిత్యానికి నాంది పలికారు.

## మతోద్యమం

సంఘ సంస్కారోద్యమంతో పాటు మతోద్యమం కూడా సాగింది. పందొమ్మిదవ శతాబ్దిలోని మతోద్యమం

ప్రధానంగా శ్రీరామకృష్ణ పరమహంస ప్రబోధాలే. ఆ మతోద్యమాన్ని తరువాత మరింత ప్రాముఖ్యానికి తెచ్చింది స్వామి వివేకానంద.

## రాజకీయోద్యమం

ఇలావుండగా 1885 సంవత్సరంలో కాంగ్రెస్ పుట్టింది. కాంగ్రెస్ చరిత్రలో ప్రధానమైనవి నాలుగైదంతరాలు. 1. 1885–1905. నిర్మాణదశ, సంస్కరణకృషి. 2. 1906–16 స్వయంప్రభుత్వస్థాపన కృషి. 3. 1917 – 20. బాధ్యతాయుత పాలనలో భాగస్వామ్యం. 4. 1921 – 29 జాతీయోద్యమం – సహాయనిరాకరణోద్యమం. 5. 1929 – 35 సంపూర్ణ స్వాతంత్ర్య సముపార్జనోద్యమం. 1947 సంవత్సరంలో స్వాతంత్ర్య సిద్ధి.

పందొమ్మిదవ శతాబ్దిలోని కాంగ్రెసు లక్ష్యం మంచి ప్రభుత్వం మాత్రమే. బ్రిటిష్‌వారికి సహకరించడం కూడా కాంగ్రెస్ ఆశయం. 1905 లో మాత్రం పరిణామం కలిగింది. ఆ సంవత్సరం అంతగా లెక్కకురాని అతిస్వల్ప భూభాగమైన జపాన్ ద్వీపప్రజలు, మహా విశాలమైన రష్యా సామ్రాజ్యంమీద విజయభేరీ మోగించడంతో భారతీయులికి పరప్రభుత్వాన్ని ఎదుర్కోగలమన్న ధైర్యం కలిగింది. మొదటిప్రపంచ సంగ్రామంతో స్వయంప్రభుత్వ స్థాపనమే సాధ్యంకాగలదన్న కనువిప్పు కలిగింది. ఇదే సమయంలో బెంగాల్ విభజన జరిగింది. ఫలితంగా భాషారాష్ట్ర తత్త్వం ఏర్పడి ఆంధ్రరాష్ట్రోద్యమం ఆరంభమయింది 1913–14.

ఆచార్య అరవింద ఆధిపత్యాన జాతీయోద్యమం ఆరంభమయింది. బరోడా నుంచి పుదుచ్చేరి వచ్చిన అరవింద ఘోష్ ప్రభావం రాజకీయ రంగంలోనేగాక సాంస్కృతిక సాహిత్యరంగాలలో సైతం పర్యాప్తమయింది. 1919 సంవత్సరంలో మహాత్మాగాంధీ నాయకత్వాన జాతీయోద్యమం ఒక సుస్పష్టస్వరూపంతో ఫలోన్ముఖానికి వచ్చింది. క్రమంగా సహాయనిరాకరణ విప్లవంసాగింది. భారత దేశంలోని బహువిధ జాతీయ విప్లవతత్త్వాలకు ఒక మహా సమన్వయం మహాత్మాగాంధీ. మహాత్ముని సత్యము—శాంతి—అహింస మహత్తర శక్తులుగా సత్యాగ్రహోద్యమంకూడా సాగింది.

రెండవ ప్రపంచ సంగ్రామం తూర్పు ఆసియా దేశాల ప్రజలకు రాజకీయ స్వాతంత్ర్య కారణమయింది. 1947 లో భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఆ యీ రాజకీయ పరిణామంతోపాటు ఇంకా ఐక్యరాజ్యసమితి కార్యక్రమాలు, యుద్ధవైముఖ్యం, అణుశక్తి ప్రాభవం మొదలైనవి ఆధునిక వాఙ్మయ వికాసానికి అంతర వేదిక లే. వంగ దేశంలోని బ్రహ్మ సమాజంతోపాటు అభినవ వంగ వాఙ్మయంకూడ ఆంధ్ర దేశంలోని ఆధునిక రచయితలకు ఆదర్శాల్ని అందిచ్చింది. రాజకీయంగా బయలుదేరిన స్వాతంత్ర్యేచ్ఛ, దేశభక్తి ప్రతిపాదకమైన గద్య పద్య గేయ వాఙ్మయానికి మూలమయింది. సంఘసంస్కారోద్యమంతోపాటు వాఙ్మయసంస్కారోద్యమం కూడా బయలుదేరి, క్రొత్తదనానికి, స్వాతంత్ర్యానికీ అవకాశం కలిగింది. అంతేకాదు. తన పరిసరంలోనే ప్రసరించే రచయితలదృష్టి దిగంతాలను వ్యాపించి క్రొత్త క్రొత్త

ప్రయత్నాలకు పురికొల్పింది. తత్ఫలితంగానే ఆధునిక వాఙ్మయంలో నవ్యసృష్టి, దేశభక్తి, స్వాతంత్ర్యేచ్ఛ, కల్పనా వైవిధ్యము, ప్రక్రియా వైవిధ్యము, అన్యవాఙ్మయానుకరణ, నియమశృంఖలావిమోచనం మొదలైన అనేక విశేషాలు వెలసి ప్రత్యేకతాముద్ర ప్రస్ఫుటంగా కనబడుతోంది. ఆయీవిధమైన ఆధునికాభ్యుదయ వాఙ్మయంలో గద్య, కవితా, నాటకశాఖ వర్గీకరణం ప్రాధాన్య వివక్ష మాత్రమే.

— కూర్మా వేణుగోపాలస్వామి

# ఆధునిక గద్యవాఙ్మయము

జీరెడ్డి చెన్నారెడ్డి

ఆధునికగద్యవాఙ్మయ మన్నంతనే ప్రాచీనగద్య వాఙ్మయ మొకటి యున్నదని తెలియుచున్నది. ఆ రెండింటిని గుఱించి వ్రాసినచే గద్యవాఙ్మయచరిత్ర మగును. కాని ప్రాచీనవచనవాఙ్మయమునుగూర్చి పెక్కురు వ్రాసి యుండుటవలన నేనినాటి వచనమును గూర్చియే వ్రాసెదను. ఐనను ప్రాచీనులకు గద్యరచనమునం దాధునికులకున్నంత ప్రీతి యున్నట్లు కన్పట్టదు. వారు చేసిన వచనరచన మంతయు నేటి వచనరచనతో పోల్చినప్పుడు చాలతక్కువ. దానినిగురించి యొక గ్రంథము వ్రాయుటకు దగినంత విషయము లభింపదు. శ్రీ వీరేశలింగం పంతులు ఆ లభించిన కొలదిమంది గద్యరచయితలను చేర్చి కవులపట్టికలోనే ఉదాహరించిరి. అట్లే మరికొందరుకూడ చేసియున్నారు. శ్రీ నిడుదవోలు వేంకటరావు ప్రత్యేకముగా ఇరువదవ శతాబ్దప్రారంభము వఱకుగల గద్యకవులను గురించి విపులముగా వివరించియున్నారు. ఇక గద్యములో విస్తారమైన వాఙ్మయసృష్టి గడచిన యేబదియేండ్ల లోపలనే జరిగినది. దానినిగూర్చి వ్రాయుటయే నా యిప్పటి ప్రయత్నము.

మానవుడు మాటల మూలమున తన భావము తెలుపగలిగిన నాటినుండి వ్యవహారమునకు గద్యమే యాధారము. కాని కేవలము భావప్రకటనమునకై వాడుకచేసిన భావ

సాహిత్యా మనిపించుకొనదు. కావుననే సాహిత్యము కా యాయుర్వేదన్యాయమీమాంసా సంబంధములైన శాస్త్ర వాఙ్మయగ్రంథములు లెక్కయేని నేటికిని నిలిచియున్నవి. కాబట్టి తదితరమైన వాఙ్మయమున సాహిత్యము కానిది సాధారణముగ చిరకాలము నిలువలేదు. కాబట్టియే సాహిత్యస్థాయి నందికొన్నరచన ప్రపంచమునం దేమూల జరిగినను అది మొదట పద్యమునందో పదమునందో వెలువడినదని చెప్పవచ్చును. గ్రీకు, లాటిను, సంస్కృతమువంటి ప్రాచీనభాషలలో ఈ సత్యమును మనము గుర్తింపగలము. ఆ వెనుక కొన్నివందల సంవత్సరములకుగాని గద్యరచన లెక్కింపదగిన స్థానము సంపాదింపలేదు. మొదట మొదట 'సంజయ ఉవాచ' వంటి చిన్నచిన్న ముక్కలుఁగనే మహాభారతాది గ్రంథములలో కానవచ్చుచున్నది. కేవల గద్యగ్రంథములు ప్రపంచసాహిత్యము లోపలనే చాల తక్కువ, అట్లే మన దేశీయభాషలందును, ముఖ్యముగా తెలుఁగునందు వ్రేళ్ళపై లెక్కింపదగినన్ని వచన గ్రంథములే కానవచ్చుచున్నవి. అవియైనను పద్యము ననుకరించు కృతకగద్యముననేకాని వ్యవహారయోగ్యమైన సహజగద్యమునగాదు. కాబట్టియే ప్రాచీన వచనవాఙ్మయము పండితులకు తప్ప సామాన్యప్రజల కుపయోగపడలేదు. నేటి గద్యసాహిత్య మట్లుకాదు. దీనిని ప్రారంభించిన సహృదయులు సామాన్యప్రజలలో విజ్ఞానము వ్యాపింపజేయవలయునను ప్రతిన, పట్టుదల కలవారై అందులకు పూనుకొని ప్రయత్నించిరి. వారి కోరిక నెరవేరినది. పండిత పామరు

లందరు గద్యరచనమును ప్రోత్సహించిరి, గౌరవించిరి. తామరతంపరగ మూడు పూవులు ఆరు కాయలుగ ఆ వాఙ్మయము పెరిగిపోయినది.

కృత్రిమములైన శబ్దార్థాలంకారములు, చిక్కు పెనగల పోలిన కఠినశబ్దములు, గ్రుక్క త్రిప్పుకొనుటకు వీలుగాక, అన్వయకాఠిన్యమునకు గురియైన దీర్ఘసమాసములు లేక, నేటి గద్యరచన శాఖోపశాఖలుగా విజృంభించినది. ఎవరి హృదయమునందు సూటిగా హత్తుకొనున ట్లొకభావము నందించునది నోట వెలువడినంతనే యర్థమగు సహజ గద్యమే కాని పద్యము కాదు. కావుననే వ్యావహారికము నకు దగ్గరైన వచనరచన నేడన్ని సాహిత్యశాఖలలో గౌరవ స్థానము నందికొన్నది.

ఇట్టి గద్యవాఙ్మయమునుగూర్చి వ్రాయుటయే నా యిప్పటి ప్రయత్నము. ఈ నా రచనలో విషయము ప్రధానమే కాని వ్యక్తి ప్రధానము కాకూడదని నా తలపు. మన దురదృష్టవశమున సమకాలములో జీవించిన రచయిత లే నాడును పరస్పరము తమలోని యోగ్యతాయోగ్యతలను అంతస్సాక్షి కనుగుణమైన నిష్పక్షపాత పద్ధతిలో నిర్ణయించు కొనుట జరుగలేదు. ఈనాడును మన మా గుణమును వదలుకొనలేకున్నాము. ఒకరు వ్రాసిన గ్రంథమును అతని శిష్యులో, అనుయాయులో చదివి యందలి గుణదోషము లను పరీక్షించి నిర్ణయించుటమాని గ్రుడ్డిగా పుస్తకమును చూడకపూర్వమే భూషించుటో, అట్లే అతనియం దేకారణముననో అనాదరభావము కలవారు దానిని దూషించుటో

జరుగుచున్నది. ఈ విషయములో పెద్దలు, విజ్ఞానవంతులు అయినవారుకూడ తలలు బ్రద్దలుకొట్టుకొనుటకైన సంసిద్ధులగు చున్నారు. ఇక సామాన్యులు రచయితయందలి యోగ్యత నెట్లు నిర్ణయింపగలరు ? కావుననే ఒక సాహిత్యఖండము యొక్క నిజస్వరూపము లోకమునకు దెలుపు ప్రయత్నమున కాధారము ఆ సాహిత్యఖండముకాక తద్రచయితయందు విమర్శకులకున్న భావమే ప్రధానమగుచున్నది. సద్విమర్శ కులు రచయితను స్మృతిపథములోనికి రానీయక అతని రచనమును మాత్రమే దృష్టియందుంచుకొన్నగాని ఉభయుల నిజస్వరూపము లోకమునకు దెలియదు. చూచువారి హృదయములను ఉవ్వెత్తుగా హరించి శరీరమును పులకరింప జేయు శిల్పవిశేషమును గాంచి దానిని నిర్మించినవాడు శైవుడా, వైష్ణవుడా యని తెలిసికొన్న పిదపగాని అందలి కళను గుర్తింపనొల్లని దౌర్భాగ్యస్థితికి నేడు మనము దిగజారి పోవుచున్నాము. కాబట్టియే ఈ రచనయందు నేను చేయునది విషయపరిచయమే కాని వ్యక్తి విమర్శముకాదని విజ్ఞులకు తెలుపుకొనుచున్నాను. ఇది వచన వాఙ్మయ చరిత్రమేకాని, వచన రచయితల చరిత్రకాదు. సాహిత్య సమీక్షకు అంతకుగాదు. అవసరమునుబట్టి కొందరపేర్లు మాత్రము వాడుకొనక తప్పదు.

ఒకవేళ నేటి గద్యవాఙ్మయమునుగూర్చి సర్వాం కషమైన చర్చ చేయదలచినను ఈ చిన్న వ్యాసములో అది పొంసుపడదు. దాని కొక ప్రత్యేక ప్రయత్నము, తగినంత వ్యవధి కావలయును. ఆ ప్రయత్నము శ్రీ కొర్లపాటి

శ్రీరామమూర్తి చేసినట్లు విన్నాను. వారందులో నవ్య గద్య వాఙ్మయమునుగూర్చి నాకంటె విపులముగనే చర్చించి యుందురని విశ్వసింతును.

ఆధునికగద్య మన గడచిన యేబదియేండ్ల నాటినుండి అని యున్నేనుడివియున్నాను. కాని అదియొక మీరరాని హద్దుకాదు. ప్రాచీన పద్ధతులనుండి వేరై యేనాటినుండి గద్యము క్రొత్తదారులంబడి నడచినదో ఆనాటినుండియే నేటి వచనరచన జరిగినదనవచ్చును. ఆంగ్లభాషా సంపర్కముచే దేశీయుల వేషభాషలేకాక అనాదిగా వచ్చుచున్న సాంఘికాచారములు, మతవిషయికములైన నిత్యకర్మానుష్ఠానములు పట్టువీడి సడలిపోవుట కారంభించినవి. రజస్వలానంతర వివాహములు, వితంతూద్వాహములు, స్త్రీ విద్య, సమస్త వర్ణములవారి నడుమ సమానప్రతిపత్తి ప్రోత్సహింపబడినవి. సంఘబలమును క్షీణింపజేయు గ్రుడ్డినమ్మకములు, మతము పేర వ్యాపించి అర్థరహితముగా ననుసరింపబడు సనాతనాచారములు నిర్దాక్షిణ్యముగ ఖండింపబడినవి. పై వానిని మొదటినుండి ప్రోత్సహించుచు వచ్చిన, ప్రోత్సహించు నవసరముగల బ్రాహ్మణులే దేశాభివృద్ధిని, సంఘశ్రేయస్సును మదినుంచుకొని వానిని నిరసింపజొచ్చిరి. అట్టి సంస్కారయుతములైన భావములను శీఘ్రముగ వ్యాపింపజేయుటకు పద్యముకన్న గద్యము మిక్కిలి సహాయకారి. కావుననే ఆధునిక యుగపురుషులైన శ్రీ వీరేశలింగం పంతులు, శ్రీ గురుజాడ అప్పారావు నవలలు, ఉపన్యాసములు, ప్రహసనములు, నాటకములు, వ్యాసములు మొదలగునవి సృష్టించి

ప్రజలలో నొక బ్రహ్మాండమైన సంచలనము పుట్టించిరి. వానిలో పంతులుగారి 'రాజశేఖర చరిత్రము', అప్పారావుగారి 'కన్యాశుల్కము' సాటిలేనివి. ఇంకను పంతులుగారి ప్రహసనములు పై రెంటివలెనే సంఘములో వ్యాపించిన దురాచారములను, మూఢవిశ్వాసములను తూర్పారబట్టి వదలినవి. బాలవితంతువులయు, రజస్వలలైన కన్యకలయు వివాహములు ప్రజాసమ్మత కార్యములు చేయుటకు, స్త్రీ విద్యా వ్యాప్తికి వారి ఉపన్యాసములు మిక్కిలిగ తోడ్పడినవి. పంతులుగారికి, వారి ననుసరించినవారికి పై భావములు కల్గుటకు కారణము వా రాంగ్ల భాషయందలి గ్రంథములు చదివి, పాశ్చాత్యుల సాంఘికాచారములు వారి దేశాభివృద్ధికి, సమైక్యమునకు తోడ్పడిన విధము తెలిసికొనుటయే. ఖండాంతరములలో సామ్రాజ్యము లు స్థాపింపజాలిన ప్రతిభ, జాత్యభిమానము, దూరదృష్టి, ప్రాభవము వారికి గలుగుటకు కారణము మన సంఘములో గల కొన్ని మూఢభావములు వారికి లేకుండుటయే.

ఆంగ్లభాషయం దిట్టి ప్రబోధసాహిత్య మంతయు వచనమునసే జరిగినది. ఉద్రేకము కలిగించు "బర్కు" మొదలగు ప్రసిద్ధ వక్తల యుపన్యాసములు, సంఘసంస్కారప్రియులైన 'అడిసను, స్టీలు' మున్నగు వారి వ్యాసములు, రాజకీయములందు సాహిత్యమునందు సమానప్రతిభగల 'లార్డు మెకాలే' వంటి ప్రభువుల రచనలు, సమకాలికుల తర్జనభర్జనలకు లోంగక సంఘములోని లోపములను బహిరంగముగ నల్లరి పెట్టుటకు వెనుదీయని 'జోనాథన్ స్విఫ్టు' వంటి సంస్క

ర్తల వ్రాతలు గద్యములోనే సాగి ప్రజలలో క్రొత్త వెలుగును తెచ్చిపెట్టినవి. ఇవన్నియు వేరువేరు కాలములలో వ్రాయబడిన వైనను వానిని జదివిన శ్రీ పంతులవంటి నిస్స్వార్థజీవులగు దేశాభిమానులకు, ఇల్లు కాలుచున్నను నిద్రించు సోమరులను అజ్ఞానులను బోలిన ఆంధ్రులను మేల్కొలుపవలెనను బుద్ధిపుట్టుట వింతకాదు. వారి రచనములలో చాల భాగము పందొమ్మిదివందలకు పెక్కేండ్లు పూర్వమే జరిగినను ఆతరువాతగూడ వారదే పనియందు నిమగ్నులై యుండుటచే, పూర్వ మెన్నడు నెఱుగని భిన్నమార్గములలో, భిన్నశాఖలలో గద్యసాహిత్య సృష్టిచేయుటకు ప్రారంభకులు, ప్రవర్తకులు పంతులుగారే యనిన అతిశయోక్తిలేదు. అందువలననే నేటి గద్యవాఙ్మయరచన పంతులుగారితో ప్రారంభించిన దని నా తలపు.

## వ్యావహారికభాషావాదము

సంఘసంస్కరణప్రయత్నములో సరిగా శ్రీ పంతుల భావములనే కలిగి వానికే యోగ్యమైన ప్రచారము కల్పించుచు శ్రీ గురుజాడ అప్పారావు శ్రీ గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారికంటె మరొక్కడుగు ముందుకు వేయుటకు జంకలేదు. అదియే వారిరచనలు పాత్రోచిత భాషలో, వ్యావహారికభాషలో వెలువరించుట. పంతులుగారి గద్యము పూర్వుల గద్యమువలె కృత్రిమమైనది కాకపోయినను, వ్యాకరణనియమములను మాత్రము దాటిపోలేదు. కాని సామాన్యులకు గూడ సులభముగా నర్థమగు సరళశైలిలో రచింపబడినది. ఆంధ్రదేశమునందలి నలుమూలల నున్నవారికి

తెలియునట్లు మిక్కిలి తేలికపదములు కలిగి, శబ్దమునకు వాక్యమునకు ఒక నిశ్చితమైన రూపము, సమత వారి రచనలలో కనబట్టును. కేవలము ప్రజల నిత్యవ్యవహారములో నున్న శబ్దములనే వారు వాడిరి. కాని వాని రూపములు శబ్దకోశములలో నీయబడినవానితో సమానములే కాని ప్రజల నోళ్ళలో భిన్నభిన్న ప్రాంత్యములలో భిన్నములయిన పలుకుబళ్ళతో నున్నట్లుకాదు. శ్రీ గిడుగువారి, శ్రీ గురజాడ వారి విధము పై వానిలో రెండవపద్ధతి వంటిది. మన యెదుటి వ్యక్తులు సహజముగా మనతో మాటాడునప్పుడు వాడు భాషయే, రచనలలో ఉండదగునని వారిరువురు తమ గ్రంథములలో దానినే ప్రయోగించిరి. గట్టుపై నిలుచున్నవానికి ఎదుటనున్న నది మారిపోవుచున్నట్లు కన్పింపకున్నను, క్షణము ముందు తానుచూచిన నీరుగాని, కట్టెముక్కలు, తెప్పలు మొదలైనవికాని యచ్చట నుండవు. అవియన్నియు ముందుకు సాగిపోయి ఆ స్థానముననే అట్టివే క్రొత్తనీరు, క్రొత్తకట్టెలు వచ్చిచేరుచున్నవి. నదిలో మార్పు పైకి కన్పింపకున్నను తప్పనిసరిగా అందు మార్పు లేకపోలేదు. ఉండుట సహజమే కాని, అసంగతముకాదు. అట్లే భాషకూడనని వారివాదము. నిత్యవ్యవహారములోనుండి నిత్యచలనముతో ముందుకుపోవు జీవద్భాషయగు నట్టిది మారకెట్లుండును? ఏనాడో, కొన్ని వందలయేండ్లనాడు కొందరు ప్రత్యేకవ్యక్తు లేర్పరచిన కృతకములైన వ్యాకరణముపేరి కట్టుబాట్లకులోంగి చరించుట నేటి జీవద్భాషలకు చెల్లదు. ఏనాడు, ఏ ప్రాంతమున, ఏ తెగ మనుష్యులు, ఎట్టిభాష మాటాడిన, ఆ నాటి

కా ప్రాంతమున, ఆ తెగవారిభాష అవి యని నిర్ణయింప వచ్చును. వారికి తెలియునట్లు చెప్పవలయునన్నను, వ్రాయవలయు నన్నను దానిని పోలినభాష కావలెనేకాని కట్టుబాట్లతో ముకుద్రాళ్ళు బిగించిన యాబోతువలె నెటుపోవుటకు స్వేచ్ఛలేని పరిస్థితులలో దాని నిరికింప రాదు. ఇది పైయిరువుర వాదమునందలి సారాంశము. ప్రస్తుతమైనను, అప్రస్తుతమైనను, గద్యవాఙ్మయ చరిత్ర వ్రాయునప్పుడును, ఒకవిధమైన సాహితీ విప్లవమును తెచ్చి పెట్టిన 'కన్యాశుల్కము'ను గూర్చి ప్రసంగింపవలసి వచ్చి నప్పుడును తప్పనిసరిగా ఈ వ్యావహారిక భాషావాదమును పురస్కరించుకొని కొంతవ్రాయక తప్పదు.

మన దేశమున ప్రజలలో చదువుకొన్నవారి సంఖ్య చాల తక్కువ. పండితులువ్రాయు గద్యము విద్యావంతుల లోనే అందరకు అర్థముకాదు. ఇక నిరక్షరాస్యుల విష యము వేరే చెప్పనక్కర లేదు. మరియు పండితులలో కొందరకు కేవల గ్రాంథికభాషయందే మాటాడు టొక యలవాటు. వేదిక నెక్కి ఉపన్యసించునప్పుడు కూడ కఠిన పదములు దీర్ఘసమాసములు గల కృతకభాష వాడిననే కాని విద్వాంసుడు కాడని కొందరతలంపు. వారిభాష వారిని పోలిన పండితులకే కాని యితరులకర్థము కాదు. మన తెలుఁగు భాషయందున్న విచిత్రమేమన వ్రాయుభాషకు, నిత్యము వ్యవహారములోనున్న భాషకు ఒక ప్రాంతమువారిది మరొక ప్రాంతమువారికి గుర్తింపరానంత భేదము కన్పట్టును. కొన్ని పదముల యర్థము లొకప్పుడు వాడుకలో నొక విధముగను

శబ్దకోశములలో వేఱువిధముగను ఉండును, లేక వేర్వేరు ప్రాంతములలో వేర్వేరు అర్థములు కలవిగనైన నుండును. వీనినే మాండలికములని పిలుచుచున్నాము. ఒక మండలము నందు నివసించువారు మాటాడు భాషకాని, వ్రాయుభాష కాని ఒకప్పుడు వేరొకమండలమున నివసించు విద్యావంతు లకు కూడ పూర్తిగా అర్థముకాకుండును. అంతమాత్రముచే ఒకరు నాగరకులు మరొక రనాగరకులని యర్థముకాదు. అల్పు లలో అట్టిభావములు కల్గుటకు వీలులేకపోలేదు.

ఈ విషయములను పురస్కరించుకొనియే శ్రీ గురుజాడ వారు 'కన్యాశుల్క'మను నాటకమును రచించిరి. అందలి విషయము కనీసము ఆప్రాంతమువారికైనను పూర్తిగా అర్థ మైననేకాని తన సంస్కారభావములకు వ్యాప్తి యెట్లు పొస గును? అందలి భాష వ్యావహారికము. ఆ ప్రాంతవాసులైన ప్రజ లెట్లు మాటాడుదురో అట్లే వారు వ్రాసిరి. పాత్రమును బట్టి భాషయందును సహజమైన మార్పుండును. అగ్నిహో త్రావధానులవంటి ఛాందస బ్రాహ్మణులు, గిరీశంవంటి నవ నాగరక యువకులు, బుచ్చమ్మనుపోలిన యమాయికలైన పెద్దలచాటు ముగ్ధ (బాలవితంతువు) లు, మధురవాణి వంటి గడుసువేశ్యలు, ఇంకను పలుతెగలవారైన విటులు మాటాడు భాష, ఆయా వర్గములవారు సంఘములో తమ నిత్యజీవిత ములో నెట్లు మాటాడుదురో అట్లేయున్నది. శ్రీ బుర్రా శేషగిరిరావు శ్రీ ఆవసరాల సూర్యారావు ప్రకటించిన శ్రీ గురజాడవారి డైరీలోని భాగములన్నియు నట్టివే. అనగా

శ్రీ అప్పారావుగారెట్లు మాటాడుచుండిరో అట్టి భాషలో వ్రాయబడినవే.

ఐన సలక్షణమైన భాషలో సులభముగా నర్థమగునట్లు వ్రాయగలిగినవారుండ, దారి, డొంకలేని యీ వ్యావహారిక భాషయే కావలెనని ప్రాకులాడు టెందులకని యొక ప్రశ్న రాకపోలేదు. విషయము అతి సులభ పద్ధతిలో, అతిశీఘ్రకాలములో ప్రజలకు తెలియజేయవలెనన్న దానిని వ్యావహారిక భాషలో జెప్పుటకంటె దగ్గర దారిలేదని తదనుసారులమతము. పాశ్చాత్యుల నాగరకతకు కారణము వారిలో వ్యాపించిన విజ్ఞానమేయని మనవారు గ్రహించిరి. 'ఆలస్యా దమృతం విష' మ్మన్నట్లు ఆ రహస్యము నెఱిగిన మరునిమిషమునుండి అట్టి విజ్ఞానమును మనప్రజలలో వ్యాపింపజేసిన నిచటకూడ శీఘ్రకాలములో నాగరకత వ్యాపించునని శ్రీ పంతులవంటివారు తలంచి యందులకు ప్రయత్నించిరి. ప్రథమ ప్రయత్నముగా వారు సులభ శైలిలో, వచనములో ప్రబోధసాహిత్య సృష్టికి ప్రారంభించిరి. ప్రజలలో పాతుకొనిపోయిన దురాచారములను, గ్రుడ్డినమ్మకములను ఖండింపవలయును. దేశభక్తి, జాతీయతాభావము, విజ్ఞానవాంఛ రేకెత్తింపవలయును. మనకు కావలసిన విజ్ఞానమేదో మన పూర్వులు రెండువేల యేండ్లకు పూర్వమే మనకిచ్చిరనియు, మనము పరులనుండి గ్రహింపవలసినదికాని, క్రొత్తగా కష్టపడి కనిపెట్టవలసినదికాని యేమి లేదనియు వాదించు ఛాందసుల ప్రచారము నరికట్టవలయును. ప్రజాభ్యుదయవాదులు పరభాషలు చదివి సంపాదించిన విజ్ఞానము ప్రజలకందీయవలెను. దీనికంతటికి సాధనము

గద్యరచనమే. పద్యములో నీ భావములకు వ్యాప్తి తొందరలో రాదు. అదియు నెంత సులభముగా అందరకు అర్థమగు నట్లున్న అంతమేలు. కావుననే తొలిమెట్టుగా సలక్షణమైన సరళభాషలో శ్రీ పంతులు. రాజశేఖర చరిత్రము, సత్య రాజాచార్య పూర్వదేశయాత్రలు, ఆడమళయాళము, ప్రహసనములు, ఉపన్యాసములు మొదలగునవి రచించిరి. వీరిది, వ్యవహారమునకు చాల దగ్గరభాష. వారు మరికొన్నేళ్లు జీవించియున్నచో కేవల వ్యావహారికభాషలో వ్రాసియుండెడి వారే.

శ్రీ వీరేశలింగం పంతులు ఏ లక్ష్యముతో—అనగా శీఘ్రవ్యవధానములో విజ్ఞానవ్యాప్తి లక్ష్యముతో—పైగ్రంథ రచనము గావించిరో సరిగా అదే లక్ష్యముతో శ్రీ గురుజాడ అప్పారావు 'కన్యాశుల్కము' రచించిరి. శ్రీ పంతుల భాష కంటె కన్యాశుల్కము నందలి భాషమూలమున విజ్ఞానవ్యాప్తి అంతకంటె నల్పకాలమున నగునని వారి నమ్మకము. దీని నాధారముగా గొని శ్రీ గిడుగు రామమూర్తి పంతులు వ్యావహారిక భాషావాదమును బలపరిచిరి. అదివరకే విశాఖ పట్టణమున శ్రీ పి. టి. శ్రీనివాస అయ్యంగారిచే ప్రారంభింప బడిన యీ వాదము గిడుగువారి యాశ్రయమున విజృంభించి నది. జీవద్భాషయున ప్రజల నిత్యవ్యవహారములోని దే యనియు, అది సహజము కాన వ్రాతకూడ అట్లేయుండిననే విషయములు వారికి సులభతరముగా అర్థమగుననియు వారి వాదము. విద్వాంసులయు, ప్రాచీనులయు భాష కృతకము. కాని ప్రాచీనుల రచనములలోనే ఆనాటి వ్యవహారములోని

పదములు వాడబడినవని గొప్ప యుపపత్తులతో వారి 'బాల కవి శరణ్యము'న చూపెట్టిరి. జానుదెనుఁగులో సంస్కృత శబ్దము వాడకుండ కృత్రిమములైన వికృతుల జోలికిపోక 'ప్రాదెనుగుకమ్మ' రచించిరి. అందులోని దేశిపదములు అసహజములై ప్రాకృత వ్యాకరణ సూత్రములచే కల్పింప బడిన తద్భవముల వంటివి కావు. శ్రీ గిడుగువారి ప్రచారము నకు వారిది కాకున్నను 'కన్యాశుల్కమే' ఉదాహరణము. ప్రాచీనములైనను, రాయవాచకము, దక్షిణాంధ్ర వాఙ్మయ ములో చాలభాగము వ్యావహారిక గద్యములోనే వ్రాయ బడినవి.

పై పద్ధతినే పాత్రోచిత భాషయను పేరున శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి తన 'ప్రతాపరుద్రీయ' నాటకములో వ్యావహారికమును వాడిరి. అందలి, ఎల్లి, పేరిగాడు, ఖుస్రూ, వలీఖాను ప్రభృతులయు, బొబ్బిలి యుద్ధ నాటకములోని సైనికులయు భాష మిక్కిలి సహజముగా నున్నది. ఈ పద్ధతి రచన సరియైనదా కాదా యని నిర్ణయించు సమస్య నాకక్కరలేదు. శ్రీ గిడుగువారి శిష్యులు శ్రీ చిలుకూరి నారాయణరావు కూడ వ్యావహారిక భాషను విరివిగా ప్రచా రములోనికి దెచ్చిరి. వారి అచ్చి, కిత్తడు మాటాడు భాష మిక్కిలి హృద్యము. భిన్నభిన్న మాండలిక భేదములు శ్రీ నారాయణరావుకు దెలిసినంత బాగుగా మరెవ్వరికిని దెలియవన్న నతిశయోక్తి కాదు. పడవలు నడపు సరంగుల భాష న్యాయస్థానములలో అభియోగముల సందర్భములు వాడు పారిభాషిక పదములు వారికి క్షుణ్ణముగా దెలియును.

పెండ్లియను నాటకమున రాగమ్మ, రంగారావు, అవధానుల నోట పలికించినభాష యెంతసహజమో, పాత్రోచితమో ఆ యా వర్గముల వ్యక్తులను బాగుగానెరిగినవారు గుర్తింప గలరు. ఈనాడు శ్రీ ముద్దుకృష్ణ, శ్రీ పి. వి. రాజమన్నారు, శ్రీ నార్ల వేంకటేశ్వరరావు, శ్రీ నరసరాజు, శ్రీ పినిసెట్టి, శ్రీ ఆత్రేయ, శ్రీ ఆరుద్ర, శ్రీ కణ్వశ్రీ మున్నగువారి గద్య నాటకము లెంతగా ప్రజల నాకర్షించుచున్నవో గమనించిన నీ వ్యావహారిక భాషా వ్యామోహములో ప్రజ లెంతవఱకు పడిరో తెలిసికొనవచ్చును. వార్ధకదశలో శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి సైతము శిష్టవ్యవహారభాషనే ఆశ్రయించిరి. కావుననే నేడు ఆబాలగోపాలము, పండితపామరులు చదువునప్పుడు, వినునప్పుడు నేటి గద్యమును సులభముగా నర్థము చేసికొని యానందింపగలుగుచున్నారు. గద్యములో రచనవలన, వ్యావహారికములో ప్రబోధము ఉద్దేశించినవారి యాశయములు పూర్తిగా ఫలించినవి. వారి ప్రయత్నము సక్రమమైనదేయని ఋజువుచేసికొన్నారు. గద్యరచనమును కాకున్నను వ్యావహారిక భాషా వాదమును వ్యతిరేకించినవారు లేకపోలేదు.)

శ్రీ జయంతిరామయ్య పంతులు సాహిత్యపరిషత్తు మూలమున, ప్రభుత్వమువారి, శ్రీ పిఠాపురము రాజావారి సహాయబలమున శ్రీ గిడుగువారి ప్రయత్నము నరికట్ట వదుమ కట్టి పనిచేసిరి. తాత్కాలికముగ నతనివాదము పండితుల ప్రోత్సాహముచేతను, పత్రికల సహాయముచేతను బలవత్తర ముగ కన్పించినను శ్రీ గిడుగువారు జీవితకాలములోనే

తన వాదమును నెగ్గించుకొనిరి. పాఠ్యగ్రంథముల నిర్ణయించు విషయమున, విద్యార్థులు పరీక్షపత్రములు వ్రాయునప్పుడు వాడు భాష విషయమున, విశ్వవిద్యాలయాధికారులు వ్యావహారిక భాష నంగీకరింపవలెనని శ్రీ గిడుగువారు పట్టుపట్టిరి. దానిని ఆంధ్ర విశ్వవిద్యాలయము పక్షమున శ్రీ జయంతి రామయ్య పంతులును, మద్రాసు విశ్వవిద్యాలయపక్షమున శ్రీ కోలాచలము శ్రీనివాసరావును మరికొందరు సాహిత్య పరిషత్సభ్యులును ప్రతిఘటించిరి. కాని మెల్లగా ఆ పట్టుసడలి నేడు అన్నివిధములైన రచనలలో—పత్రికలయందుకూడ—ప్రాయశః పద్యకావ్యములలోతప్ప – వ్యావహారిక భాషయే ఉపయోగింపబడుచున్నది.

## అనువాదములు

తెలుఁగు భాషలో రచింపబడిన ఆదిగ్రంథమగు మహాభారతమే సంస్కృతభాషనుండి అనువదింపబడినది. రామాయణ, పురాణాది గ్రంథములన్నియు ననువాదములే. విచిత్రమేమన సంస్కృతమున కేవల గద్యగ్రంథములైన కాదంబరీ, పంచతంత్ర, విక్రమార్క చరిత్రాదులు, చంపూగ్రంథములైన హితోపదేశ, భోజప్రబంధాదులుకూడ తెలుఁగున పద్యకావ్యములుగనే అవతరించినవి. చెప్పుకోదగ్గ గద్యములు ప్రాచీన శిలాశాసనములు, రాయవాచకము, కళువెవారి సభాపర్వము, సముఖమువారి జైమినిభారతము. నేటి రచన శ్రీ చిన్నయసూరి నీతిచంద్రిక. శ్రీ సూరి బాలవ్యాకరణము గద్యరచనను దృష్టిలో నుంచుకొనియే వ్రాసిరి. ఇది శ్రీ పంతులనాటివఱకు జరిగిన గద్యవాఙ్మయ సృష్టి. మొత్తము

పైన స్వతంత్ర గ్రంథమొక్కటియు లేదని తేలినది. శ్రీ వీరేశ లింగంపంతులు లేడేండ్ల ప్రాయమునన్నప్పుడు శ్రీ సూరి నీతిచంద్రిక రచించిరి. మరల శ్రీ పంతులు పెరిగి ప్రారంభించు దనుక గద్యరచన సాగలేదు. అందువలననే గద్యవాఙ్మయ సృష్టికర్త కేవలము పంతులుగారనవచ్చును. కాని పంతులు గారి రచనయంతయు అనువాదమో, అనుకరణమో ఐనదే కాని కేవల స్వతంత్ర రచనకాదు. ప్రాచీనులు సంస్కృత గ్రంథములను తెలుఁగు పద్యములలోని కనువదింప శ్రీ పంతులు ఆంగ్లవాఙ్మయ భాగములను సంఘ సంస్కార దృష్టితో తెలుఁగు గద్యములోని కనువదించిరి. అవి కేవలానువాద ములు కావుగాని అనుకరణము లనక తప్పదు. ఆంగ్లభాష యందలి 'Vicar of Wakefield' నకు ఛాయగా రాజశేఖర చరిత్రమును, 'Gulliver's Travells' కు అనుకరణగా 'సత్య రాజా పూర్వదేశయాత్రలు, ఆడమళయాళము' రచించిరి. 'Shakespeare' నాటకముల నెన్నిటినో కథలుగను, నాటక ములుగను, గద్యములోని కనువదించిరి.

పంతులుగారి పై రచనల వెనుక ఆంగ్లవాఙ్మయము నుండి గద్యానువాదములుగా చెప్పుకోదగ్గవి సాక్షివ్యాస ములు. ఇవికూడ కేవలానువాదములు కావు. స్వతంత్రములు కావు. 'Addison and Steel' అను ఆంగ్లరచయిత లప్పుడప్పుడు 'Spectator' అను నాంగ్లపత్రికలో ప్రకటించిన వ్యాసముల నాధారముగా గొని శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు తెలుఁగులో సాక్షివ్యాసములుగా రూపొందించిరి. మొదట నీ రచనలు ఆంధ్రపత్రికలో నప్పుడప్పుడు ప్రకటింపబడి వెనుక

సంపుటములుగా వెలువరింపబడినవి. ఈ నడుమ 'ఆంధ్ర పత్రిక' వారసంచికలలో ప్రఖ్యాతములైన, ఆంగ్ల, ఫ్రెంచి నవలల అనువాదములు క్రమముగా ప్రకటింపబడుచున్నవి. వానిలో ముఖ్యమైనవి 'Count-de-Monte Cristo', Hunchback of the Notterdam, Tale of Two Cities' వంటివి. పడవమ్మునుక, ప్రేమాశ్రమ్, గోదాన్ వంటి బంగాలీ, హిందీనవలలు కూడ అనువదింపబడినవి. ఇక రష్యను భాషనుండి 'Leo Tolstoy' Gorkey' మొదలగువారు రచించిన నవలలెన్నియో తెలుఁగు లోనికి పరివర్తింపబడుటయేకాక ఈ నడుమ స్టాలినుబహుమానము నందికొన్న నవలలన్నియు రష్యనుభాషనుండి యనువదింపబడినవి. అనువాదకులలో ముఖ్యులు శ్రీ వేంకట పార్వతీశ్వరకవులు, శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ వేలూరి శివరామశాస్త్రి, శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, శ్రీ గుండిమెడ వేంకటసుబ్బారావు, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, శ్రీ బొందలకుంట శివరామకృష్ణ. ఇంకను పాలీ అనువాదకులుగా శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య, శ్రీ కిళాంబి రంగాచార్యులు ఎన్నదగినవారు. రష్యను, జపాను అనువాదకులు శ్రీ ప్రయాగ కోదండరామ శాస్త్రి, శ్రీ శ్రీనివాసచక్రవర్తి కలరు. హిందీనుండి నెల్లూరి కేశవస్వామి, శ్రీ అట్లూరి పిచ్చేశ్వరరావు తదితరులు పెక్కు గ్రంథముల ననువదించిరి. కేవల సాహిత్యఖండము లుగా ఆంగ్లభాషయందును వంగభాషయందును ప్రసిద్ధి కెక్కిన భాగమంతయు గద్యమునకు సంబంధించినంతవఱకు తెలుఁగుభాషలోనికి బరివర్తింపబడినదనుటలో నతిశయోక్తి

లేదు. ఆంగ్లములోని అలెగ్జాండరు డ్యూమాస్, చార్లెస్ డిక్కెన్సు, స్కాటు, థాకరే, స్టీవన్‌సన్ ప్రభృతుల రచనలన్నియు తెలిగింపబడినవి. వంగభాషలోని శరచ్చంద్ర, బంకించంద్ర, పాంచకడీదేవ, రవీంద్ర, ద్విజేంద్రలాలుల రచనలన్నియు దెలుఁగువారి కవగతములైనవి. కానన్ డేలు (షెర్లాక్ హోమ్సు) వంటి సుప్రసిద్ధాపరాధపరిశోధక నవలలాంగ్లసాహిత్యమందున్నను మున్ముందు పాంచకడీదేవుని వంగపరిశోధకనవలలే ఆంధ్రుల నాకర్షించినవి. ఈ యనువాదముల విషయమున శ్రీ వేంకట పార్వతీశ్వర కవులకు మన మెంతయు ఋణపడియున్నాము.

కేవలము సాహిత్యమేకాక తక్కిన విషయము లెన్నియోపరభాషలనుండి తెలుఁగులో గద్యముగానువదింపబడినవి కలవు. ఆధునికయుగమున సాహిత్యమునకున్నంత ప్రాముఖ్యము తక్కిన యన్ని విషయములకును గలదు. ప్రపంచమునందలి ప్రసిద్ధవ్యక్తుల జీవితచరిత్రములను గురించి తెలిసికొనుట మన ముఖ్యధర్మములలో నొకటి. స్వయంకృషిచే రాజకీయములందును, శాస్త్ర విషయములందును అద్వితీయప్రజ్ఞను వెల్లడించిన శ్రీ నెపోలియన్ బోనపార్టీ, మార్కోనీ వంటి చిరంజీవుల చరిత్రములు మనకు చదువదగినవి. అట్టి ప్రసిద్ధ రాజకీయనాయకుల, శాస్త్రజ్ఞుల జీవితచరిత్రములు తెలుఁగులో బ్రకటింపబడినవి. వానిలో చాల మట్టు కనువాదములే. పరదేశసంస్థల పుట్టుపూర్వోత్తరములు, రాజ్యాంగములుకూడ అనువదింపబడినవి. స్వదేశీయములైన కాంగ్రెసువంటి సంస్థల చరిత్రలం ఆంగ్లమునుండి తెలిఁగింపబడి

యాంధ్రుల కందరకు దెలియు నవకాశ మేర్పడినది. సుప్రసిద్ధులు రచించిన దేశచరిత్ర భాగములెన్నియో చక్కని శైలిలో సామాన్యులకు సులభావబోధకములుగా నుండునట్లు తెలుఁగులోనికి సంతరింపబడినవి. ఇట్టిపనికి పూనినవారిలో సుప్రసిద్ధులు శ్రీ కొమర్రాజు వేంకట లక్ష్మణరావు. వారు విజ్ఞానచంద్రికా గ్రంథమండలి నొకదానిని స్థాపించి దాని మూలమున ప్రసిద్ధ చరిత్రగ్రంథముల, శాస్త్రగ్రంథముల యనువాదము లాంధ్రుల కందించిరి. శ్రీ చిలుకూరు వీరభద్రరావు, శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ ఆచంట లక్ష్మీపతి వంటి ప్రసిద్ధ రచయితల సహాయమున స్వతంత్ర గ్రంథముల నెన్నిటినేని ప్రకటించిరి. పదార్థ విజ్ఞానశాస్త్రము; రసాయన శాస్త్రము మొదలైనవాని కనువాదప్రాయములు, క్రోడీకరణములు జరిగినవి. ఈ కాలముననే శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహారావు 'రాజస్థాన కథావళి'ని ప్రకటించిరి. ఇది 'Colonel Tod' గారి 'Annals of Rajasthan' అను గ్రంథమున కనువాదము. అద్భుతమైన జాత్యభిమానము, దేశాభిమానము పుట్టించి వ్యక్తులను సర్వస్వత్యాగమునకు పురికొల్పు వీరగాథలసంపుటి ఈ కథావళి. వెనువెంటనే మహారాష్ట్ర జీవనప్రభాతము వంటి గ్రంథములు బయలుదేరినవి. ఈ సందర్భముననే ఆంగ్లభాషయందు 'Torrense' మహాశయునిచే రచింపబడి తెలుఁగులోనికి శ్రీ మానికొండ సత్యనారాయణశాస్త్రిచే "ఆంగ్లరాజ్యస్థాపన" అను పేర ననువదింపబడిన గ్రంథమునుగూర్చి చెప్పుటవసరము. మన దేశవాసులు పాశ్చాత్యులచే ఎంత నిర్దాక్షిణ్యముగా వంచింపబడిరో ఈ

గ్రంథము తెలిపి మనయజ్ఞానమును వ్రేలుపెట్టి చూపించును. ఈ యుగములోనే ఇట్టి గ్రంథముల యవసరము వచ్చినది. అవి బయలుదేరినవి.

ఇక స్వదేశీయ శాస్త్రవిషయములు, ముఖ్యముగా వేదాంతము. ప్రపంచము భౌతికలాలసలోఁబడి కొట్టుకొని పోవుచున్నను ఆంధ్రులలో నైతికములైన విలువలు క్షీణింప లేదు. మన ప్రాచీనవిజ్ఞానతృష్ణ తీరలేదు. ఒకవైపున వానిని గురించి కృషిచేయువారు లేకపోలేదు. శ్రీ తిలకు మహాశయులు రచించిన భగవద్గీతాపరమైన 'కర్మయోగము'నకాంధ్రానువాదము బయలుదేరినది. ఈ నడుమనే శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు రచించిన "భారతీయ తత్త్వశాస్త్రము"నకు కాకినాడనుండి యొక యనువాదము వచ్చినది. శ్రీ వివేకానందులయు శ్రీరామకృష్ణ పరమహంసలయు రచనలన్నియు దెలుఁగులోనికి వచ్చినవి. కేవలమంతేకాదు. వానికి విపుల ప్రచారముకూడ కలుగుచున్నది.

## పురోగమన దీక్ష

ఇరువదవ శతాబ్ది ప్రారంభమునుండి పురోగమనదృష్టి ప్రజలలో నన్నివర్గములవారికి అన్నివిషయములలో కన్పించుచున్నది. ఆంధ్రులలో నొకభావము పుట్టరాదుకాని పుట్టినా దానిని పట్టపగ్గములుండవు. అటు పూర్తిగా నిద్రించుటో, ఇట్లు నిత్యజాగృతితో విజృంభించుటో మన తెలుఁగువారి కగ్గుతో వచ్చిన గుణములు. కావుననే రాజకీయముగను, సాంఘికముగను, మతవిషయికముగను మనలో జాగృతి

చాల తొందరగ కలిగినది. ఇట్టి విషయములలో బెంగాలీలకు తరువాత భారతదేశములో ఆంధ్రులదే ముఖ్యస్థానము. ఆంగ్ల వాఙ్మయ ప్రభావమువలన దేశాభిమానముగల వ్యక్తులు మొదట గుర్తించిన సత్యము ప్రాతపద్ధతులను నిరసించుట క్రొత్తపద్ధతుల నవలంబింప నుత్సహించుట. మొదటి ఎడ్వర్డు కాలమునుండియు ఆంగ్లేయులలో ప్రజాస్వామ్యముపై ప్రీతి కల్గుటయు, పార్లమెంటు స్థాపించుకొనుటయు, క్రమముగా ప్రజలు రాజులను నామమాత్రులనుగా నుంచుకొని తమలో తాము ఎన్నుకొన్నవారి వలననే రాజ్యాంగము నడపుటయు మన దేశమున పాలకవర్గముపై ద్వేషము ప్రబలుటకు కారణమయ్యెను. సంఘములో ప్రభువులు – పాలితులు; ధనికులు – నిర్ధనులు; అధికారులు – వినీతులు; విద్యావంతులు – నిరక్షరాస్యులు అను పరస్పర విరోధములతో కూడిన వర్గములుండరాదను భావము కల్గినది. వెంటనే వానిని ప్రబోధించు సాహిత్యము బయలుదేరినది. ఆవేశము కల్గించుటకు కొంతవఱకు గేయము తోడ్పడినను పై భావములు సామాన్య ప్రజల మనస్సుల కెక్కవలెనన్న విరివిగా నా ప్రచారము గద్యములో జరుగవలసివచ్చెను. ఉపన్యాసములకు ప్రాధాన్యముకలిగి వానిని గ్రంథములుగా ప్రచురించుటకూడ పరిపాటియైపోయినది. శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శ్రీ పట్టాభిసీతారామయ్య, శ్రీ చెరకువాడ వరసింహంపంతులు, శ్రీ ముట్నూరు కృష్ణారావు, శ్రీ ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య మొదలైన ప్రముఖవక్తల గంభీరోపన్యాసముల వారము ఆంధ్రులందరు సర్వస్వతంత్రులు కావలెనని ప్రబో

ధించుచే. వీరి ఉపన్యాసములకు తోడు కృష్ణాపత్రికవంటి యాయుధము చిల్లరిగె శ్రీనివాసరావు, ముట్నూరి కృష్ణారావువంటి రచయితల కలములకు కావలసినంత పని కల్పించెడిది. ఈ సమయములోనే ఆంధ్రులు స్వతంత్రముగా రాజ్యము లేలిన ధీరులుగాని చేతగానివారు కారని తెలుపుటకై శ్రీ చిలుకూరి వీరభద్రరావు ఆంధ్రులచరిత్ర, జీర్ణకర్ణాట రాజ్యచరిత్రము ప్రకటించిరి. ప్రోత్సాహకులుగా శ్రీకొమర్రాజు వేంకటలక్ష్మణరావు కూడ హిందూమహాయుగము, మహమ్మదీయ మహాయుగము అను గ్రంథములలో భారతదేశీయుల ప్రాచీనసంస్కృతిని సామర్థ్యమును ప్రకటించిరి. ఈ మార్గములోనే చేరిన శ్రీ గాడిచర్ల హరిసర్వోత్తమరావు దేశభక్తిని, స్వార్థత్యాగమును ప్రకటించుట కుదాహరణము లుగా విస్మృతరాజకవి, అబ్రహాం లింకను మున్నగు గ్రంథములు వెలువరించిరి. వెనువెంటనే విజ్ఞానచంద్రికావారి యాజమాన్యమున వెడలిన రాయచూరు యుద్ధము, విజయనగర సామ్రాజ్యమువంటి గ్రంథములన్నియు ఆంధ్రులు సమర్థులనియు, నిద్రింపక మేల్కొని పురోగమింపవలెననియు ఉద్బోధించుటకై ప్రయత్నించినవి. ఈ గ్రంథములకు, ఉపన్యాసములకు, పత్రికలలోని వ్యాసములకు మూలకారణము రాజకీయవాతావరణమే. ఆంధ్రులలో స్వాతంత్ర్యేచ్ఛ కలిగింపవలెనను కుతూహలమే. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యచే ఆంగ్లమున రచింపబడి తెలుగులోనికి శ్రీ కొడాలి ఆంజనేయులచే అనువదింపబడిన 'కాంగ్రెసు చరిత్ర' చదివినచో పాలకుల దుర్ణయములు, పీడిత ప్రజల

దీనత్వము బాగుగ వెల్లడికాగలదు. స్వదేశీయులైన ధనికులు, విద్యావంతులు పాశ్చాత్యుల ప్రాపున తమ సంపద, ప్రాభవము నిలుపుకొనుటకై తమ తోడిసోదరప్రజలైన అమాయకుల నెట్టి చిత్రహింసలపాలు చేసిరో దానిమూలమున తెలియగలదు.

ఇక సాంఘికస్థితి. రాజకీయములలో ప్రజలస్థితి యట్లుండ సాంఘికముగా వారిపాట్లు మరియు నధ్వాన్నము. మన దేశములో వర్ణవ్యవస్థ యెంత యనర్థకారియో గ్రహించుటకు మననాయకుల కెంతయోకాలము పట్టలేదు. మహానాయకు లెందరో దానిని ప్రతిఘటించిరి. పాశ్చాత్యుల ఐకమత్యభావమునకు వారిలో కులము లను భేదము లేకుండుటయే యని మనవారికి నమ్మకముకల్గెను. పాలకవర్గమువారు ప్రజలను విడదీసి పాలించుట కిదియొక యాయుధమయ్యెను. హరిజనులు మొదలగు కడమవర్ణములవారి కాశలుచూపి మతాంతరులను చేయుట పరిపాటియయ్యెను. సవర్ణహిందువులు నీచముగా జూచువారిని పాశ్చాత్యులు దగ్గరదీసి దువ్వుకొనజొచ్చిరి. సవర్ణహిందువులలోనే కాపులు, కమ్మలు మొదలగు తెగలు హోరాహోరిగా దమలోతాము వివాదపడుట తటస్థించుచుండెను. వీనిని శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి, శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి, శ్రీ దుగ్గిరాల కుటుంబమువారు, శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ ప్రభృతులు తీవ్రముగా ప్రతిఘటించిరి. అర్థశాస్త్రము, కురుక్షేత్రసంగ్రామము, సూతపురాణము, మాలపల్లి మొదలైన ఉద్గ్రంథముల సృష్టి పైవారి భావములు వ్యాపింపజేయుటకై జరిగినదియే. షోడశ

సంస్కారములు సర్వకులములవారు సమానముగ చేసికొన కర్హులనియు, అందుకై ప్రత్యేకము పురోహితవర్గ మొక్కటి యాధిపత్యము వహింపనక్కరలేదనియు కృష్ణా, గుంటూరు మండలములందలి కమ్మకుటుంబములలో పెక్కురు గ్రంథాధారములు చూపిరి. వివాహ, చౌల, ఉపనయనాదిక్రియలు జరుపువిధానమంతయు తెలుగర్థములతో బ్రకటించిరి. మొన్న మొన్నటివరకు కృష్ణావారేకాక చిత్తూరుమండల వాయల్పాడు నివాసులైన శ్రీ చింతల రఘునాథ (రెడ్డి) వర్మ గారు వందలకొలది వివాహములు తమ యాజమాన్యమున జరిపిరి. ముఖ్యముగా వర్ణాంతర వివాహములు, బాలవితంతూద్వాహములు, మున్నగు సంస్కరణోద్దేశముతో గూడిన పెళ్ళిళ్ళు వీరి ఆధిపత్యములో జరిగినవి. ఈ తంతుకు దగిన గద్యవాఙ్మయమంతయు ఆంధ్రదేశమున వ్యాపించినది.

ఇట్లు ఆంధ్రదేశములో ధనికులైన భూస్వాముల క్రింద నలిగిన పేదరైతుల పరిస్థితులను, ఉన్నతకులములవారిచే నిరసింపబడిన తక్కువకులములవారి కడగండ్లను, గద్యగ్రంథములుగను, గద్యనాటకములుగను పెక్కురు రచయితలు చిత్రించిరి. సామాన్య స్త్రీపురుషులవలె పరస్పరము ప్రేమించుకొనగలిగియుండి సాంఘికములైన కొన్ని కట్టుబాట్లమూలమున ఆ ప్రేమకు వివాహబంధ మను పవిత్రతను కూర్పలేని దీనులచరిత్రలు కరుణరసపోషకములైన కథలై ప్రజల యభిమానమును సంపాదించినవి. శ్రీ నరసరాజు, శ్రీ రాజమన్నారు గారి గద్యనాటికలు, శ్రీ చంద్రశేఖర కణ్వశ్రీ గారి ఇదాప్రపంచం, పినిశెట్టివారి అన్నా చెల్లెళ్ళు—పునర్జన్మ,

ఇట్టి ఆదర్శనుల నెన్నిటినో హృదయంగమముగా చిత్రింప గలిగినవి. అస్పృశ్యతానివారణము ప్రజలమనస్సు కెక్కునట్లు చేయుట కొక్క 'మాలపల్లి' చాలును. ఈ నమమనే ప్రకటింపబడిన శ్రీ గోనుగంటి పున్నయ్య "పరివర్తనము" అను నవల పల్లెలలోని కక్షలెంత యనర్థదాయకములో, ఐకమత్యభావముతో మసలిన ప్రజలు తమగ్రామముల నెట్లు స్వర్గసీమలుగా మార్చుకొనగలరో తెలుపుటకు పరమోదాహరణముగా కాన్పించుచున్నది. 'ప్రజలు—సహకారవిధానము' అను విషయమున శ్రీ పున్నయ్యగారి కృతితో సమానమైనది లేదని చెప్పవచ్చును. ఇట్టివి వందలు వేలుగా గ్రంథములు బయలుదేరుచున్నవి. పేర్లు వ్రాయుటకైనను ఇచ్చట స్థలము చాలదు.

వీనినన్నిటిని మించినది మనలోగల మతవిషయికమైన దురభిమానము. మన దేశములో విద్యావంతులు పదిమందియైన విద్యావిహీనులు తొంబదిమంది. గొర్రెదాటుగా పదిమంది యేదిచెప్పినను తొంబదిమందియు దానిననుసరించు పరిపాటి మనలో అనాదినుండియు వచ్చుచున్నది. ఆ అవకాశమును స్వార్థపరులు దుర్వినియోగముచేసికొని అమాయిక జనులను పీడించుచున్నారు. దేవుడని, పూజావిధానములని పెద్దపేరుపెట్టి కొందరు దంభాచారముల కలవాటుపడి తక్కినవారిని బానిసలుగా ఉపయోగించుకొనుచుండిరి. ఆస్తికతయందును, దేవుని ఉనికియందును ప్రజలకు నమ్మకము కల్గించుట దోషముకాదు. మూఢభక్తిచేనైన సామాన్యులు దుష్కార్యముల జోలికిపోక దైవమునకు భయపడి పవిత్ర

జీవితము గడుపగ్గలరు. కాని ఆ దైవభక్తి బోధించువారి హృదయములు పవిత్రములైననే ఆ ఫలితము దక్కును. విగ్రహారాధనమని, పూజలని పేరుపెట్టి దక్షిణాల రూపమున పేదలనుండి ద్రవ్యము లాగుట తక్క, పురోహితులకు, పూజారులకు దైవభీతి శూన్యమైనది. వారికి దైవభీతి లేదనుటను తమ జీవితచర్యలలో బహిరంగముగ తెలియజేయుట వారు జేయు పెద్ద తప్పులలో నొకటి. అక్కరలేని మతభేదములతో బాహ్యచిహ్నములకు ప్రాధాన్యము, బాహ్యాచారములకు గౌరవము, ఆదర్శ జీవితము వేషమునదక్క చర్యలలో లేకుండుట నేటి సంఘములో నెచ్చటజూచినను ప్రత్యక్షమగు నొక వ్యాధి. కావుననే ఆచారపరులన్నను, మతానుయాయులు, మతగురువులన్నను, పురోహితులన్నను ద్వేషించుట, ఆ ద్వేషమును ప్రచారము చేయుట కొందరు రచయితలకవసరముగా తోచినది. త్రిపురనేనివారి 'ఖూనీ' గోపదేవుగారి "ఆస్తికత" గోపిచందుగారి రచనలు ఇట్టి భావములనే కలిగియున్నవి. మున్నే శ్రీ వీరేశలింగంపంతుల రచనలలో చాలభాగమున నిట్టి భావములు స్పష్టముగానున్నవి. శ్రీ చిలకమర్తి, శ్రీ పానుగంటివారి రచనలలోగూడ నైభావముల నిరసనము తెలియుచున్నది. ఈ విషయములనే మిక్కిలి యసభ్యమైన భాషలోను, వైఖరిలోను రచించినవారు లేకపోలేదు. ఇన్ని విధములైన లోపములకు నిలయమైనందుననే ఈ ధార్మికచర్చ చాలమందికి నచ్చక ప్రజలు నిరీశ్వరవాదులగుచున్నారు. దేవుడున్నాడో లేడో, మనకక్కరలేదు. మనకు కావలసినది సుఖజీవనము—దానిని పొందుమార్గము

నకై మనము పాటుపడక చూడరాని, పొందరాని దేవునకై ప్రాకులాడుట వెఱ్ఱితలంపని యొకవర్గమువారు తీవ్రముగా ప్రచారము సాగించుచున్నారు. ప్రజలలోనే ఎన్నో దుష్ట శక్తులు వ్యాపించియుండ, వానినుండి తప్పించుటటుండ సమర్థులగువారమాయికులను అట్టి యిక్కట్టులలో మరింత తగిలింప జూచుట మానవుల దౌష్ట్యమున కుదాహరణమనియు దాని నెదిరించుటకు మనము పూనుకొనవలెననియు ప్రజలను సామ్యవాదులు రెచ్చగొట్టుచున్నారు. తాత్కాలికములైన ఆపదలలోనున్న వారి కాభావములే రుచించును. ఇప్పటి ప్రచారసాహిత్యములో సగపాలుపైన నిట్టిదే మనము చూచుచున్నాము. ఆ సాహిత్యమునే నేడు అభ్యుదయ సాహిత్యము అనుపేరుతో మన మెదుర్కొనుచున్నాము. 'ఉమర్ కయ్యాము' రుబాయత్ లకు తెలుఁగులో వెలువడిన అనువాదముల తీరు గమనించినచో ప్రజలదృష్టి యైహిక విషయముల పై నెంత మొగ్గినదో తెలిసికొనవచ్చును. 'పాన శాల'లోని విషయములనుపోలిన గద్యరచన లెన్ని లేవు!

సంఘములో పాతుకొనిపోయిన కొన్ని దోషములను వెల్లడిచేసి వానిని దోషములుగ ద్యోతకములగునట్లు చేయవలెనన్న కొంత హాస్యధోరణి అవసరము. ఉదాహరణమునకు శ్రీ మొక్కపాటి నరసింహాము 'బారిష్టరు పార్వతీశం' అను గ్రంథమును చూడుడు. మనము పూర్వాచారము లను వ్యామోహములోపడి చాదస్తముగా వ్యవహరించుచు సదాచారము నడుపుచున్నామను తృప్తిని పొందినవారైన వ్యక్తికికాని, జాతికికాని పురోభివృద్ధి లేదను నీతిని శ్రీ నరసింహారావు

ఎంత చాకచక్యముగా ఎంత హాస్యప్రియత్వముతో చిత్రించిరో గమనింపుఁడు. పూర్వాచారములను హేళనచేసినప్పటికిని అది యెంతో సందర్భశుద్ధిగా ఉన్నదికదా! శ్రీ ముని మాణిక్యం 'కాంతం కథలు' వంటి కథలు, శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు గద్యనాటికలు కేవల సంఘసంస్కార దృష్టితో కల్పింపబడి సంఘములోని కుళ్ళును బయటపెట్టుటకే పనికివచ్చుచున్నవి.

సంఘములో పరంపరగా వచ్చుచున్న కొన్ని అభ్యుదయ నిరోధకాచారములను పూర్తిగా తుదముట్టింపవలెనని ప్రయత్నించుట ఒకవిధమైన ప్రచారము, సంస్కారమును. కాని, ఆ యాచారములనే విమర్శదృష్టితో పరిశీలించి మన కనుకూలించు విధమున మార్చుకొన ప్రయత్నించుట వేరొక విధమైన ప్రచారము. మొదటిది సంఘసంస్కర్తలలో అతివాదుల పద్ధతి. రెండవది వారిలో మితవాదుల పద్ధతి. ప్రారంభదశలో శ్రీ వీరేశలింగంపంతులవంటి మితవాదులు సైతము, వివేకవర్ధిని, హాస్యవర్ధిని మున్నగు పత్రికల మూలమున ప్రకటించిన ప్రహసనములు మొదలైనవి పై అతివాదుల ప్రచారము ననుకరించెను. ముఖ్యముగా విగ్రహారాధన విషయమున శ్రీ పంతుల భావములు సామాన్య భావములు గల సంస్కర్తలకు వచ్చలేదు. ప్రాచీనకాలమునుండి వచ్చుచున్న హిందూసంప్రదాయములకు వ్యతిరేకముగా వారు ప్రవేశపెట్టదలచిన "బ్రహ్మసమాజ" లక్ష్యమును చాలమంది ప్రతిఘటించిరి.

మితవాదులలో ప్రముఖులు శ్రీ పానుగంటి లక్ష్మీ నరసింహారావు. వారును సంఘములో లోపములున్నవని గ్రహించినవారేకాని, యట్టిలోపముల కాశ్రయమిచ్చిన పూర్వాచారములను పూర్తిగా నశింపజేయరాదనియు మన పెద్ద లా యాచారములను, కట్టుబాట్లను, ఏ యుద్దేశముతో నేర్పరచిరో తెలిసికొని ఆ సదుద్దేశము నెరవేరునట్లు వానిలో మార్పులు కావించుకొనవలెననియు తమ సాక్షివ్యాసముల మూలమున లోకమునకు వెల్లడిపరచిరి. శ్రీ జంఘాలశాస్త్రి నోట వారు పలికించిన వన్నియు మనము మన కర్తవ్యమును అర్థమెఱిగి నడుపవలయుననుటయే. వివిధమతానుయాయులు పరస్పరము హోరాహోరిగా బోరుట బాహ్యాచార విభేద ములవలననే కాని యంతశ్శుద్ధి విషయమున కాదనుటను ఒక ఉపన్యాసమున వివరించి అట్టి సంకుచితాభిప్రాయములు మన కుండరాదను నీతిని బోధించును. ఇట్లే అన్ని విషయము లందును భాషలోని వారి ధారాశుద్ధి కేవలము వారి సాక్షి వ్యాసములలోనేకాదు, వారి ప్రహసనములందు గూడ చూడవచ్చును. ముఖ్యముగా హాస్యరసము నాశ్రయించియే వారి గద్యరచన సాగినది. శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి వ్యాసములు కృష్ణాపత్రిక మూలమున ప్రకటించిన వన్నియు కూడ బ్రహ్మమత సిద్ధాంతములవ్యాప్తి నరికట్టునవియే.

## వచనరచనలో వివిధశాఖలు

గద్యమనగానే ఎవ్వరైన స్వేచ్ఛగా వ్రాయుటకు వీలైనది. ప్రాచీనకాలమున శాస్త్రగ్రంథములు సైతము పద్యములోనే వ్రాయబడెను. సంస్కృతభాషలో మాత్రము

సూత్రరూపమున కొన్ని శాస్త్రములున్నను, ధర్మశాస్త్రాదు లన్నియు పద్యములోనే వెలసినవి. జ్యోతిషము, గణితము, వైద్యశాస్త్రము, సంగీతశాస్త్రము, నాట్యశాస్త్రము, శిల్ప శాస్త్రము, ఒకటియననేల సర్వశాస్త్రములు పద్యము లోనే రచింపబడినవి. అట్లే తెలుగునందును ధర్మశాస్త్ర మైన విజ్ఞానేశ్వరీయము, గణితశాస్త్రమైన మల్లన గణి తము శకునశాస్త్రమైన శిఖి నరసింహాశతకము, కడకు వ్యాకరణచ్ఛందోలంకారములు సైతము పద్యములో నడచినవి. కాని నేడట్లుకాదు. పద్యమునకంటె గద్యము నకు ప్రచార మెక్కుడైనది. కవి కెంత గౌరవము కలదో సంఘములో గద్యరచయిత కంతే గౌరవము కలదు. ఒక్క సాహిత్యముతక్క తక్కిన యే విషయమైనను పద్యములో చదువుట కెవ్వరును ఉత్సహించుటలేదు. అందరకు అందు బాటులోనుండి విపులవ్యాప్తికి పనికివచ్చునట్లు, సర్వజనులు తమకు తెలిసినవాని నితరులకు తెలియజేయుట కనువగునట్లు ఒక్క గద్యమే ఉపయోగించును. కావుననే గద్యములో వివిధశాఖల విజ్ఞానము వ్యాపించినది. సర్వశాస్త్రములు, ప్రాచీనములు, ఆధునికములు, అలంకార వ్యాకరణ చ్ఛంద ములు మతోపనిషద్ధర్మశాస్త్రములు, అన్యమతవిషయిక ములు, దేశచరిత్రలు, జీవితచరిత్రలు, నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వకోశములు, పరిశ్రమల వివరించు గ్రంథములు, పద్య గద్య గ్రంథముల వ్యాఖ్యానములు, ఉపన్యాసములు, ఉద్గ్రంథ ములకు విపులములగు పీఠికలు, నాటికలు నేడు గద్యములోనే వెలువడుచున్నవి. ఇవన్నియు నొక యెత్తు. సాహిత్యమంతయు

నొకయెత్తు. ఉన్నతమైన సాహిత్యము, స్వతంత్రముగా గద్యములో వ్రాయబడుటయేకాక, గద్య పద్యగ్రంథములపై విపుల సమీక్షలు, సాహిత్య విమర్శలు, చర్చలు, గద్యములో తామరతంపరగ బయలుదేరినవి. ఈ రెండింటినిగూర్చి రెండు ప్రత్యేక గ్రంథములు వ్రాయవచ్చును. ముందటి ప్రకరణములోని దంతయు ప్రచారసాహిత్యము. అటు కొందరువ్యక్తుల భావముల ప్రభావము పలువురు వ్యక్తులపై ప్రసరింపజేసి సంస్కారమో, వారి పలుకుబడికి ప్రచారమో కలిగించుట దానిలోని ప్రధానోద్దేశము. కాని యీ ప్రకరణమందలి విషయ మట్టిదికాదు. అన్నివర్గముల ప్రజలు సర్వతోముఖముగ సమానముగ నేకకాలములో అభ్యుదయము నొందుటకు దగిన విజ్ఞానము నీయ బ్రయత్నించుటకై రచయితలు చేసిన కృషి యిట వివరింపబడుచున్నది. పాశ్చాత్యుల నాగరకతకు, విజ్ఞానవ్యాప్తికి, ఏ విధమైన విషయ సామగ్రి యవసరమైనదో సరిగా నట్టి సామగ్రినే మనవారు సృష్టింప దొడగిరి.

ఇరువదవ శతాబ్దిలో ప్రపంచము ఊహింపరాని మార్పులకు లోనగుచున్నది. రెండు నదుల నడుమ, రెండు పర్వతముల నడుమ నివసించు జనులు తమలో తామే కాని తదితరులతో వ్యవహరింపజాలని కాలముపోయి, సముద్రాంతరములందున్న వ్యక్తులు ఖండాంతరములు కొన్ని గంటలకాలములో పయనించి తిరిగి స్వస్థానమునకు చేరగల కాలము వచ్చినది. ఆ పనిని సాధించు యంత్రములు సృష్టింపబడినవి. వాని నిర్మాణమునకు, పదార్థ విజ్ఞాన

శాస్త్రము, రసాయన శాస్త్రము, గణితశాస్త్రము దేశ భాషలలో వ్రాయవలసివచ్చెను. ఆరోగ్య శాస్త్రమునకై శరీరనిర్మాణ పద్ధతి నెఱుగు టవసరమయ్యెను. శాస్త్రజ్ఞులు ఇట్టి గ్రంథములు రచించుటకు ప్రభుత్వమే ప్రోత్సాహ మొసగెను. తత్ఫలితముగా వందలు వేలుగా శాస్త్రగ్రంథ ములు బయలుదేరినవి. శ్రీ గోటేటి భోగిరాజు వ్యవసాయ శాస్త్రము, శ్రీ డాక్టరు గుళ్ళపల్లి నారాయణమూర్తి గ్రామా రోగ్యరక్షణము, మనశ్శాస్త్రము, శ్రీ ఎన్. ఎం. వేణుగోపాల నాయుడు రమ్యహర్మ్యము, శ్రీహరి ఆదిశేషువు, విద్యుచ్ఛక్తి ఉపయోగములు, వినియుక్త రసాయనశాస్త్రము, శ్రీమతి కోడూరి లీలావతీదేవి గృహనిర్వహణ శాస్త్రము, శ్రీ కె. శేషగిరిరావు ఖగోళశాస్త్రము ప్రభుత్వమువారి బహుమతు లను సైతము పొందినవి. వీనికి చాల పూర్వమే శ్రీ కొమ ర్రాజు లక్ష్మణరావు ఆధిపత్యమున విజ్ఞాన చంద్రికాగ్రంథ మండలి శ్రీ వేమూరి విశ్వనాథశర్మచే రసాయనశాస్త్ర మును, శ్రీ మంత్రిప్రగడ సాంబశివరావుచే పదార్థ విజ్ఞాన శాస్త్రమును (Physics), శ్రీ డాక్టరు ఆచంట లక్ష్మీపతిచే ఆరోగ్యశాస్త్రగ్రంథములను వ్రాయించి ప్రకటించెను. శ్రీ జోయనపల్లి పద్మరాజు సహకారార్థికవిజ్ఞానము, శ్రీ డాక్టరు ఐ. వేంకటేశ్వరశర్మ వనౌషధి విజ్ఞానము ఈ నడు మనే బహుమానము లందుకొన్నవి. శ్రీ ఆత్మకూరి గోవిందా చార్యుల ఆర్థికశాస్త్రము ఈ సందర్భములో చెప్పదగినది. వ్యాకరణాలంకార శాస్త్రములలో శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి, శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి, శ్రీ వజ్ఝల చిన

సీతారామస్వామి, శ్రీ మల్లాది సూర్య............శాస్త్రి, శ్రీ చర్ల నారాయణశాస్త్రి, శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, శ్రీ దూసి రామమూర్తి, శ్రీ గంటిజోగి సోమయాజి, శ్రీ కంభంపాటి సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ బులుసు వేంకటరమణయ్య, శ్రీ జమ్మలమడక మాధవరామశర్మ, శ్రీ వేదాల తిరువేంగడాచార్యులు, శ్రీ చలమచర్ల రంగాచార్యులు, చేసిన కృషి మరువరానిది. భాషాశాస్త్ర విషయమున శ్రీ నారాయణరావు, శ్రీ కోరాడ రామకృష్ణయ్య, శ్రీ సోమయాజి, శ్రీ నిడదవోలు వేంకటరావు ఎన్నదగియున్నారు. శ్రీ నారాయణరావు, శ్రీ సూర్యనారాయణశాస్త్రి, శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి మత గ్రంథములు, ధర్మశాస్త్రములు తెనుఁగు గద్యమున వ్రాసి ప్రకటించిరి. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రి, శ్రీ వావిలికొలను సుబ్బారావు, శ్రీ ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి, శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రి ఉపన్యాసములమూలమున, నీతికథలమూలమున, మతగ్రంథముల ననువదించుటవలన ధర్మశాస్త్రములకు ప్రచారము చేకూర్చిరి. శ్రీ కొమర్రాజువారి హిందూ మహమ్మదీయ మహాయుగములు, శ్రీ వీరభద్రరావు 'ఆంధ్రుల చరిత్ర' శ్రీ చిల్లరిగె శ్రీనివాసరావు హిందూదేశ చరిత్రము, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ ఆంధ్రదేశ చరిత్ర, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, శ్రీ కురుగంటి సీతారామభట్టాచార్యుల తంజావూరి ఆంధ్రనాయకరాజుల చరిత్రలు శ్రీ శాకర్ల వరసింహం దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్రము, శ్రీ చిలకమర్తివారి రాజస్థాన కథావళి ఆంధ్రులచరిత్ర రచనానైపుణ్యమును

తెలుపుచున్నవి. పెక్కురు మహాపురుషుల జీవితచరిత్రలు ఈ కాలముననే గద్యములో బయలు దేరినవి.

వివిధ పరిశ్రమలు దెల్పు గ్రంథములు ఈ నడుమనే ప్రకటింపబడుచున్నవి. కాగితపు పరిశ్రమ, చక్కెర పరిశ్రమ, నిప్పుపెట్టెల పరిశ్రమ, చేనేతగుడ్డల పరిశ్రమ, అద్దకపు పరిశ్రమ మొదలైన గృహపరిశ్రమలను గూర్చియు, యంత్రాగారసహాయ పరిశ్రమలనుగూర్చియు ఉద్గ్రంథములు- రూపమున అల్పమైనవైనను - బయలు దేరుచున్నవి.

ఇక నిఘంటువులు, విజ్ఞాన సర్వస్వములు. ఆంగ్లములో జాన్సనుగారి నిఘంటువువలె తెలుఁగులో మొట్టమొదటగా శ్రీ బ్రౌనుదొరగారొక నిఘంటువును నిర్మించిరి. దానిలో పదముల కర్థములు ఆంగ్లభాషలో నీయబడినవి. ఆవెనుక నిఘంటునిర్మాణమున మాయనికీర్తి శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యులవారికి దక్కినది. వారి శబ్దరత్నాకర మీనాడును ఆంధ్రుల కేకైకనిఘంటువు. శ్రీ జయంతి రామయ్యపంతుల యాధిపత్యమున శ్రీ సాహిత్యపరిషత్తు మూలమున ప్రకటించిన శ్రీ సూర్యారాయాంధ్రనిఘంటువు అసమగ్రమును, అసంపూర్ణమునైనది. అట్లే శ్రీ వావిళ్ళ నిఘంటువుకూడ చాలనిదైనది. మహాకాళి సుబ్బారాయుడు గారి శబ్దార్థచంద్రిక, యొక చిన్న నిఘంటువు. 'ఆంధ్రపద పారిజాతము' అచ్చ తెనుఁగుపదముల కోశములలో తలమానికము వంటిది. శ్రీ కొమర్రాజుగారు ప్రారంభించిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము మొదటి రెండుసంపుటములతో ఆగినది. శ్రీ సర్వారాయ జమీందారు ఏడుభాగములుగా ఒక విజ్ఞాన

సర్వస్వము ప్రకటించిరి కాని, అదియు సమగ్రము కాదు. ఇప్పుడు శ్రీ గిడుగు సీతాపతి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ పర్యవేక్షించునట్లు ప్రభుత్వమువారు ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమును పండ్రెండు సంపుటములకు తక్కువ కాకుండునట్లు ప్రకటింపవలెనని సంకల్పించి యున్నారు. ఇప్పటికి మూడవ భాగమువరకు పూర్తియైనది.

కఠిన శైలిలో వ్రాయబడిన గద్యపద్య గ్రంథములకు వ్యాఖ్యానములు ఈ యుగముననే బయలుదేరినవి. ద్వ్యర్థి కావ్యములవంటివానికి దక్క తక్కినవానికి ప్రజోపయోగకరములైన వ్యాఖ్యలు లేవు. సర్వాంగపూర్ణమైన వ్యాఖ్యానములుకూడ గద్యరచన యుగములో నొక భాగముగా చెప్పవచ్చును. ఆధునికులలో సుప్రసిద్ధ వ్యాఖ్యాకారులుగా శ్రీ వావిళ్ళ రామస్వామిశాస్త్రి, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, శ్రీ పురాణపండ మల్లయ్య, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య, శ్రీ తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్య (దేవరాజసుధి), శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి, శ్రీ తాపీ ధర్మారావు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి, శ్రీ బులుసు వేంకటరమణయ్య మున్నగువారిని పేర్కొనవచ్చును. వేదమువారి ఆముక్త్యమాల్యదా శృంగారనైషధముల వ్యాఖ్యానములు, నాగపూడివారి పారిజాతాపహరణకావ్య వ్యాఖ్యానము మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి.

ఉద్గ్రంథములకు విపులవిషయములతో గూడిన పీఠికలు రచించుట యొకకళ. పూర్వగ్రంథములలో కడను కవికి సంబంధించిన విషయములు దొరకుటయే యరుదు. శోధకుల

చరిత్రమాత్రము అత్యుక్తులతోడను, అతిశయోక్తులతోడను కూడి ఉన్నదేదో లేనిదేదో తెలియనంత సందిగ్ధముగా నుండును. కాని నేడట్లుకాదు. కేవలము పీఠిక చదివినంత మాత్రమున గ్రంథమంతయు జదివినప్పుడు కలుగునంతకంటె మిక్కిలిగనే విషయములు తెలియగలవు. పీఠికాకారులలో సుప్రసిద్ధులు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి మున్నగువారు. వారి ఆముక్తమాల్యదా శృంగార నైషధ పీఠికలు అసమానము లైనవి. ఒక్కొక్కటి ఒక్కొక్క స్వతంత్ర గ్రంథముగా పరిగణింపబడదగినది. శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యుల భాస్కర రామాయణ పీఠిక, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య భాగవతపురాణ పీఠిక. శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యాన పీఠికలు, శ్రీ శేషాద్రి శర్మ హంసవింశత్యాది గ్రంథపీఠికలు, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి హరవిలాస, బసవపురాణ సుగ్రీవవిజయ క్రీడాభి రామ పీఠికలు, శ్రీ చిలుకూరి నారాయణరావు పండితారాధ్య చరిత్రపీఠిక, శ్రీ కోరాడ రామకృష్ణయ్య నన్నెచోడ కుమార సంభవ పీఠిక మిక్కిలి శ్రేష్ఠములైనవి.

నేడు తెలుఁగుభాషలో మన దేశచరిత్రము, దేశ నాయకుల చరిత్రము, లేక పరదేశ చరిత్రములు, పరదేశ నాయకుల చరిత్రములు, పరరాజ్యాంగ చరిత్రములు విరివిగా వ్రాయబడుచున్నవి. ప్రపంచములో సభ్యత, ప్రాభవము కల ప్రతిదేశ చరిత్రయు ఇప్పుడు తెలుఁగుభాషలో వ్రాయ బడినదన్న నతిశయోక్తి కాదు. ఇప్పటి పత్రికాసంపాదకులలో చాలమంది పరదేశ వ్యవహారములయందు క్షుణ్ణమైన

పరిచయము కలవారున్నారు. వారిలో శ్రీ నార్ల వేంకటేశ్వర రావు ఒకరు. శ్రీ చిలుకూరి నారాయణరావు, శ్రీ మామిడి పూడి వేంకటరంగయ్య తరువాత పేర్కొనదగినవారు. నార్లవారి 'నేటి రష్యా, పాలస్తీనా' జెక్ రాజ్య విచ్ఛేదం, చిలుకూరివారి, చీనా, జపాను, బర్మా చరిత్రలు ప్రసిద్ధములు. నేటి యువకులైన అభ్యుదయ రచయితలు, శ్రీ గోపీచందు మున్నగువారు, రష్యా, చైనా దేశములకు సంబంధించిన చరిత్రగ్రంథములు విరివిగా వ్రాసియున్నారు.

గద్యగ్రంథములలో నేశాఖవానిని గురించి వ్రాయ దలచినను, ఏరచయితను గురించి వ్రాసినను, ప్రతిదానికొక ప్రత్యేక గ్రంథమగును. కావుననే నేనీప్రకరణములో కేవలము కొందరపేర్లను, వారిప్రయత్నముల స్థూలరూపములను మాత్రమే పేర్కొని వదలవలసి వచ్చినది. సంఖ్యాధిక్యము గుణాధిక్యముతో పొత్తుపడునది కాదు. ఉత్తమములైన రచనలు చిరస్థాయిగా నిలుచునవి వీనిలో కొన్నిమాత్రమే ఉండవచ్చును.

## సాహిత్య విమర్శము

సాహిత్య విమర్శ యొక సున్నితమైనకళ. పాశ్చాత్యు లలో "మాత్యూఆర్నాల్డు" "జాన్సన్" వంటి ప్రముఖులు ఉద్గ్రంథములు రచించియున్నారు. కవి జీవితములు వేరు, సాహిత్య విమర్శ వేరు. కాని తెలుగుభాషలో ప్రారంభ దశలో (శ్రీ) గురుజాడ శ్రీరామమూర్తి పంతులు, శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు కవి జీవితములు రచించుచు, వారి

గ్రంథములపై సాహిత్య విమర్శసైతము తలస్పర్శిగా చేసిరి. శ్రీ వంగూరి సుబ్బారావుకూడ వారినే అనుకరించిరి. కాని ఒక ప్రబంధము నాధారముగా గొనక ప్రత్యేకముగా సాహిత్యవిమర్శ ఉన్నతస్థాయిలో శ్రీ పింగళి లక్ష్మీకాంతము వ్యాసములతో ప్రారంభించిన దనవచ్చును. భారతి, శారద, త్రిలింగ మున్నగు మాస, వార పత్రికలలో సాహిత్య విమర్శ వ్యాసములెన్నియో ప్రకటింపబడినవి. అవి యన్నియు నేదేనొక గ్రంథము నాధారముగా నుంచుకొని, వానిలోని విషయములను విమర్శించుచు వెలువడినవే. మొదట సభలలో గ్రంథములపై విమర్శరూపములైన ఉపన్యాసము లొసగబడుటయు వెనుకవానికే గ్రంథరూపము కలుగుటయు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వతత్త్వ విచారములోని వ్యాసములను జదివిన తెలియగలదు. పింగళి సూరన రచితములైన ప్రభావతీ ప్రద్యుమ్న, కళాపూర్ణోదయములపై శ్రీ రెడ్డిగారి వ్యాసములు ప్రత్యేక గ్రంథరూపమున బ్రకటింపబడినను అవి పై గ్రంథములకు విపులములైన పీఠికలన్నను దప్పుకాదు. ఆ నాటికి వానితో బోల్పదగిన సాహిత్య విమర్శక వ్యాసములు లేవు. అంత స్వతంత్రపద్ధతిలో వ్రాసిన రచనలు అసలే లేవు.) అట్టి రచనలు చేయుటకు గొప్ప ధైర్యము కావలయును. గ్రంథములో కవిచూపిన ప్రజ్ఞను ప్రకరణోచిత సందర్భములలో నెంత పొగడినను విమర్శింపదగు పట్టులు నిర్దాక్షిణ్యముగ నిర్భయముగ ఖండించుట వారి రచనలో ముఖ్యముగా గమనింపదగిన గుణము. కల్పనాసామర్థ్యమున పింగళి సూరనార్యు

నకు వారు ప్రధానస్థానమిచ్చినను ప్రభావతీదేవి అంగ ప్రత్యంగ వర్ణనాదుల సందర్భములు శృగార వర్ణనఘట్టములు మిక్కిలి తుచ్ఛములని నిరసించినారు. మహాభారతమును గూర్చి తిక్కనాదుల రచనలయెడ వారుచూపిన గౌరవ మద్వితీయము. (ఆంగ్లేయుల సరణిలో కళా ప్రధానదృష్టితో కొన్ని గ్రంథముల నాదర్శముగాగొని విమర్శ వ్రాసినవారిలో ప్రథములు, శ్రేష్ఠులు శ్రీ రామలింగారెడ్డియే. తరువాత సామాన్యముగా సాహిత్యవిమర్శ 'మాథ్యూ ఆర్నాల్డు'గారి ననుసరించి చేసినవారిలో శ్రీ పింగళి లక్ష్మీకాంతమే ప్రథములు, శ్రేష్ఠులును. ఇప్పుడు సాహిత్యవిమర్శకు దొరకొనని రచయిత లేడన్న నాశ్చర్యము లేదు. ఒక్కొక్కరును కొద్దియో గొప్పయో చేసినవారే. (చారిత్రక విషయములతో గూడి సమకాలిక పరిస్థితులతో సమన్వయపరచుచు గ్రంథస్థవిషయముల మంచిచెడ్డలను విమర్శించుట యొకపద్ధతి.) గ్రంథమునందలి శైలి, రసము, ఔచితి, భావము మొదలగువానిని తీర్చి దిద్దుటలనుగూర్చి విమర్శించుట యొకపద్ధతి. మొదటిపద్ధతికి జెందిన రచయితలలో శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి, శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులు ప్రధానులు. శ్రీ చిలుకూరి వీరభద్రరావు శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు తమ ఆంధ్రులచరిత్ర, లక్ష్మణరాయవ్యాసావళి మున్నగు గ్రంథములలో నట్టి విషయములనే చర్చించియున్నారు. శ్రీ ప్రభాకరశాస్త్రి శృంగారశ్రీనాథము, తంజాపురాంధ్ర నాయకరాజులచరిత్రయు నట్టివే. శ్రీ కురుగంటి సీతారామ

భట్టాచార్యులవారి తంజాపురాంధ్ర నాయకరాజుల చరిత్రమున గూడ శ్రీ రామభద్రాంబాదుల గ్రంథములను గూర్చిన విపులచర్చయే విశేషముగా గలదు. వీని యన్నిటియందున సాహిత్యదృష్టికంటె కవుల చారిత్రకవిషయజ్ఞానమునందలి నిశ్చితానిశ్చితదృష్టి ప్రధానము. వారి చరిత్రజ్ఞానము నిజమైనదా, అతిశయోక్తులతోడను, అసత్యవిషయముల తోడను గూడినదా యనుట ప్రధానము. శ్రీ ప్రభాకర శాస్త్రి శ్రీ వేదమువారు, శ్రీ కుప్పుస్వామయ్య మాత్రము కవితా శిల్పము, కవిప్రతిభనుగూర్చియు వారి వారి విమర్శలలో పొందుపఱచియున్నారు. తక్కినవారికి కవుల భావనాశక్తి యందుకంటె వస్తువునందెక్కువ శ్రద్ధ.

నేటి యువకులు చేయు సాహిత్యవిమర్శ కేవలము వైయక్తికమేమో అనిపించును. సమకాలికుల రచనలు తీసికొని వానియందలి కవితాశిల్పదృష్టి మాత్రమే ప్రధానముగా పరిగణించుట పరిపాటియైనది. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు రచించిన సారస్వతోపన్యాసములు, ప్రబంధనాయికలు తిలకించినపుడు వానియందలి తీక్ష్ణత, నిశితత్వము తక్కినవారి రచనలలో కాన్పింపవు. ప్రాచీన కావ్యములలోని పాత్రములనే తీసికొని వానిని తీర్చిదిద్దిన రచయితల సామర్థ్యమును పై యిరువురవలె హృదయాహ్లాదకరముగా రచన సాగించినవారు చాల తక్కువగనే దొరకుదురు. శ్రీ పిల్లలమఱ్ఱి హనుమంతరావు వారితరువాత నెన్నదగినవారు. వారి సాహిత్యసంపదలో ప్రాచీనుల, నవ్యుల రచనల విమర్శ మంచిస్థాయిలో సాగినది.

అక్షే వారి సాహిత్య సమీక్ష, సాహిత్య సమాలోచనము, మాధురీమహిమ మున్నగు గ్రంథములును. పరిమాణములో శ్రీ హనుమంతరావు చేసినంత సాహిత్యవిమర్శ మరెవ్వరును చేయలేదనవచ్చును. తెలంగాణాలో సాహితీసమితి మూలమున ప్రకటితములైన గ్రంథములకు పీఠికారూపమున శ్రీ రాయప్రోలువారు ప్రకటించిన సమీక్ష మిక్కిలి శ్రేష్ఠమైనది. శ్రీ కోరాడ రామకృష్ణయ్య సారస్వత వ్యాసములు, శ్రీ దువ్వూరి రామిరెడ్డి సారస్వత వ్యాసములు, శ్రీ రాళ్ళపల్లి వారి నాటక సాహిత్యోపన్యాసములు, శ్రీ పింగళి లక్ష్మీకాంతము గౌతమ వ్యాసములు విమర్శ గ్రంథములుగా శాశ్వతముగా నిలువగలవి. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి సాహిత్యవిషయక వ్యాసములు లెక్కకు మిక్కిలి యున్నవి. శ్రీ జయంతి రామయ్యపంతుల ఆంధ్రవాఙ్మయ వికాసవైఖరి, సారస్వత పరిషత్పత్రికలోని వ్యాసములు, శ్రీ రామలింగారెడ్డి వ్యాసమంజరిలోని వ్యాసములు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి తెలుగు మెఱుగులు, మీగడ తఱకలు, శ్రీ సురవరము ప్రతాపరెడ్డి రామాయణ విశేషములు, శ్రీ జనమంచి శేషాద్రిశర్మ మనుచరిత్ర హృదయావిష్కరణము, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ వ్యాసములు, శ్రీమతులు ఇల్లిందుల సరస్వతీదేవి, నందగిరి ఇందిరాదేవి, కొటికలపూడి సీతమ్మ, పులుగుర్తి లక్ష్మీనరసమాంబ, బాలాంత్రపు శేషమ్మ మున్నగు స్త్రీల రచనలు, శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'ఆంధ్ర కవయిత్రులు' శ్రీ ముట్నూరి సంగమేశము తెలుగు హాస్యము, శ్రీహరి ఆది

శేషువు 'జానపదగేయ విమర్శ' ప్రత్యేక గ్రంథములు. శ్రీ కోరాడ వారి ఆంధ్రభారత కవితావిమర్శనము, శ్రీ భూపతి లక్ష్మీనారాయణరావు, 'మహాభారతము-తిక్కన రచన, ఉత్తమములైన రచనలు. శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్య పాలవెల్లి, శ్రీ తిరుమల రామచంద్ర, శ్రీ విద్వాన్ విశ్వం సమీక్షలు, చక్కని సాహిత్య విమర్శక వ్యాసములు. శ్రీ లక్ష్మీనారాయణరావు 'కిన్నెర' పత్రికలో ప్రకటించిన నాటకకళ పై వ్యాసములు, శ్రీ సి. నారాయణరెడ్డి, శ్రీ దాశరథి సమీక్షలు, శ్రీ శ్రీనివాస చక్రవర్తి-'నాట్యశాల-నటన' మంచి వ్యాసములు. శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం ఆంధ్రుల సాహిత్యచరిత్ర, శ్రీ దివాకర్ల వేంకటావధాని రచనలు, నేటి సాహిత్య విమర్శగ్రంథములుగా నెన్నవచ్చును. పై విమర్శగ్రంథముల తారతమ్య పరీక్ష కిచ్చట తావులేదు. ఉన్నవని వ్రాయుట కేకాని, ఇట్లున్నవని నిరూపించుటకు ప్రత్యేక గ్రంథము కావలసివచ్చును.

కొన్ని సాహిత్య విమర్శక వ్యాసములు భారతి, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికల భానువార సంచికలు మున్నగు వానిలో వెలువడుచున్నవి. ఇప్పు డెక్కువగా వచ్చు విమర్శలు కేవలము కొంద రాధునిక రచయితల గ్రంథములను గూర్చియే యైయున్నవి. విమర్శకు ప్రతివిమర్శలు కూడ వచ్చి వాదములోనికి దిగు సన్నివేశములు లేకపోలేదు. కేవల ప్రాచీనుల రచనలను గూర్చిన భావములు ప్రకటించినపుడే వాదోపవాదములున్నపుడు ఆధునికులను గూర్చి లేకపోవుట యెట్లు పొసగును ? శ్రీ పెండ్యాల వేంకటసుబ్ర

హ్మణ్యశాస్త్రి మహాభారత చరిత్రము, ఉత్తర భారతము, ఎన్ని విమర్శలకు గురికాలేదు? వారికి ప్రతివిమర్శగా శ్రీ సూర్యనారాయణశాస్త్రి బ్రహ్మాండమైనగ్రంథము నొక దానిని వెలువరించిరి. నాచన సోమనాథునిగూర్చి శ్రీ రాళ్ళ పల్లివారి యుపన్యాసముపై శ్రీ నడకుదుటి వీరరాజ పంతులు చేసిన కల్లోలము పెద్ద గ్రంథమైనది. అట్లే శ్రీ తిరుపతి కవుల, శ్రీ శ్రీపాదవారి వాదోపవాదములు గ్రంథములైనవి.

ఆధునికులలో కొందరు రచయితలనుగూర్చి ఈ నడుమ శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి వ్రాసిన వ్యాసములు ముఖ్యముగా చదువదగినవి. మొదటిది కేవలము నేడు భావకవులని పిలువబడు యువకవుల రచనల గూర్చి. రెండవది నేటి యిరువదైదుగురు జీవత్కవుల రచన లను గూర్చి. శ్రీ కాటూరివారి వ్యాసములో ముఖ్యముగా శ్రీ దేవులపల్లివారి కృష్ణపక్షముతో ప్రారంభించి భావ కవులువ్రాయు వ్యక్తి ప్రధాన (Subjective) కవితను గూర్చిన చర్చకలదు. భావకవుల ఆశయములన్నియు నా వ్యాస ములో చూడనగును.

## వ్యా స ము

పై ప్రకరణము లన్నింటిలో సందర్భానుసారముగ వ్యాసమును గూర్చినచర్చ వచ్చినది. శ్రీ వీరేశలింగం పంతులుగారితో ప్రారంభించి వ్యాసములు మిక్కిలి విరివిగా ప్రచారములోనికి వచ్చినవి. ఆంగ్లభాషలో ఉపవ్యాసము లతో ప్రారంభించి వానినే లిఖితమొనర్చినప్పుడు వ్యాసము

లనుట పరిపాటి. తెలుఁగు నందును శ్రీ వీరేశలింగంపంతులు యుపన్యాసములు ప్రచారమునకై యీయబడినవి. అట్లే కాని కొద్దిమార్పులతోగాని వివేకవర్ధిన్యాదిపత్రికలలో వ్యాసములుగా ప్రకటింపబడుచువచ్చెను. కొన్ని దిన, వార, పక్ష, మాస పత్రికలలో కేవల సాహిత్యముపైననే కాక సమస్తవిషయములపై వ్యాసములు ప్రకటింపబడెను. అవి శాస్త్రవిషయములగూర్చి కావచ్చును, ఆధునికావిష్కరణముల పరిశ్రమలగూర్చి, సహకారాది ఉద్యమములను వివిధ దేశములందలి జనుల యాచార వ్యవహారములంగూర్చి కావచ్చును. ఒకటి యననేల సమస్తవిషయములనుగూర్చి నేడు వ్యాసములు పత్రికలలోను, కళాశాలాది విద్యాలయముల ద్వారమున ప్రకటింపబడు 'మాగజిన్' అను వార్షికపత్రికలందును వ్యాసములు ప్రకటింపబడుచున్నవి. సాహిత్య వ్యాసములు, సారస్వతవ్యాసములు, చారిత్రక వ్యాసములు మున్నగు పేర్లతో వ్యాససంపుటములు లెక్కకు మిక్కిలిగా బయలుదేరినవి. వీనిలో పెక్కింటిని గూర్చి వానివానికర్తలంగూర్చి యిదివరకే చర్చించియున్నాను.

## నవలలు — కథానికలు

కథాసాహిత్యము తెలుగుభాషలో చిరకాలమునుండి వ్యాప్తిలో నున్నది. హిందీ, బెంగాలీ, కన్నడ భాషలలో మరియు పూర్వమునుండియు కలదు. పెద్ద కథలు చిన్న కథలు అని కథాసాహిత్యము రెండువిధములు. వానిలో

ప్రాచీనపద్ధతితోకూడి అనువాదప్రాయములైనవి కొన్ని. కథాసరిత్సాగరము, విక్రమార్కుని కథలు, భోజుని కథలు, దశకుమారుల కథలు మున్నగునవి కేవలానువాదప్రాయములు. మదనకామరాజు కథలు, మర్యాదరామన్న కథలు, తాతాచార్యుల కథలు, శుకసప్తతికథలు చిరకాలమునుండి స్వతంత్రరచనలుగా వ్యాప్తిలో నున్నవి. తెలుఁగు భాషలో అనుకరణమను లోపమునకు గురికాకుండ పెరిగిన కథాసాహిత్యము శ్రీ మధిర సుబ్బన్న దీక్షితుల 'కాశీమజిలీ కథ'లతో ప్రారంభించిన దనవచ్చును. ఆ వెనుకనే నవలలు, చిన్నకథలు (కథానికలు) బయలుదేరినవి. శ్రీ వీరేశలింగం పంతులు ఆంగ్లేయుల ననుకరించి రాజశేఖర చరిత్రము వ్రాసిరి. షేక్స్పియరు నాటక కథలనే తెలుగువచనములో కథలుగా వ్రాసిరి. ఆ వెనుక సంస్కృత నాటక కథలు మున్నగునవి శ్రీ అక్కిరాజు ఉమాకాంతం ప్రభృతులు వ్రాసి ప్రచారమునకు దెచ్చిరి. కాని పై కథా సాహిత్యమంతయు ఆదర్శ వాఙ్మయము - లేక అత్యుక్తులతో, అపురూపపు కల్పనలతో గూడిన వాఙ్మయము - అగునే కాని నిత్యజీవిత వృత్తమునకు ప్రతికృతిగా నుండదు. ఇరువదియేండ్ల ముందు వరకు బయలుదేరిన నవలా సాహిత్యమంతయు నట్టిదే. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము కర్పూరమంజరి, సౌందర్యతిలక, అహల్యాబాయి, హేమలత మున్నగునవన్నియు నట్టివే. వారి రామచంద్ర విజయము మాత్రమే వాస్తవికము (Realistic). బంగాళీభాషానువాదమైన సుధాశరచ్చంద్రము మిక్కిలి యద్భుత రచనాకౌశలముగల వాస్తవేతివృత్తము,

శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి రాయచూరు యుద్ధము, రాజ్యలక్ష్మి, పూర్ణానందము మున్నగునవన్నియు శ్రేష్ఠమైన కల్పనాచాతుర్యము గలవి. అన్నివిధములైన పోకడలు కల నవలలు శ్రీ వేంకట పార్వతీశ్వర కవులవి. వారి వసుమతీ వసంతము, ప్రమదావనము, తిరుగుడుపెళ్ళి సర్వస్వతంత్ర ములు. పెక్కు నవలలు బంగాలీ, కన్నడ, ఆంగ్లభాషలనుండి అనువదింపబడినవి. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ నవలలు సర్వతోముఖ ప్రజ్ఞ కనపరచునవి. పై నవల లన్నియు ఆదర్శ జీవితము కొఱకే కాని సంస్కరణోద్దేశముతో రచింపబడి నవికావు. శ్రీ ఉన్నవవారి మాలపల్లి, శ్రీ అడివి బాపిరాజు గారి నారాయణరావు, సంఘములోని లోపములను సరి చేయుటకై ఒక ఉద్దేశముతో రచింపబడినవి. కేవలము చదివి యలౌకికమైన రసానుభూతినందుట వాని లక్ష్యము కాదు. వానిని చదివి మన నిత్యజీవిత విధానము మార్చు కొని బాగుపడుటకై యుపయోగించుట లక్ష్యము.

కథానికలనుపేర విరివిగా చిన్నచిన్నకథలు నేడు బయలుదేరుచున్నవి. జనుల నిత్యజీవితములోని యొకా నొక సన్నివేశమును గ్రహించి మనకెదుట జరుగుచునట్లు సృష్టించి పాఠకుల నానందపరచుటయే యీకథల లక్ష్యము. ప్రతివ్యక్తి తనజీవితములోని యనుభవములను కొన్నింటినైన అట్టికథలలో చూడగలడు. అప్పుడే ఆ రచయితల ప్రయత్న ములకు చరితార్థత. అట్టికథలిప్పుడు వేనవేలు బయలు దేరినవి. శ్రీ కవికొండల వేంకటరావు, శ్రీ వేలూరి శివరామ శాస్త్రి, శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి, శ్రీ విశ్వనాథ సత్య

నారాయణ, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, శ్రీ చింతా దీక్షితులు, శ్రీ కిళాంబి రంగాచార్యులు. శ్రీ గుడిపాటి వేంకట చలం, శ్రీ పాలగుమ్మి పద్మరాజు, శ్రీ ఆచార్య ఆత్రేయ, శ్రీ సెట్టి ఈశ్వరరావు, శ్రీ ప్రయాగ కోదండరామశాస్త్రి, శ్రీ మాదవపెద్ది గోపాలకృష్ణ, శ్రీ మాచిరాజు దేవీప్రసాద్, శ్రీ మునిమాణిక్యం నరసింహారావు, శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీ బొడ్డు బాపిరాజు, శ్రీ మల్లాది రామ కృష్ణశాస్త్రి, శ్రీ విద్వాన్ విశ్వం, శ్రీ శివరాజు వేంకటసుబ్బా రావు (బుచ్చిబాబు), శ్రీ భాగవతుల శంకరశాస్త్రి, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, శ్రీ అవసరాల సూర్యారావు, శ్రీ ఇంద్ర కంటి హనుమచ్ఛాస్త్రి, శ్రీ శారద, శ్రీ మధురాంతకం రాజారాం, మున్నగువారు కథానికా రచయితలలో ప్రసి ద్ధులు. ఆంగ్లవాఙ్మయ ప్రభావమున అపరాధ పరిశోధకకథలు, నవలలు వందలు వేలుగా నేడు వ్యాప్తిలో నున్నవి. వీనిని రచించువారిలో ముఖ్యులు శ్రీ కొమ్మూరి సాంబశివరావు, శ్రీ కనకమేడల, శ్రీ టెంపోరావు, శ్రీ జొన్నలగడ్డ రాధాకృ ష్ణయ్య, శ్రీ విశ్వప్రసాద్ మున్నగువారు.

కథానికలనుగూర్చి విపులముగా చర్చించుటసాధ్యము కాదు. ఇప్పటి కథలన్నియు వాస్తవికత * నాధారముగా పెట్టుకొని వ్రాయబడినవే. వీనిలో ఆదర్శము ప్రధానము కాదు. ఇతివృత్తము, నాయికానాయకుల విషయమున, అధి కారికము, కులీనత మొదలగు శాస్త్ర నియమములు పాటింప నక్కరలేదు. సంఘములో మనకళ్ళయెదుట జరుగుచున్న,

* కథావస్తువుకాదు — సత్యదృష్టి.

జరిగిన, జరుగబోవు సంఘటనలను యథాతథముగా వర్ణించుటయే సామాన్యముగ నన్నికథలలో పాటింపబడు నియమము. సత్యముగా జరిగినవిషయము కాకున్నను, జరిగియుండునని నమ్ముటలో నెట్టి విప్రతిపత్తియు నుండకూడని విధమున వస్తువువర్ణింపబడుట ముఖ్యము. అది ప్రేమగాధ కానిండు, కరుణగాధ కానిండు, మనస్తత్వ సంబంధమైనది కానిండు నమ్మదగినట్లుండునే కాని అభూతకల్పనలతో, అలౌకిక వర్ణనములతో గూడియుండదు. కొన్ని కథలలో సాంఘికములైన జటిల సమస్యల పరిష్కారమో, తత్ప్రయత్నమో గోచరించును. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథలలో మనస్తత్వ సంబంధములైనవి, కుటుంబగతములైనవి పెక్కు సమస్యలతోగూడిన సన్నివేశములుండును. కులంలేనిమనిషి, మొండివాడు మున్నగు కథలట్టివి. శ్రీ గుడిపాటి వేంకటచలం రచనలు కేవల స్త్రీ విషయకములు.

శ్రీ చలం కథలలో నొక ప్రత్యేకత యున్నది. స్త్రీ సంఘములో బానిసకాదని, కేవల విలాసవస్తువు కాదని, పురుషుల కెట్టిస్థానముకలదో వారికి నట్టిస్థానమే కలదని యతని కథలలో ప్రతిపాద్యవస్తువు. వారు కల్పించు సన్నివేశములు ప్రాచీనకాలమునుండి స్త్రీలయెడ మనకుగల భావములలో నొక గొప్ప విప్లవాత్మకమైన మార్పు తే ప్రయత్నించునవి. కాని సంఘము అంతతొందరగా వారి నర్థముచేసికొనలేదు. ఐనను వారి ప్రయత్నము విఘ్నభీతిలేక సాగినది. వారి "స్త్రీ" అను గ్రంథము, 'బ్రాహ్మణీకము' మొదలైన కథలు, శశిరేఖ, మైదానము వంటి నవలలు చదివినప్పుడు

మన హృదయములలో నొక విపరీత సంచలనము బయలు దేరును. పురుషునకు కామసంబంధమైన కోరికలు తీర్చుకొను హక్కును సంఘము గుర్తించినప్పుడు స్త్రీల విషయమున నెందుకు గుర్తింపరాదనియు, అన్ని విషయములలో మగవారి వలె వారికి స్వేచ్ఛ యెందు కుండకూడదనియు భావించి, తదనుగుణమైన సన్నివేశములనే వారు స్త్రీలకు తన కథలలో కల్పించిరి. లోకము వారి ధైర్యమును మెచ్చుకొన్నంతగా వారి రచనలను మెచ్చుకొనుటకు కొంత కాలము కావలెను. ఏనాటికైనను వారి భావములను ప్రజ లంగీకరింపక తప్పని దినములు రాగలవని యాశింప వచ్చును. వారి రచనలతో బోల్పదగిన విశిష్టరచన మరి యెవ్వరిది కన్పించుట లేదు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కథలు, నవలలు కేవల విజ్ఞాన సర్వస్వముతో సమానములైనవి. వారి వేయిపడగలు అను గ్రంథమున సర్వవిషయములు చూడవచ్చును. "జేబు దొంగల"లో బాల్యములో వచ్చిన గుణములు మరణాంతము వీడవను సత్యమును నిరూపించిరి. వారి చెలియలికట్ట, ఏకవీర, వీరవల్లడు, బద్దన్నసేనాని, మా బాబు ఏదేనొక ఆదర్శమును మనమున నుంచుకొని వ్రాసిన నవలలే. వీనిలో వివిధ మానవుల మనఃప్రవృత్తులు బాగుగ విశదీకరింపబడినవి.

శ్రీ చింతాదీక్షితుల కథలు చిన్నపిల్లల మనస్తత్త్వ మును వెల్లడించునవి. సూరి, సీత, శంపాలత, లీలాసుందరి మొదలైన కథలు కేవలము పిల్లలకొఱకే వ్రాయబడినవి. వీరి కథలు హిందీ, ఇంగ్లీషు భాషలలోనికికూడ కొన్ని అను

వదింపబడినవి. వీరికి సుస్మితమైన హాస్యమునందు ప్రీతి మెండు. వీరివలెనే శ్రీ గిడుగు సీతాపతి చిన్నపిల్లల కొరకే కథలు వ్రాసినవారు. వీరి "బాలానందము" ప్రభుత్వము వారి బహుమానమునైతే మందుకొన్నది. శ్రీ పూతలపట్టు శ్రీరాములు రెడ్డి సుజ్ఞానబోధినిలోని కథలు నిట్టివే.

శ్రీ శివరాజు వేంకటసుబ్బారావు "బుచ్చిబాబు" అను సంక్షిప్తనామముతో 'బుచ్చిబాబు కథలు,' మేడమెట్లు, 'అడవి కాచిన వెన్నెల' మున్నగు కథలు, "చివరకు మిగిలేది" అను ప్రసిద్ధమైన నవల రచించిరి. వారి నవల చిరస్థాయిగా నిలుచు రచనయని చెప్పవచ్చును.

హాస్యరసముతో కూడిన కథలు వ్రాయుటలో అందె వేసిన చేతులు శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి, శ్రీ ముని మాణిక్యం నరసింహారావు. శ్రీ మాచిరాజు దేవీప్రసాదు, శ్రీ నరసింహశాస్త్రి 'బారిష్టరు పార్వతీశం' చదువని ఆంధ్రు డుండడని నా నమ్మకము. ఈ నవలలో వారి హాస్యరసము పరాకాష్ఠ నందుకొన్నది. అట్లే వారి "కన్నవీ-విన్నవీ" అన్న హాస్యకథలు, శ్రీ నరసింహారావు 'కాంతం కథలు,' 'నేనూ-మా కాంతం' హాస్య కథలు, 'కాంతం కాపురం' అన్నియును హాస్యరసము పోషించు కథలే. గొప్ప గొప్ప జీవిత సమస్యలకు సంబంధించిన కథలుకూడ చక్కని హాస్య ధోరణిలో నడపుసామర్థ్యము వారికి కలదు. 'హాస్యము' అను శీర్షికతో వారురచించిన వ్యాసము చదివిన హాస్య రసముపై వారికెంత యధికారము కలదో తెలియగలదు. శ్రీ దేవీప్రసాదు 'తాతవిరహం" 'కాగితాల పొదుపు', 'పండుగ బహుమతులు' కూడ హాస్యరసపోషకములే.

'శారద' అను మారుపేరుతో శ్రీ 'నటరాజన్' వ్రాసిన ఏదిసత్యం, రక్తజ్వాల, మంచి చెడూ మున్నగు నవలలు, కొన్ని కథలు, వారికి చిరంజీవిత్వము నిచ్చినవి. వారు అల్పాయుష్కులైనను వారి రచనలు చిరకాలముండునవి యని చెప్పవచ్చును. "ఏది సత్యం" ఒక దీనురాలి హృదయవిదారక సత్యగాథ. 'మంచీ-చెడూ' ఒకానొక ఆదర్శముతో వ్రాసినను, అందరకు అంగీకారయోగ్యమైన ఆదర్శ మందులో కాన్పింపదని నా తలపు.

శ్రీ పాలగుమ్మి పద్మరాజు "గాలివాన" ఈ నడుమనే బహుమతి నందుకొన్నది. శ్రీ కవికొండల వెంకటరావు కథానికలుకూడ శాశ్వతమైన యశస్సును సంపాదించినవి.

ఇప్పుడు "డిటెక్టివు" కథాసాహిత్యము ఆంధ్రదేశములో నలుమూలల నీటిలో తైలమువలె వ్యాపించినది. ఆబాలగోపాలము, పండితపామరులందరు రేయుంబవళ్ళు వివశులై యా కథానికలే చదువుచున్నారు. ఆ లేచినయల యెప్పు డడగునో చెప్పలేము.

## ఉ ప సం హా ర ము

గద్యసాహిత్యశాఖలో చేరిన రచనలు మఱియు పెక్కులు కలవు. గద్యనాటికలన్నియు నట్టివే. ప్రజాసాహిత్యమనుపేర కర్షకులకు, కార్మికులకు ప్రబోధము కల్పించుటకు నేడు ప్రత్యేక పద్ధతిలో గద్యరచన జరుగుచున్నది. ప్రాత కాలములోవలె నేడు సంగీతమున్ననే నాటక మను భావము పోయినది. శ్రీ బళ్ళారి రామకృష్ణమాచార్యులవారితో

ప్రారంభించిన యీ భావము మొన్న మొన్నటిదనుక నాటక రంగము నాక్రమించియుండెను. నాలుగు పద్యములు, పాటలు శ్రావ్యముగా వల్లింపగలవారున్న నాట్యమండలికి గౌరవము, అభినయమునకంటె, పాత్రోచిత భావప్రకటన మునకంటె గానము ముఖ్యమయ్యెను. శ్రీ బళ్ళారి రాఘవాచార్యులవారి ప్రభావమువలన నాట్యరంగములో నొక విప్లవాత్మకమైన మార్పువచ్చి అభినయమునకే ప్రాధాన్యము వచ్చినది. దానిననుసరించియే గద్యనాటకములు విరివిగా ప్రచారములోనికి వచ్చినవి. కాబట్టియే నా వ్యాసమున వానిని నే నచ్చటచ్చట ఉదాహరించితిని. ఇప్పుడు వ్రాయబడు నాటికలు విధిగా గద్యములోనే ఉన్నవి. వానిని గురించి వ్రాయుట కొక ప్రత్యేకగ్రంథమే అవసరము. ఆ ప్రయత్నము ఇతరులకు వదలుచున్నాను. గద్యరచన నేను పైనవర్ణించిన శాఖలతో ఆగునని చెప్పుటకు వీలులేదు. ఇరువదియవ శతాబ్ద ప్రారంభమునుండి సర్వతోముఖముగా వ్యాపించిన గద్యము ఇంకెన్ని నూత్నశాఖలు సృష్టింపవలసియున్నదో మనము కనిపెట్టి చూడవలసినదేకాని యూహింపలేము.

ఏ శాఖనుగూర్చికూడ నేను విపులముగా చర్చింపలేనందుకు నన్ను పాఠకులు క్షమింతురుగాక. ఒక గ్రంథకర్త పెక్కు గ్రంథములు వ్రాసియున్నప్పుడు కేవలము గ్రంథకర్తలపేర్లుమాత్రమే ఇచ్చి తృప్తిపడవలసివచ్చినది. పుస్తకముల సంఖ్య పరిమితమైనప్పుడు వాని పట్టికయే సూచించియున్నాను. ఇంతకంటె ఎక్కువ ప్రయత్నము చేయుటకు నాకు వీలుపడలేదు.

# నవ్యకవిత్వం

## విద్వాన్ విశ్వం

## ప్రస్తావన

మానవుడు చిరంతనుడూ, చిరంజీవీ; అలాగే సమాజమూ చిరంతనమూ, చిరంజీవమూ; అల్లాగే కవిత్వమూ.

అయినప్పటికీ ఆదికాలంలోని మానవుడలాగే ఉండిపోలేదు. సమాజం ఆదిరూపంలోనే నిలిచిపోలేదు. కవిత్వం తొలిరీతినే ప్రవర్తిల్లలేదు.

కొన్ని మూలధర్మాలు శాశ్వతంగా ఉండిపోయినా కొన్ని విభిన్నతలూ, విశిష్టతలూ ఎప్పటికప్పుడు ఏర్పడుతూనే ఉన్నవి. ఆ విశిష్టతలను పురస్కరించుకొని మానవ ప్రగతినీ, సమాజగతినీ, కవిత్వపరిణతినీ కొన్ని దశలుగా, విదశలుగా విభజించుకొని వివరించుకోనడం మామూలు.

ఈ దశలలో ఒకదాని విశిష్టతలతోపాటు మరొకదాని విభిన్నతలూ కొన్ని తలసూపవచ్చును. ఒకదశలో ఆదశకు చెందిన విభిన్నతలు మాత్రమే ఎల్లెడలా కానరాకపోవచ్చును.

జీవన స్రవంతివలెనే కవితావాహినీ ఒకేరీతిగా ప్రవహిస్తూఉన్నా కొంతపాతనీరు పోవడం, కొత్తనీరు రావడం వీనిద్వారా నిశితంగా పరిశీలిస్తే విపరీతమైన మార్పులకు

తావలమవుతున్నదని తెలుసుకోవచ్చును. కానీ ఎన్ని మార్పులూ, చేర్పులూ, తీర్పులూ జరుగుతున్నా కవితా సామాన్యధర్మాలు అందులో అనుస్యూతములై ఉన్నందు వల్ల నిరంతర పరిణతి ప్రభావితమైన కవితాగతి అఖండంగా కానవస్తుంది.

తెనుగునాట ఏ వెయ్యేండ్లనాడో సమగ్ర సంపూర్ణ రూపంతో విరిసి, నేటికీ నేవళం తేలుతున్న కవిత్వంలో ఆధునికయుగ పరిశీలనే అయినా, అల్పాల్పపరిధిలో అంత సుసాధ్యంకాదు. అందుకే కేవల స్థూలరేఖా చిత్రణకే ఈ అధ్యాయం పరిమితంకాక తప్పదు. కవులనూ, కావ్యాలనూ విడివిడిగా వివరించడంకాక కవిత్వ పరిణతినీ, ప్రగతినీ విశదీకరిస్తూ అందు కవసరమైన కొన్ని ఉదాహరణలతోనే సరిపెట్టుకోనక తప్పదు.

## నవ్యకవిత్వ ప్రాదుర్భావం

ఏజాతి చరిత్రలోనూ ఏటేటా వసంతం విరియదు. ఒకొక్క శకంలో అఖండప్రతిభా సమున్మేషం జాతి జాతినీ సమగ్రంగా, సర్వతోముఖంగా సముత్తేజితంచేసి, నవయుగానికి నాందీవాచక మవుతుంది.

అలాంటి తరుణాన్నే మనం స్వర్ణయుగమనీ, నవయుగమనీ భావిస్తాము. ఎందులోనో ఒకందులో, ఏ కొంతో మార్పువచ్చినప్పుడెల్లా నవశకోదయం అనుకోము. ఏ ఒక

కొత్త ఉద్యమమో ఆరంభమైనప్పుడెల్లా దానిని నవయుగ ప్రాదుర్భావ మని తలంచము.

ఆ మార్పేదో అంతదాకా నడుస్తున్న జీవనగతిని కొత్తదారులలోనికి గబాలున కొంపోయినప్పుడూ, ఆ మార్పు ఏదో ఒకరంగానికి పరిమితం కాక సర్వతోముఖమయినప్పుడూ, ఆ పరిణతి ప్రభావం ఆ నాటికే పర్యాప్తం కాక కొన్నేండ్ల దాకా జాతిప్రగతి పథప్రయాణానికి పాథేయ మివ్వగలిగి నప్పుడూ అదే నవయుగంగా, నవశకంగా సంభావిస్తాము.

తెనుగుజాతి మనుగడనే మాన్యం చేసిన మహోత్తమ కాలంకనుకనే, ఇరవయ్యో శతాబ్ది ఆరంభకాలంలో అటూ ఇటూ ఉన్న సమయాన్ని మన మెంతో అపురూపంగా అంగీక రిస్తున్నాము.

ఆ సమయంలోని సాంస్కృతిక వికాసానికేగాక, సాహిత్యవిస్తృతికీ సంకేతంగా నిలచినవాడు కందుకూరి వీరేశ లింగం పంతులు (1848-1919).

ఆయన నాటికే ఆంధ్ర సాహిత్యంలో కొంత నూతన పునరుజ్జీవనానికి ప్రాతిపదిక ఏర్పడినది. అప్పటికే సర్ సి. పి. బ్రౌనుదొర చక్కని నిఘంటువును తయారుచేసి (1852) ప్రచురించినాడు. అనేక పండితుల సాయంతో ప్రాచీనకావ్యా లను సంపాదించి, పరిష్కరించి టీకలూ, టిప్పణులూ తయారు చేయించినాడు. బహుజనపల్లి సీతారామాచార్యుల వారి (1828-1891) శబ్దరత్నాకరం వెలువడింది.

అప్పటికే పూండ్ల రామకృష్ణయ్య (1860–1904) 1885 జూన్‌లో అముద్రితగ్రంథ చింతామణి ఆరంభించినారు. వావిళ్ళ రామస్వామిశాస్త్రులు 1812 లోనే ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాలను స్థాపించి ప్రాచీన కృతి ప్రచురణకు పూనుకున్నారు.

చిన్నయసూరి బహుముఖ కృషి చేశారు; వేదం వేంకటరాయశాస్త్రి, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావూ మొదలగు వారు నాటకాలనూ, కావ్యాలనూ చకచకా వ్రాసి ప్రచురించ సాగినారు. చిలకమర్తి నాటకరంగం మఱింత వ్యాపింపజేయ పూనుకున్నారు.

ఇలా విరియసాగిన పురాతన ధోరణులనుండి పూర్తిగా విడివడని కావ్యశాఖ తొలిరోజులలో ముమ్మరంగా విరియసాగినది. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, వడ్డాది సుబ్బారాయుడు, వాలికొలను సుబ్బారావువంటి ఉద్దండులు తరువాత చాలకాలందాకా అనేకంగా పూర్వ రీతులలో ఉత్తమ కావ్యాలను ప్రపంచించసాగినారు.

ఈ పూర్వరీతులు నాటినుండి నేటిదాకా అనంతంగా కొనసాగినవి; కొనసాగుతున్నవి. ఇలా పూర్వరీతి ప్రధాన వాహిక అయిన కవితను వివరంగా ఇవ్వడం కాక, నవ్యకవితా పరిణతిని విశదంగా వివరించడం ఈ అధ్యాయం ముఖ్యోద్దేశం గనుక, వీరేశలింగంనుండి అలా అలా ఈ దారిని చాలమంది నడుస్తున్నారని మాత్రం చెప్పి వినివుంటాను.

మఱి ఇలాపూర్వరీతిని మఱొక క్రొత్తదారిని నడపి కవితను పండితుల ప్రక్కనుండి జనమధ్యంలోనికి లాగుకొని వచ్చిన మహామహులు తిరుపతి వెంకటేశ్వరకవులు.

వేమూరు సంస్థానాలలో తిరిగి అనేక అవధానాలను చేయడం మాత్రమేకాక, అపూర్వ ప్రతిభాభాసితములైన మహోత్తమ కావ్యాలను వీరు రచించినారు. వచనంలో సంభాషణలోఉన్న కాకువును, నుడికారాన్ని, తెనుగు సొబగునూ అతిసమర్థంగా, అతినిశితంగా, సులభంగా తీవసాగించిన సౌభాగ్యం వీరి కవితలో తావల మేర్పఱుచుకొన్నది.

తిక్కన తెనుగుతనం వీరిలో వెల్లువలై పారినది. నన్నయ ప్రసన్నధార వీరి కవితలో జల్లుకుఱిసినది. శ్రీనాథుని ధాటి వీరి కవితను సుసంపన్నం చేసినది.

తెనుగు కవితలోని వడుపునూ, వాగ్వైచిత్రినీ కోకొండని కొల్లగా అందించిన దంషిచేయి వీరిది. బుద్ధచరిత మైనా, శ్రవణానందమైనా, అవధాన పద్యాలైనా, ఆవేశంలో ఎదిరి నెదిర్చి కోబలియని దూకుడుగా కత్తిదూసిన వాద వివాద సంవాదరూపాల వెలసిన పద్యజాతమయినా, ఏదైనా తెనుగు వీరిచేతిలో మైనంముద్దలా వేయిరూపుల మలుచు కొనుటకు వీలుకల్పించినది.

నవ్యకవిత్వ వికసనకు వీరు వేసిన ప్రాతపదికను, వీరందుకై కల్పించిన సున్నితమైన వాతావరణాన్ని మన మెంతైనా కొనియాడవచ్చును.

వీరివలెనే తర్వాత తర్వాత వెలసిన జంటకవులెందఱో ఈదారిన నడచినారు. ముఖ్యంగా వెంకట పార్వతీశ్వర కవుల ఏకాంతసేవ, ఆనాటి నూతనభావోద్వేగ పరిబృంహితమై ఒకానొక ధోరణిని వికసింపజేసినది.

ఇలా వీరేశలింగం, తిరుపతి వెంకటకవులు, వెంకట పార్వతీశ్వర కవులు మన నవ్యకవితాలత కొక ప్రచ్ఛాయ శీతల కాయమానప్రాయమైన ఆశ్రయంకల్పించిన అనేకుల ని అరుణోదయ ప్రారంభంలోనే కేల్మోగిచి సంస్మరించి, పూర్తిగా విభిన్నమూ, విశిష్టమూ అయిన నవ్యకవిత్వవివృతికి ఆరంభిస్తాను. స్థూలరేఖా ప్రాయమూ, సుపరిమితమూ అయిన ఈ తెలివిడిలో అందఱి పేళ్ళకూ, అందఱి కావ్యాలకూ ఇకమీదనైనా తావులేదేఅని నాకూబాధగానే ఉన్నా, సంక్షిప్త వివృతిలో అత్యవసరమైన కవితా ప్రగతి పథ పరిణామచిత్రణకే దీనిని పరిమితంచేసుకుంటున్నాను.

అలా అవంతంగా వెలసిన ఆనాటి సమగ్ర సర్వతోముఖ మహావికాసయుగం వేయిరేకుల విప్పారుతుండగానే నవ్యకవిత నాలుగంచులూతీటి నిలిచినది.

1910 లో గురజాడ అప్పారావుగారి ముత్యాల సరాలు ప్రచురితమైనవి. ఆయన నవ్యకవితా వైతాళికుడైనాడు.

# మొన్న - 1910-1935

## (క) జాతీయ కవిత

భారత సంస్కృతి, విభిన్నమైన పాశ్చాత్య సంస్కృతితో సమ్మిళితమై, ఒక విశిష్టనూత్న చైతన్యం వెలువడిన ఆనాడు, ఒకానొక విశిష్టశాఖలో కాక యావజ్జన జీవన హృదయ వికాసంలోనే నవసంచలనం రేకెత్తిన ఆనాడు - ఆ ఉద్యమ మహోదధిలో పూసిన వెన్నెలపూవు గురజాడ అప్పారావు.

నాదేశం, నాజాతి, నాభాష, నాసంఘం అన్నభావం తదుచ్ఛ్రిస్థితికి దోహదకారి అయినప్పు డది మహోత్తమం అవుతుంది. అదేభావం పరభావోన్నతిని చీదరించుకొని, స్వోత్కర్షకూ, పరాపకర్షకూ ప్రాతిపదిక అయినప్పుడు జాతీయ దురహంకారంగా పరిణమిస్తుంది.

ఆభావం ఉత్తమరూపంలో మొలకెత్తిన రోజు లవి. కనుకనే తమ స్వాత్మీయ వికాసవైభవ ప్రాభవాలకు లోకం లోని గొప్పలన్నీ తమలో ఇనుమడ్చుకొని, తాము విశ్వరూపులు కావాలన్న ఉత్కంఠ, ఆనాటి వారిలో తీవరించినది.

సంఘంలోని కులమత వివక్షలు, కుళ్ళిన కంకాళాలై జాతిని రోగపూరితం చేస్తున్నవని, తదనారోగ్య పరిసర సంక్షాళనంకోసం నడుంకట్టిన పెద్దల కానాడు కొదువలేదు.

విజ్ఞాన విస్తృతి కొక పరిధిలేదని గ్రహించి, చుట్టూరా సాగిపోతున్న పరిశోధనల పాటవాన్ని పాటించి, తత్సార

సమాధానంకోసం శతవిధాలా శ్రమించిన పండితకోటి కానాడు లోటులేదు.

కాబట్టి ఆనాటి ఆంధ్రజాతీయ వికాసమహోద్యమం సర్వాంగ సంపూర్ణమూ, సమగ్ర సుందరమూ.

ఆ నాటి సమున్నతి చిహ్నాలన్నీ గురజాడలో మనకు కానవస్తాయి. ఆ నాటి సంస్కారంలోని వైశాల్య విస్తృతు లన్నీ వారిలో సాక్షాత్కరిస్తాయి. ఆయన సహృదయుడు; బహుభాషాకోవిదుడు. విభిన్న భాషా సమధ్యయనం ఆయన సంస్కారానికొక గభీరతను ప్రసాదించినది.

నాటిసమాజంలోని వైపరీత్యాలు పరిశీలించగా ఆయన హృదయం జివుజివ్వుమన్నది; అంతతో ఆగక, తన టపటపతో పదివేలగుండెలను పలుకరించి రసాన్ని చిలుకరించుకున్నది.

సాహిత్యరూపాలను పరశ్శతంగా పరిశీలించిన ఆయన, తన తెనుగులో సరికొత్త రూపాలకోసం పరితపించినాడు. నచ్చిన క్రొత్తరూపులను దిద్దుకొన్నాడు.

తాను వ్రాయదలచుకొన్న భావాలకు తగిన ఛంద స్సును ఎన్నుకొనుటలో ఆయన చాల స్వతంత్రపథాన్ని త్రొక్కినాడు.

కన్నడంలోని ఛందఃపరిణామం తనకు తెలుసు; బెంగాలీ బాణీలను తా నెఱుగు. అంతేకాదు తన దేశంలో తల్లులమొదలు పిల్లలదాకా పాడుకుంటున్న పాటలలోని పట్టువిడుపులు తనకు సుపరిచితములు.

భామినీ షట్పదిఝంకారం ఆయన తలలో ఓ కొత్త మెట్టును గీసిపోయి ఉండవచ్చును.

"మేలుకొను నవనీతచోరక
మేఘసుందర నీలమేచక
మేలుకొనవయ్యా
కృష్ణా
మేలుకొనవే."

వంటి మేలుకొల్పులు తనగుండెలలో ఒక కొత్తరీతిని మేల్కొల్పి ఉండవచ్చును.

తత్ఫలితంగా ముత్యాలసరం ముప్పేటతో మురువు సూపినది.

అంతదాకా వస్తున్న ప్రబంధధోరణిలో కాక, ముక్తకాలూ నీతిశతకాలూ వలెకాక తననాటి జనం ఒక గుక్కలో పాడగా విని ఆనందించాలి; తద్వారా ఆ భావం వారి మనసును కదిపి ఒకానొక ఆర్ద్రతను ఉద్బుద్ధం చేయాలి– అన్నదే ఆయన ఆశయం కావచ్చును.

ఆనాటి అవసరం–జాతిలో ఆత్మవిశ్వాసకల్పన; పరస్పర ప్రేమప్రతిపాదన. ఆ ప్రేమ కేవలం ప్రియురాలికి పరిమితం కాని విశ్వజనీనం కావాలి.

ఈ విశ్వమానవప్రేమ విడుగుతూ, విప్పారుతూ జనతను కార్యప్రవణం చేయునదిగా కవితను ప్రేరేచినది. ఈ ప్రేమే తర్వాత చాలకాలందాకా అనేకరీతులలో సాహిత్యాన్ని ఉద్దీప్తం చేసినది.

ఆయన వ్రాసిన ఖండికలలో 'దేశమును ప్రేమించుమన్నా' అని ఆరంభమైన గీతం, నాడు దేశంలో రావలసిన మార్పులనూ, కూర్పులనూ వరుసబెట్టి చెప్పినది.

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్.

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయ్
తిండికలిగితె కండగలదోయ్
కండగలవాడేను మనిషోయ్.

యీసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయ్
జల్దుకొని కళలెల్ల నేర్చుకు
దేశిసరుకులు నించవోయ్.

... ... ...

వెనుకచూసిన కార్యమేమోయ్
మంచిగతమున కొంచెమేనోయ్
మందగించక ముందుకడుగేయ్
వెనుకపడితే వెనుకెనోయ్.

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయ్
కత్తివైరం కాల్చవోయ్.

దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయ్
పూనియేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయ్.

... ... ... ...

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువారికి తోడుపడవోయ్
దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్.

... ... ... ...

మతం వేరైతేను యేమోయ్
మనసులొకటై మనుషులుంటే
జాతమన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయ్.

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరులచమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.

ఆకులందున అణగిమణగీ
కవితకోయిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్."

ఇందులోని దేశాన్ని ప్రేమించాలనీ, ఆ దేశం మట్టి
'మ మనుషులనీ. మతకుల ద్వేషాలు తగ్గపెసి, ఏకీభావం

జాతిని అభివృద్ధిపరుస్తుందనీ, కవితతో దేశాభిమానం మొలకెత్తవలెనని ఉన్న భావాలన్నీ, పూర్తిగా ఈ యుగపద్ధతిని వేరుపరుస్తూ ఉన్నవి.

ఇట ప్రేమ కేవలం పాతఅర్థంలోనే కాక మరింత ఉదాత్తమూ, ఉన్నతమూ, గభీరమూ, గహనమూ అయిన అర్థంలో ఉపయుక్తమైనది. ఈ విషయంలో గురజాడ భావాన్ని వ్యక్తీకరించే ఆయన లేఖాభాగం చూడండి :

"...మనం మూర్తీభవింపచేయవలసిన
ప్రేమ విశ్వమానవప్రేమ. సాటి మాన
వుణ్ణి, తోటిమానవుణ్ణి హృదయ
మిచ్చిప్రేమించు, నిజమైన ఆరాధించ
తగిన ప్రేమయేది ? తన యుగంలోవున్న
అవధులలోనే-ఏసుక్రీస్తుయేది
బోధించాడనుకున్నామో, దేన్ని
కలావిలాసమని, దేన్ని కవితా
సత్యమని షెల్లీ ప్రవచించాడో -
ఇదఉత్తమమైన రాజమార్గమని,
ఆశయమని, ఆదర్శమని దేన్ని
బుద్ధుడు మనకు ఉపదేశించాడో
అదే నిజమైన ఉన్నతమైనప్రేమ
ఒకమానవునిమీద యింకొక
మానవునకు వుండవలసినప్రేమ!
మానవజాతిపై మనకుగలప్రేమ"

(వొంగోలుముని సుబ్రహ్మణ్యంగారికి గురజాడ ఉదక మండలంనుంచి 21-5-1909 లో వ్రాసిన లేఖాభాగం.)

"మానవుని ప్రేమించడమనేది అతిసాధారణమైన మామూలు జీవితసూత్రం."

(వారికే గురజాడ 2-6-1909 న వ్రాసిన లేఖలోని భాగం)

ఈ ప్రేమే ఆయన కవిత్వ నూతనతా ప్రవృత్తికి మూలం. ఈ ప్రేమే ఆయన మిగత ఖండికలలో అనేక రూపాలతో కానవస్తుంది.

"...ప్రేమ పెంచక పెరుగునే.
ప్రేమ పెన్నిధి గాని యింటను
నేర్పరీ కళ ఒజ్జలెవ్వరు
...నేను నేర్చితి భాగ్యవశమున
కవుల కృపగని..."

"మలిన వృత్తులు మాలవారని
కులము వేర్చిన బలియురొక దే
శమున కొందరి వెలికి ద్రోసిరి
మలినమే మాల.

... ... ...

మలినదేహుల మాలలనుచును,
మలినచిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణధర్మ ము
ధర్మ ధర్మంబే"
(లవణరాజు కల)

'కన్యక'లోనూ ఈ మానవప్రేమే దోబూచులాడు తుంది. 'పూర్ణిమ'లోనూ,

"మేలిమి బంగరు మెలతల్లారా
కలువలకన్నుల కన్నెల్లారా
తల్లులగన్నా పిల్లల్లారా
విన్నారమ్మా యీ కథను"

అంటూ కాసులకులోనై తలిదండ్రులు పూర్ణమ్మను ముదుసలికి ముడివేసిరని వివరించే ఈ కథ కరుణాస్రవంతి.

ఇలా కొనసాగిన ఈ కవితాభాగంలో అనుస్యూతంగా ఉన్న లక్షణాలివి: 1. చిన్న చిన్న వృత్తములే కాని పెద్ద కథలు తీసుకొనక ఖండికలుగా వ్రాయుట. 2. ముందున్న వృత్తాలేకాక, జాతులనూ వదలి అంతవఱకు ఉన్న జానపద గీత చ్ఛాయలో కన్నడంలోని షట్పది. 'పార్శీలోని ఒకవిధ మైన గజల్' కలయికతో ఒక నిరాడంబరమైన రీతిని స్వీకరించుట. 3. వస్తువు నాటి సమస్యలే అగుట. 4. పదాల జిగి బిగీ కాక, శయ్యలోని నగిషీ కాక, సౌలభ్య సాకల్యాలకు తావిచ్చుట. 5. అన్నిటా జాతీయతాభావం ముమ్మరంగా ఉండుట.

ఈ లక్షణాలలో చాలా, జాతీయ వైతాళికుల లందఱి లోనూ తర్వాత తర్వాత ఎంతో కొంత కానవస్తాయి.

ఆనాడు 1913 నుండీ తీవ్రతర మవుతూవచ్చిన రాష్ట్రో ద్యమం, జాతీయకవితా పరస్పరపరిబృంహితాలై చాల

కాలం నెగడినవి. భారతజాతి కాక ఆంధ్రజాతిగా మేలు కొలుపులు పాడిన కవులు మనలో ఎక్కువగుట ఒకవిశేషం.

కవిత్వ విభాగం దృష్ట్యా సులభమని ఇక్కడే రాయప్రోలు మొదలగువారు వ్రాసిన ఈ కవితా విభాగాన్ని ఇక్కడే పరిశీలింతాము.

రాయప్రోలు సుబ్బారావుగారు ఆ సమయంలోనే అవే మహోన్నత భావాలతోనే అంశగానూ సంచలితులైనవారే. ఆ నిర్మమ నిరామయ విశ్వజనీన ప్రేమే వారిచే పలికించినది. కానీ దారి వేఱు.

నాడు నాడునా మార్మ్రోగిన వారి జాతీయగీతం ఆత్మ విశ్వాసాన్నియిలా ప్రబోధించినది.

"ఏదేశ మేగినా ఎందుకాలిడిన
ఏ పీఠ మెక్కినా ఎవ రెదురయిన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగర్వమ్ము.
లేదురా యిటువంటి భూదేవి యెందు
లేరురా మనవంటి ధీరులింకెందు!
అవమానమేలరా అనుమానమేల
భరతపుత్రుడ నంచు భక్తితో బలుక."

ఆంధ్రజాతి చిరప్రతిష్ఠను పునఃప్రతిష్ఠించవలెనన్న ఉద్వేగం ఆయనను పలికించినతీరు అదొక మోస్తరు:

"కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు;
ఇంటింట దేశసాహిత్య దీపములతో
నాంధ్రతేజమ్ము రాపాడునాడు;

సుకుమార శిల్పవస్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాడు;
సమరసేనావ్యూహ జయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాడు-

చూచి, సంతోషమున తలలూచి, గర్వ
మాచి, ఆంధ్రపుత్రీపుత్రు లందగలరు
శాంతి; అందాక లేదు విశ్రాంతి మనకు
కంకణ విసర్జనల కిది కాలమగునె."

పూర్వౌన్నత్యం వివరించేతీరులో ఈయన కం
కొత్త సోయగాలను కూడగట్టుకున్నది.

"గడ్డపాఱలు గోరుకాడలవలె మళ్ళ
వేసినారట కొండవీటిరెడ్లు;
తెలికాన్నరాసుల తీరున నల్లకొం
డలు చీల్చినారు పల్నాటిగండ్లు;
శివుడు గంగనుబోలె చెరువుగండి ప్రవాహ
మాపినా రద్దంకి కాపుమగలు;
వాటెదేసి శిలాకవాటముల్ గ్రుద్దుల
గదపినారట తెలంగాణభటులు

అట్టి బలభద్రు లీభూమి పుట్టినారు
విజయకన్యక వీరగోరజము బూయు
పులికడుపు చలిచీమల పుట్టయయ్యె
చూడవోయి ప్రాల్మాలికల్ వీడి ఆంధ్ర!"

ఆయన మఱొకపద్యం అంతరప్రేరణను వెల్లడిస్తుంది :

"పరిణతవాక్కు అన్న దన
పద్యకళా కవితాపితామహుల్
స్థిరముగ నిచ్చి రీతెలుగు
దీయనిమాన్యము; నిందునూత్న వ
ల్లరులును, కొత్తయంట్లును ఫ
లద్రుమజాతుల నాటి పెంతు, సం
బరమున నేఁ; వనప్రియలు
మంచెలపై సెలుగెత్తి పాడగా."

అట్లే అబ్బూరి రామకృష్ణరావుగారు

"పారెడు కాల్వలచెంత పీచెడుగాడ్పులు వినుచు
నీయుదాత్త లలాటరేఖ పులకలుచూప కన్గొనుచు
త్వత్కాయమానమ్ములై
శ్యామాయమానమ్ములై
దవ్వులనున్న వెదుళ్ళుకలిసి కంఠమునెత్తి పాడె
తల్లి, నీ యొడిలోన నడగి యల్లరిలేక విన్నాడ
ధవళ యశోవతీ
స్నిగ్ధ తేజోవతీ."

అని పృథ్వీప్రశంస చేసినారు.

"అజ్జామనోహారి లావణ్యమూర్తి
తేజోరుణాక్షి సందీప్త పాంచాలి
కనుల క్రొమ్మెఱుపులు
కనుబొమ విఱుపులు."

తిక్కన పల్కులలో కలవని జాతీయకవితను మలుచు కొన్నారు.

గబగబా తీవెసాగిన ఈ కవితాశాఖ అనంతంగా కొనసాగినది. విశ్వనాథ వారి కవిత పూచిన జాతీయ కుసుమాలు చాలా :

"ఇమ్మగ గాకతీయమ్ము క్రింద
శివఋతం గల యాంధ్ర పూర్వ రా
జ్యమ్ముల పేరు సెప్పిన హృ
దంతర మేలా చలించిపోవు, సా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పు
రాభవ నిర్ణయ మెన్ని యెన్ని జ
న్మమ్ములుగాగ నీ తనువు
నన్ ప్రవహించునో యాంధ్రరక్తముల్."
"అస్మదజ్ఞాత పూర్వ దివ్యత్వ మొప్ప
నీ పునీతావనీఖండ, మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్ను గంపింపజేయుచున్నది భృశమ్ము"

అన్న ఆయన ఉద్వేగం, ఆనాడు తెనుగునేల నాలుగు చెఱగులనూ కంపింపజేసినది.

"ప్రొద్దుపొడుపున నీ పాదపూజకొఱకు
కవిని తెచ్చితి దోసిట గన్నెపూలు;
జలివితర్దిక నిరతంబు వెలుగునటుల
హృదయపు సుగంధదీప మర్పింతు గొనుము."

అన్న దువ్వూరి రామిరెడ్డిగారిభావం నాడు తెనుగుకవుల గుండెలను గుత్తగొన్నది.

"మను గంగాలహరీ తరంగవితతుల్
భోరొట్టు స్వాతంత్ర్య గా
న నినాదమ్ములు సేదు, త్వత్ప్రియ సుతా
నంబాత్మ వీణారవ
మ్మాన సమ్మేళనమంది, నాగరకతా
పూర్ణత్వ సంధాన నూ
త్న నినాదంబయి మిన్నుముట్టె జననీ
తల్పంబు వేడిగ్గవే"

అని ఆయన చిన్ననాట (1916–18) నే మాతృ ప్రబోధం చేశారు.

మహోద్దండ కవితా విమర్శకులుగానూ, ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ పండితులుగానూ తెనుగు బండ గుండెలు కొన్నిట నిండురాసికర్యం నిలువులకెత్తించగల్గిన అఖండులు అయిన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారి ముసలమ్మమరణ మనే ఖండకావ్యం దేశంకోసం, నీతోడి వారికోసం నిర్మమంగా, నిరాడంబరంగా అసువుల నొడ్డగల ఉదాత్త జానపద మధురహృదయం పైనున్న మబ్బుతెఱను తొలగించి, జాతీయతాభావ ప్రేరకమై, సహృదయులను సంతృప్తి పఱచినది. వారినిశితవిమర్శల గభీరతా గౌరవం ముమ్మరమై వారిని ప్రముఖ విమర్శకునిగా ప్రచురపఱచినది. అందుతో వారి కవిత కంత ప్రాచుర్యం రాలేదు. అంతేకాని, రసధుని వారి కవిత అని అందఱూ ఎఱుగుదురు.

అట్లే నేటికీ వేళ్ళపై లెక్కింపదగిన తెనుగు విమర్శకు లలో తొలితల నిల్చికున్న రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు

పెనుకొండ నొక జాతీయభావాలూరే పెనుగొండగా తీర్చి పాడినపాట ఈ జాతీయకవితలో మెఱుగులు చిమ్మునది.

"చనిన నాళుల తెనుగుకత్తుల
పానబట్టిన బండ మా
పెనుకొండ కొండ"

... ... ... ... ...

వెఱవెఱుంగని బిరుదు నడకల
విజయనగరపు రాచకొడుకులు
ఒలకబోయగ కఱుడుగట్టిన
పచ్చినెత్తురుకండ మా
పెనుకొండ కొండ"

"నిరుపమ ద్రాక్షారసంబులు, నిండి తొలకెడుకుండ" ఆ పెనుకొండ కొండలోని గభీరతాముద్ర ఇందులో సుస్నిగ్ధమై మెఱసిపోతున్నది కదా!

శర్మగారి రసఘుటికలవంటి ప్రాకృతగాథల అనువాదాలు పేరునకే అనూక్తులుకాని ఎంతో మౌలిక మహోన్నతి ఉన్నవే. అవి మెఱసిపోవుటలో జాతీయగీతాలు నీడచాటున కేగినవి.

అలాఅలా అల్లుకొనిపోతూ వచ్చిన ఈ జాతీయకవిత, ఆనాడు మననాట చేయితిరిగిన కవి నెల్లా పలికించినది. వచ్చిన కావ్యలత నెల్లా కులికించినది.

"నీచపు దాస్యవృత్తి మన
వేరవికారత మాతృదేశ నే

వాచరణమ్మునం దసువు
   లర్పణసేసినవారి పార్థివ
శ్రీ చెలువారుచోట, తద
   సృగ్గుచ్ఛులన్ వికసించి, వాసనల్
వీచుచు రాలిపోవగ న
   లెన్ తదుదాత్త సమాధి మృత్తికన్."

అని ఆక్రోశించిన వేదుల సత్యనారాయణశాస్త్రి హృదయం లోనూ ఈ భావమే అటు పొరలినది.

ఈ సుధాస్రవంతి అనంతంగా అన్నివేళలా, అన్ని రీతులా జనమనోభూములను ఆర్ద్రంచేసినదీ, చేస్తున్నదీ గనుక, ఒక్కొక్కరినీ, ఒక్కొక్క మలుపునూ తెలివిడి చేయడం ప్రస్తుతపరిమితికి మించినపని.

తర్వాతివారిలో ఉత్తుంగ సింహాపీఠిపై ఈ భావాన్ని పట్టాభిషిక్తం చేసినవారు తుమ్మల సీతారామమూర్తిచౌదరి, గుఱ్ఱం జాషువా మొదలైన గొప్ప కవులెందఱో ఉన్నారు. మఱీ మఱీ నేటి దాశరథిదాకా ఈ భావంతో ప్రభావితులై పలికిన వారెందఱో ఉన్నారు. ఆ ముచ్చటలు మఱొకచోట.

ఈ భావమంత ఉరవడితో పొరలిపాఱుటకు కారణం మఱొకటికూడా: మూడుముక్కలై ఉన్న ఆంధ్రభూమి ఏకంకావాలన్న జనవాంఛ 1913 న ఆరంభమైనా మొనమొన్నటిదాకా తీరలేదు. ఆంధ్రులెంత భారతీయ స్వతంత్రాప్తికై పోరినా, అందులోనే కూరుకొనిపోయినా తమ ఆంధ్రజాత్యభ్యుదయాకాంక్షనూ, తత్సంకేతప్రాయమైన విశాలాంధ్ర వాంఛనూ ఎన్నెన్నడూ మఱచిపోలేదు. అందుకే

జాతీయకవిత నేటిదాకా రాష్ట్రగానం చేసినది, చేస్తున్నది. ఎన్ని మార్పులూ, చేర్పులూ కొనసాగినా ఈ శాఖలోని ముఖ్యలక్షణాలలాగా అనుస్యూతములయ్యే ఉన్నవి.

గురజాడదారి వెనువెంటనే చీలినది. రాయప్రోలు ఛందోరీతుఃలో అటూ ఇటూ మార్చినా యతిప్రాసలు పాటించడం, గ్రాంథికరూపాలనే గౌరవించడం, నిరాడంబరతకు కాక సరళతకుమాత్రమే ప్రయత్నించడం ప్రధానంగా పెట్టుకొన్నారు. ఆయన చేసిన మార్పులూ అవీ భావకవిత్వ ఘట్టంలో చూతామని ఇట ఈ శాఖవఱకే ఆపినాను.

ఈశాఖ తర్వాత అనంతంగా ప్రవర్తిల్లినా, వర్తమాన సాంఘిక దుర్నయప్రతీకారంగా పలుకుట తగ్గించుకొన్నది. ప్రాచీన ప్రభవ ప్రాభవ వర్ణనా ప్రవణతా, మఱీ తర్వాత నినాద మేదురతా పెల్లుబుకగా ఈ దారి కృతకప్రాయమయ్యేనా అన్నంతదాకా వచ్చినది. తొలిపాలు విశాల విస్తృతార్థంలో దేశమానవప్రేమతో పులకితంకాగా, క్రమక్రమేణా కొన్నితావుల, వెనుకటిదెల్లా వెన్నముద్ద అన్నట్లు వెనుదిరిగి చూచుకొన సాగినది.

ఈ విశాల ప్రేమభావమే మఱొకచుట్టు తిరిగి మధురాతిమధురభావ శబలితమై మఱొక శాఖగా నన వేసినది. ఆ అంకురం భావకవిత్వమై విరగాసినది.

## భావకవిత్వం

ఒకే సమయంలోనే వెలువడినా, ఒక్కొక్క ధోరణి ఒక్కొక్కరకంగా మాత్నతను సాధించుకుంటుంది. పరిపరజీవవ

ప్రభావ ప్రభావితమైన హృదయం ఒక్కొక్క లక్ష్యంతో ఒక్కొక్క దానిని తన ప్రకృతిని కొనసాగించుకుంటుంది.

గురజాడమార్గ మలా ఒకతీరున దారితీయగా, అదే సమయంలోనే రాయప్రోలు సుబ్బారావుగారు మఱొక్క దారిని సరిజేసుకున్నారు.

అంతదాకా ఉన్న పచ్చిసింగారపు పోకడలూ, అచ్చొత్తినట్లున్న ఒకే వర్ణనలూ, ఒకే విరహం, ఒకే ముగింపు ఇలానడుస్తూవచ్చిన ప్రబంధాల పిడపకాలం లోని కుక్కమూతి పిందెలపై తిరుగుబాటుగానే ఈయనా గొంతు విచ్చినాడు.

పాశ్చాత్య సాహిత్య పరిచయ పాండిత్యాలూ, వంగ కవితా భంగిమలూ, మననాల ముమ్మరంగా అలముకొన్న రాష్ట్రాభిమానమూ, వర్తమాన సాంఘిక సమస్యలూ ఇవే రాయప్రోలునూ కదిపినవి. గురజాడ వారి మానవప్రేమనూ, తోడివారిని బాగుపఱచవలెనన్న మహద్యత్నాన్నీ మనసున ఉంచుకొని, తన కవితను కేవల ప్రాచీనపద్ధతికి భిన్నంగా, జానపదకవిత అంత నిరాడంబరం, నిర్మలం కాకున్నా అంత సులభసుందరమైన పద్ధతిని మలుచుకున్నాడు. ప్రబంధ శిల్పాన్నీ వస్తువునూ కాదన్నా, భాషాచ్ఛందోరీతులలో పూర్వ మర్యాదలను మన్నించినాడు. ప్రేమను తన మూసలో పోసుకొని, నిష్కామ ప్రేమ రూపులైన పాత్రలను పోతపోసుకొని, ఆనాటి స్త్రీ దుస్థితిని—మఱొకతీరున ఆమెను దివ్యమగా చూపుటద్వారా—తీర్చుటకై యత్నించినాడు.

"మనసుచే, వాక్కుచేత, కర్మంబుచేత
కలుషితములు కాదగని నీ వలపు అవని
తపసుచే, ఆత్మచే, ధ్యానధారచేత
లీనమై ఐక్యమీయజాలినది ప్రేమ."

... ... ...

పరమ ధర్మార్థమయిన దాంపత్యభక్తి
స్తన్యమోహనమయిన వాత్సల్యరక్తి
సాక్షిమాత్ర సుందరమైన సఖ్యసక్తి
పొందు నాదిమమగు ప్రేమయందె ముక్తి."

ఇలా ప్రేమతత్త్వాన్ని వివరించే 'తృణకంకణం,' వస్తు కవితగానే ఆరంభమైనది. పదచిత్రాలూ, భావస్ఫోరక సంకేతాలూ, శిల్పమూ దీనిని భావకవితకు చిహ్నం చేసినవి.

"కలశభాంగీ పయోధర కుసుమమందు
మోహమధువె గవేషించె మున్న సుకవి. ... ..."

అని గట్టిగానే చెప్పి, మోహాభిన్నమూ, ఆర్ద్రభావప్రపూర్ణమూ అయిన ప్రేమను ధ్యేయంగా భావించినాడీ భావకవి.

"నా విరహగంధగీతి కన్వయము చెప్ప
శిరసులెత్తుచున్నవి చిన్నపాదలు;
నవ్వుచున్నది కడలి నందంపుసంజె
కావిరంగుల రంగైన మోవి విఱిచి."

అన్న పిలుపులో కవి ఆత్మాశ్రయమైన భావశబలతను కొత్త మేళవింపుతో నింపుకొన్నాడు. శిల్పంలో వస్తున్న విభిన్నత ఇప్పుడే మొగ్గతొడుగుతున్నవని తెలుస్తూనే ఉన్నదికదా !

ఈ కవిత కొన్నేళ్ళలో ఒకనిర్ణీత నిశ్చితరూపంతో తెనుగున నిలువర మేర్పఱచుకొన్నది. వెనువెంటనే మఱికొన్ని గొంతుకలు మఱింత విస్పష్ట విశిష్టతలను కల్పిస్తూ ఖంగున మ్రోగినవి.

నాయని సుబ్బారావు 'సౌభద్రుని ప్రణయయాత్ర'లో కొన్ని కొత్త రేఖలు తీరినవి.

"ఎచటనుండియొ అమరి నేగుదెంచి
మావిచిగురులతో బాటు భావకీసల
మాలను రాగిల్ల గీతమ్ములాలపించి కమ
కోర్కె యేమంచు ప్రకృతిపై కూర్మికాక"

"చిత్తమోహనమైన నీచెలువ మరచి
విరహవార్ధికి వంతెనవేయు నాస
తరువు తరువున గనులుంచి తిరిగి తిరిగి
మరచితినిగదె ఋతువుల మందలింపు"

క్రమంగా వస్తున్న మార్పు పసికట్టవచ్చును. హృదయ వీణా, జ్యోత్స్నాలతలూ, హృదయంపు మొగ్గలో భావి సుమంపుటాకృతులూ మెల్లగా మెఱుస్తున్నవి. "నీ నీడగలసి వెడలి ఆ యనంత దిగంతమ్ము లావరింతు" ననగలిగినాడు కవి. నవాషాఢజలదమాలలూ, మంచువిరియించు మనః కటాక్షాంచలాలూ మినుకుమినుకుమన్నవి. ప్రేమ కరుణా మూర్తిని గండరించుకొన్నది - ఆయన మాతృగీతాలలో

"ఎవ్వడా క్రూరకర్ముడు, డెవడు నీల
జలదనిర్ముక్త శైశిరశర్వరీ ప్ర
శాంత మలవాటుపడిన నిశాంతమందు
అకట నట్టింటిదీపమ్ము నార్పినాడు!!

అక్లే అబ్బూరి రామకృష్ణారావుగారిలో భావనాబలమూ, నిరాడంబరతా కూడా సమపాలుగ కలిసి బలిసి 'ఊహాగానం' వెలసినవి.

"రాలిపడియున్న దానిమ్మపూలతోడ
లొలయుచోటుల సాంధ్యవాయువులలోన
కనబడని భావముల సువాసనలకొలుకు
విసయమున బాల్యదృష్టినిల్పితి నొకింత
ప్రణయవతి ప్రేమమునకు పారమ్ము లేదు."

అతిసున్నితమైన నిట్టూర్పులా, అందమైన సుగంధమారుతంలా అలా తేలిపోయే గతులెన్నో యీయన వెలయించినాడు.

"వలపు నిండార విరసిన పారిజాత
కుసుమములు నేలరాలు వేకువలయందు,
ప్రసవశయ్యా పథముల నీపాదయుగళి
కదలెనో, నాదుహృదయమే కలతపడెనో?
కాని, పలుమారు నా కందరాని వస్తు
వేదియో దూరమునుండి యెలుగులెత్తు
పరిమళపరీతమైన నీ ప్రణయవార్త
భూనభోంతరాళమ్ములు పులకరింప."

ఈయనా ఒకవిధమైన నిర్మలప్రేమను నెమ్మదిగా క్రుమ్మరించినాడు.

"మోమున మోముజేర్చి నిను
ముద్దిడు కోరికలేదు, నీదు వ
క్షోమృదుశయ్యపైని శిరసున్
గడవాలిచి ప్రేలు మల్లికా

నాపు సువాసనా మధురిమల్
    పరికింపగ గాంతులేదు, నా
ప్రేమకు దారిజూపగ వ
    రించితి నా యలరింపు నెచ్చెలీ.”

ఇలా వృత్త, జాతి బద్ధరీతిని భావకవిత వగలుపోతుండగనే, గురజాడ ఆదిని నెలకొల్పిన నిరాడంబర గేయరీతిలో మహోత్తమ గీతాలు నండూరి సుబ్బారావు, బసవరాజు అప్పారావు గుండెలలో ఊటలూరినవి. వీనిలో గ్రాంథికం కాక, మామూలు తెనుగుజనం మాటలు, అందులోనూ మరీ పల్లెమాటల పొందికలు వెల్లివిరిసినవి. భాషా, భావమూ ఏకాండమైపోయి, భావమే ఏ వాహికా లేనంత సూటిగా మన గుండెలలో దూరునంత సున్నితమైనవి. పదాలబరువు కాకా, ఊహాల కఱువు లేకా సరసత ఒలికించిన వీ పాటలు.

అందుకనే ‘యెంకి పాటలు’ రాగనే రేగిన గాలి దుమారం నింగినీ నేలనూ క్రమ్మివేసినది.

నండూరి అనంతభావుకుడు; అనన్య సామాన్య మృదు హృదయుడు; బలమైన ఆవేగోద్వేగాలు ఆయన కైవసము లైనవి.

“పూలబాసలు తెలుసు
        యెంకికీ మల్లె
పూల మనసులు తెలుసు
        యెంకికీ ॥

పూల మొక్కాల నీటి
జాలుగని నిలుసుండి

పూలన్ని సిగపాటె
ఆలించె నంటాది ॥

పూలంటు కాలంటి
పున్నెముం దంటాది
వగలమారీ పడుసు
నగ దోడిగె నంటాది ॥

తెరలెత్తి పూపడవ
పరుగెత్తుతా వుంటె
దారెంట పూలొంగి
దణ్ణమిడె నంటాది ॥

పూలతో వియ్యాలు
పూలతో కయ్యాలు
మానల్లె నన్నుంచి
తానె పూ వానేసె !”

తాను మానుగాడుంటూ తనయెంకి పూ వవుతుందంటూ మన గుండెలను పువ్వుల్లా వికసింపజేసిన దిట్ట యీయన.

“ఎన్నెలంతా మేసి ఏరు నెమరేస్తోంది” అనీ, “ఏటి కడుపునదాగి తోట నిదరోయింది” అనీ ‘గుండె గొంతుక లోన కొట్లాడుతుం’దనీ అనగలిగిన కవి హృదయం మనలను కరగి నీరై పోజేస్తుంది. మననాటి పెద్ద ముత్తైదువలలో ఒకతైపోయినది యెంకి.

బసవరాజులో ఇంత సమ్మోహనశక్తి లేకున్నా, నిర్మల నిరాడంబరతలతో ఆయన కవిత నిప్పులా నిగనిగ లాడుతుంది.

"కోయిలా కోయిలా
కూయబోకే
గుండెలూ బద్దలూ
చేయబోకే
తీయనీ రాగాలు
తీయబోకే
తీపితో నామనసు
కోయబోకే."

అని ఆయన కవితను మనమూ నిలదీసి అడగవచ్చును.

వీరిద్దఱి పాటల మెలకువలూ, మెఱుగులూ బాగా ఆంగ్ల కవితావాసనా వాసితాలై, అనవసర ప్రాబంధిక ధోరణిని ఎంత కొత్త సీసాలలోనైనాసరే స్వీకరించక, గురజాడ దారిలోనిదే శిల్పమైనా, భావాలలో పూర్తిగా భావకవితా శాఖకు చెందినవే.

ఈ నిరాడంబరతా, ఇలా సూటిగా గుండెలో తాకే ధోరణీ తిరిగీ బాపిరాజు కలంలో కానవస్తుంది. ఆయన గేయాలలో శిల్పదృష్టికంటె, శబ్దచిత్రాముల పొంకంకంటే ఆవేశం, ఉద్వేగం ఎక్కువగా కానవస్తాయి.

"ఉప్పొంగిపోయింది గోదావరీ
తాను - తెప్పున్న ఎగిసింది గోదావరీ

కొండల్లో ఉరికింది కోనల్లో తిరిగింది
ఆకాశగంగతో హస్తాలు కలిపింది''

"ఓ పలనాటీ యెలమందా
కలవరిస్తావా జైలుకొట్లల్లో"

వగైరా లెన్నైనా ఉదహరించవచ్చును. ప్రేమలోనూ ఈయన వ్రాసినవన్నీ ఇంత నిరాడంబరంగానూ ఉన్నవే. తర్వాత తర్వాత యీయన "ద్వేషమేనా ముక్తిమార్గం..." లాంటి మానవప్రేమగానూ మార్చి అనేకం వ్రాసినాడు.

* * *

మఱి దేవులపల్లి కృష్ణశాస్త్రి అపూర్వ మధురరక్తిని స్ఫురింపజేస్తూ అవ్యక్తమనోజ్ఞ భావగీతాలను గానం చేసినాడు.

"ఆమె కన్నులలో ననంతాంబరంపు
నీలినీడలు కలవు, వినిర్మలాంబు
పూర గంభీర శాంత కాసార చిత్ర
హృదయములలోని గాటంపునిదురచాయ
లందు నెడనెడ గ్రమ్ము; సంధ్యావసాన
సమయమున నీపపాదపశాఖిశాగ్ర
పత్ర కుటిలమార్గములలోపల వసించు
నిరుల గుసగుసల్ వానిలో నిపుడునపుడు
వినబడుచునుండు; మఱికొన్ని వేళలందు
వాన కారుమబ్బులమెయి వన్నె వెతుక
దాగుబావ్పమ్ము లామె నేత్రములలోన
బొంచుచుండును''

బలీయమైన భావోద్వేగమూ, విశిష్టపదచిత్ర ప్రదర్శనమూ, కొంగ్రొత్తరీతులలో కట్టుకునే సామ్యాల సొంపూ ఈయనలో భావకవితకు నాలుగంచులూ తీర్చించినవి.

"నా నివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమా సుధాగాన మంజువాటి;
ఏనొక వియోగగీతిక, నేను నిదుర
వెన్నెలలదారి నొకరేయి వెడలిపోతి.

నొక విపంచీ విరహాకంఠ మొరసి యొగసె;
ఏనొక వియోగశాలి నీ హృదయరాగ
వేదనారేఖ; నాకలివేగు నామె
యంగుళీ కిసలయచంచలాంచలముల
విడివడి యనంత విశ్వావనబడితి నాడు.

అదిరియె మొదలేను సకల దిశాంతరాళ
మెల్లెడల నెందుకో పర్వులెత్తిపోవ
ఆ సమయమాదిగా నప్సరోంగనాను
రాగవీధుల, కిన్నరీ రమ్య కంఠ
సీమలో, శ్రావణాంబు దాశ్లేషపాలి
తారకాలోక పంక్తుల, మారుతోరు
పక్షముల తిరుగాడుదు రేయిపవలు,
కన్ను మోడుపు మెయి వాల్పుగాని లేక.

ఇది ముగియబోని యే యర్థ మెఱుగరాని
వేసటేలేని కట్టి యన్వేషణమ్ము;
ఈ ప్రవాసయాత్రారతి నిటులె నేను
కదలిపోవుదు నాకావకాశములను-

ఒక్క నిట్టూర్పు పోలిక, ఒక్క మాన
బాష్పకణమటు, ఒక గాథ వాంఛపగిది..."

ఈ రూపుతో విస్తరిస్తూ, వికసిస్తూ వస్తున్న కవితకు వేమల సత్యనారాయణశాస్త్రి రంగులుపూసి సొగసులు పొంగులు వాటించినాడు.

ప్రేమ పావిత్ర్యం, నిర్మమ నిర్మోహశీలిత్వంతో తృప్తి వడక, ప్రేమభంగం పెనువెతకాగా ఆక్రోశించే ఆనాటి సాంఘికవ్యవస్థలోని వేర్పాటులతో నలిగిన గుండె ఈయన గీతాలలో తేటపడినది.

"ప్రొంక్కిన కొలంది శాలితో ద్రొక్కుచున్న
యీ కఠినలోక మెల్ల బహిష్కృతమ్మ"

"నేనె మిగిలితి నీ గౌతమీనదీ ప
విత్ర గర్భంబులో ప్రోతవెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల శావృత్తి చెప్పుకొనక"

అని నిట్టూర్చినది యీయన కవిత.

"ఏ కడను మిన్కుమను చుక్కయేని లేని
యీ నభము క్రుంగి కమిలిపోయెడి విధాన
కారుమబ్బులెకాదు, చీకటులెకాదు
క్రమ్ముకొననిమ్ము కరుడులు గట్టనిమ్ము.
వలపుతీపి రెయుంగని వట్టి జాతి
గుండె లోకమ్ము నిప్పులు గుఱియనిమ్ము;
హృదయ మున్నంతవఱకు నా ప్రేమకాంతు
బ్రతికియున్నంతవఱ కేడ్చి బ్రతుకుచుందు"

ఈయన కవితాఖండాలలో – "మాలిక గ్రుచ్చ నెంచు ప్రేమాలసు లీవనిన్ జోఱ సనర్తులు..." లాంటి వానిలో రవీంద్రుని భావచిత్ర ప్రతిధ్వనులు బాహాటంగా ప్రవేశించినవి. ఆంగ్ల వంగ కవితారీతులను భావకవిత కొల్లగా గైకొన్నది.

ఇదిలా ఉండగా అటు దువ్వూరి రామిరెడ్డి కొంత ప్రాచీనపద్ధతివేపు మొగ్గుతూ, వస్తుభావనలలో నూతనతవేపు బారలు చాచుతూ వ్రాయసాగినాడు. కేవలం ప్రేమా, ప్రియురాలూ, తత్ప్రాప్తి రాహిత్యం ప్రేరేచిన వేదనాకాక, 'ప్రకృతీ' 'సమాజం' 'కృషీవలుడూ' తన్ను ప్రేరాయింపగా ఆయన కొన్ని మధురగీతాలను ఆలపించినాడు.

"ఆకలిచిచ్చుబాధ నగ
మైన యొడళ్ళను, నంటుడొక్కలుం
జీకటి చూపులున్, వెంఱప
జేసెడు పేలికగల్గి, జీవితం
బే కడగండ్లుగా బరిగ
యేరెడు బీదల వెళ్ళగొట్టి, చీ
కాకొనరించబోకు, వెలి
గా దల యాకటిమంట నీకునున్"

అని కృషీవలునికి నీతి గఱపినాడు.

"శ్రమలులేకయె ఫలములు దుమకబోవు
పిండికొలదియె రొట్టె, యోపినవిధాన
కష్టపడుము కృషీవలా కలుగుసుఖము
ఉత్త యాసలకన్న మే లుద్యమంబు"

ఈ ధోరణి ఒకవేపు తీవ సాగుతుండగా ప్రేమనే, మఱింత ప్రౌఢంగా పలుకుతూ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఆ రోజులలో గిరికుమారుని ప్రేమగీతాల నాలపించినాడు.

"ఈ శరత్పూర్ణిమా చంద్రికాసుధా వ
రీచిలోనున్న నేను, స్ఫారీభవ న్న
వీన శంపాలతాకృతి పూనియుంటి
ఈ సగము నావు నాకె కన్పించబోదు."

"ఈ ప్రణయ భావగీతము లివియు నీకృ
పాతిశయమున బూవులేనట్టిచోట
దావియును క్రొమ్మొగిలులేని తావునందు
శైశిర పృషత్పరంపర సంతరించు"

ఈయన యీ ప్రణయగీతాలతోనే తృప్తిపడక, అనేక ప్రాచీన సంప్రదాయజ్ఞతా స్ఫోరకములైన నవీన ధోరణులను నెమక సాగినాడు. 'శృంగార వీథు'లను సృష్టించుకొన్నాడు. వస్తుపూర్ణత భావగీతి కొక వింత సొబగును గూర్చునన్న ఆసగలవాడు.

"బొమలకదలిక తారకా భ్రమణరేఖ
అధరసంచాలనమ్ము, నేత్రార్థమీల
నమ్ము వీనిలో నేను జైన్యమ్ము నొంది
నిన్ను సుందరమూర్తిగా నెన్నుకొంటి"

ఆత్మాశ్రయ కవితను ఆధునికులవోలె కాక, అంతకు ముందటివారివోలె పలికించి 'మా స్వామి'ని మాట్లాడించినాడు. తెనుఁగుజాతిని మేలుకొలిపిన గీతాలలానే తెనుఁగు బిందువుల పోయగాన్ని కీర్తించినాడు.

ఈయన గేయ కవిత్వం కోకిలమ్మ పెండ్లి, కిన్నెరసాని పాటలలో రాటుదేలి పోటు హెచ్చించుకున్నది.

"పువుకన్నెలా జగా
రవ నవ్వులా, కిన్నె
రటు లూగి యిటు లూగి
చిటులుం కెరటాలతో
పెటిలుం కెరటాలతో
జవ్వాజవ్వన మూగనే తెలిమల్లె
పువ్వారువ్వలు పోయి నే"

"ఋతువుఋతువున మారు
రుచులలో కిన్నెరా
కారుకారున మారు
కాంతిలో కిన్నెరా
తెలుఁగు సత్కవిరాజు
పలు కందుకో లేని
చవులూరి చవులూరి
జలముల్ల ప్రోవులై
కదిలేను కిన్నెరా
సాగేను కిన్నెరా"

ఈ కిన్నెర సాగుతుండగా, కోకిలమ్మ పాడుతుండగా చింతా దీక్షితులు మొదలగు అనేకు లీ గేయభావ కవితను ఊటలూరించి తేటలు తేర్చినారు. ఇదొక బలపడిన శాఖగా క్రమంగా నెలకొన్నది. వీనికొక గభీరతనూ పవిత్రతనూ కూర్చి శ్రీకృష్ణశాస్త్రి మహతిలోనూ, తర్వాతి గేయనాటికల లోని పాటలలోనూ పసదేరినది.

ఇక ఈ భావకవితకు ప్రాపుగా నిల్చి ఈరోజులెల్లా పనిచేసిన సాహితీసమితీ సభాపతి తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి. సాహితి,సఖి,జ్వాలవంటి పత్రికలూ మహోత్తమమైన సాహితీసేవ నొనర్చినవి.

శివశంకరశాస్త్రి (స్వామి) బహుభాషలలో పండితులు; ఏ మంచినైనా ఆస్వాదించగల రసహృదయంకలవారు. చక్కని విమర్శకులు. అనంతంగా వ్రాసినవారు. ముఖ్యంగా పద్య గేయ నాటికలను రచించినవారు.

వీరి ఆసరా భావకవిత్వానికీ, సాహితీ సమితికీ చాల సాయపడినవి. సమితిలో ఆనాడున్న కవులందఱూ ఎందఱో కొందఱు విడిపోయినా కవిత్వా న్నొక ఉద్యమంగా భావించి అందుకై అనవరతశ్రమ చేసినవారు. అలాగే పైన పేర్కొన్న పత్రికలూ ఈ నవ్యకవిత్వ ప్రాచుర్యానికి అనంతంగా తోడ్పడినవి.

వీరి హృదయేశ్వరిలో నవ్వుల భావోద్వేగ ప్రభల కన్నా పాతకట్టడాలకు కొత్తగచ్చులూ, మచ్చులూ వేయుటకే ప్రయత్నం జరిగింది. ఖండికలలోకన్నా నాటికలలో వీరి ప్రాచీ ప్రతీచీ సాహిత్య పరినిష్ణాతృత్వం ఎక్కువగా కానవస్తుంది. అవియిక్కడ ప్రస్తుతం కావు. వీరి రచనారీతికి మచ్చు.

"ఆమె నవనీతహృదయ, నా యంతరంగ
కాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్మ, ప్రేమజీవన విభాత
కైశికీగీతి, నా తపః కల్పవల్లి.

ఆమె జగదీశ మకుటాగ్రసీమనుండి
యుర్విపై జారిన సుధామయూఖరేఖ
ఆమె మూడులోకాల కల్యాణమునకు
అవతరించిన యొక పవిత్రానుభావ
మామె నా జన్మజన్మపుణ్యములు పండి
ప్రాప్తమైన కేళీపరిత్యాగలీల
ఆమె పదసన్నిధాన, దివ్యస్థలాన
భక్తి నమ్రుడనై నిలంబడిన యపుడు
తలపునకువచ్చు, నా పేదతనము నాకు''

మఱొకవేపు పూర్వపద్ధతి పదిపాళ్ళకుక్కువకాగా, తత్కాలీన సాంఘిక దృక్పథం కొంతపాలు కలిసిన ఒక కవి ద్వితీయ కంఠం ఇంతలో వినవచ్చినది - పింగళి, కాటూరి కవుల కంఠం. 1923 లోనే రచితమై ''ఈ కృతు లనేకములు భావగీతములని. యిప్పుడు ప్రచారమునకు వచ్చిన కొత్త కవితా ప్రపంచమునకు జేరినవి'' అని కట్టమంచి రామలింగా రెడ్డివంటి విమర్శకాగ్రసరుని మన్ననలందుకొన్న వీరి 'తొలకరి' ఒక కొత్త గొంతుకను వినిపించినది.

ఆనాటి బలమైన ప్రధానభావమే తీసుకున్నపట్టుల లోనూ వీరి బాటవేరు, వీరి పాటవేరు.

'' నాటి నిశీథమందు, ములు
నాటిన పూవు పెదంద లోన, న
య్యేటి తరంగటన్ బొదల
యారమి గారు మొగుళ్ళజీకటుల్

గాటముగాఁగ నొంటి నటు
కన్నుల నీరిడు వేళ మింటిపై
దాటి తళుక్కునన్ మెరసి
తారతి వెవ్వరు నీవు చెప్పుమా ”

రక్తతిలకంలో అప్పుడే దేశభక్తి ప్రభావం పైకెగసి, వట్టి ప్రేమను ప్రక్కకు నెట్టినది.

వీరు తర్వాత తర్వాత ప్రకటించిన “సౌందరనందం” లో వస్తువూ, కథా కవితార్థయుక్తి ఆనాటి గాంధేయ ప్రభావ చిహ్నంగా, అనేకులవలె బౌద్ధయుగ వివరణ సేకరణాదులతో మేళవించి పలికిన క్రొత్త కావ్యం. భావకవిత్వం చాలకా, అంతకంటె బలమైన మజ్జోక పద్ధతికై బారలుచాస్తూ, ప్రాచీనతను త్రోసిపుచ్చజాలని బలవత్కవితాకాంక్ష ఇందులో క్రేళ్ళుఱికినది.

“ మిత్తి మొగమ్ము సొచ్చియును
మీకయి వెన్కకు నేగుదెంచి, యీ
యుత్తము రాలొసంగె దన
యున్, దనయున్; మఱి కైకొనుం డిదే
మిత్రప్రసాద మీ మిసిమి
మీఁగడలన్ దొలినాటి కూర్మి రే
కెత్తి యనాథ వత్సలత
కిమ్మెయి చూలయి పండు గావుతన్ ”

అన్న ఆశంసలో ఆనాటి ప్రేమను, కవిత మజ్జోకతీరున తీర్చుటకై పడుతున్న వెత ధ్వనిస్తుంది.

ఈ భాగం తుదికి సాగినకొల్లా అనంతంగా ఎంద తెందలో మొత్తంమీద భావగీతాలు ఆలపిస్తుండగనే, కొందఱు పూర్వ, నవ్య సమన్వయేచ్ఛతో అదోమాదిరిగా వస్తు భావాదులలోమటుకు కొత్తా, శిల్పంలో పాతా జోడించి కవితకట్టసాగినారు.

గుఱ్ఱం జాషువా ఈ తరహాలో మంచి మంచి కండా, చేవా ఉన్న కృతులల్లినాడు. ఫిరదౌసీ, గబ్బిలంవంటివి బహు ప్రకారాలా ప్రచారంలోకి వచ్చినవి. ఖండికలలోని వీ తెగకు మచ్చులు.

" అమవసనిశీథినీ సహస్రముల గూలి
పాదుషా పాడినాడు దుర్భరవియోగ
భావగీతాలు, అం దచ్చువడియె నేమొ
దేవి ముంతాజమహాలు నిద్రించుగోరి."

మఱి ఆ తుదిదశకే కొంత వెగటు జనించినదన్న సూచనగా భావకవిత్వంపై కొందఱి భావన లీయన పద్యా లలో వినవచ్చినవి. "ముగ్ధమోహ్మ ప్రణయమోహ్మ యని యుమ్మలికించెదవు నీదియున్ గవనంబా ? "

ఇక భావకవులలోచేరి వందలాదులు వచ్చినారు. కానీ వారిలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పిలకా గణపతిశాస్త్రి వంటివారికి కొకస్థానముడన్నది. వీరిలో ప్రాచీనతా సంస్కా రం బలంగా కానవస్తూ, కొత్త పదచిత్రాలూ అవీ తక్కు వైనా అందంగా వ్రాయడం అదొక స్థితికి గొంపోబడినది.

ఇలా నడచిన ఈ భావగీతాలగాలి పడమటివే పంతగా వీవలేదు. రాళ్ళపల్లి పెనుకొండకొండ తర్వాత పుట్టపర్తి

నారాయణాచార్యుల పెనుగొండలక్ష్మి గొంతువిప్పినది. "ఉలిచే రాలకు చక్కిలింత లిడి యాయుఃప్రాణముల్ వోయు శిల్పుల" గొప్పదనం ఊటలూరినది. అల్లే ఉమామహేశ్వరుడు, మూర్తి, ఆచార్యవ్రాసిన తొలకరి, క్రొక్కారు మెఱుగులు ప్రాతక్రొత్తలకు లంకెవేయ జూచినవి.

జాతీయభావ ప్రేరితమై హంపీక్షేత్రంపై వచ్చిన కావ్యం చక్కని ఆవేగంతో సహృదయుల తలలూపించినది.

మొత్తం భావకవితలో ప్రేమకు పట్టంకట్టారు. అందు కప్పటి అన్ని జాతులూ అన్యోన్యంగా ఆడామగా చదువు కొనటా అవి ప్రేమను స్వేచ్ఛా వరణీయంగా చేసినా, సంఘం అనుమతించని దొక కారణం కావచ్చును.

షెల్లీ, బైరన్ టాగూరు వగైరాల ప్రభావం ముకు బంటిగా ఉన్నది. అయితే అందలి తీవ్రత కార్యదీక్షకు కాక నైరాశ్య స్ఫూర్తికి తావలమైనది. ఖండికలు పెరిగినవి. ఆత్మాశ్రయ కవిత్వం ముందుకు వచ్చినది. శిల్పంలో, పదాలలో ఒక నిశ్చితముద్ర తయారయినది.

వీటన్నింటివల్లా, ఆరోజులలో మిగత శిల్పప్రభేదాలెన్ని వచ్చినా భావకవిత్వం, ప్రధానశాఖగా నిల్చినది. కవితా శిల్పం పెరిగినది. పువ్వులు నవ్వడం, మూగగుండెలు గొంతుకలో కొట్లాడడం, గాలి జాలిగా ఊగడం, చిమ్మటలూ చీకటులూ కప్పివేయడం ఇలా క్రొంగ్రొత్త భావాలకు క్రొత్త క్రొత్త పదచిత్రా లేర్పడినవి.

ఒక వేపు వృత్తాలూ సీసాదులూ ఉన్నా, మామూలు గీతాలకు, దేశీచ్ఛందస్సులకు, రకరకాల పాటలకు ఆదరువు చిక్కినది. పాటలైనా రాగతాళయుతములైన వానికంటె స్వేచ్ఛాగాన ఝురులే ఎక్కువైనవి.

కాని సంఘం ప్రేమను భంగపరిస్తే తానూ ప్రేమనూ, ప్రేయసినీ అంత పరమారాధ్యంగా భావిస్తే, ఆ సంఘాన్ని మార్చుకుందామనిగాని దాన్ని ఎదిరింతామనిగాని కాక, తోడి వారి హృదయ విహీనతను తిట్టుకొనడమో, నా శోకం నాకు చాలుననుకొని క్రిందపడినా పైచేయి తనదనుకోవడమో ప్రధానమై, వీరి నొకవిధంగా - వీరినందరినీ కాకున్న చాల మందిని - కళ కళకోసమే అనే వాదంవేపు నడిపించినవి.

కవిత తనకు, జనానికి మధ్య భావవాహికగా కాక అది తన హృదయాన్ని తనకే వినిపించే జిహ్వకగా చేసుకున్న ఈరకం కవి, తనలో తాను కూరుకొనిపోయి జనభావాలకు దూరమైనాడు.

ఇక రాను రానూ ప్రతికవీ నా హృదయవీణె తీగెలు తెగిపోయినవని అపశ్రుతులే ఆలపించసాగగా, అందులోనే తిరుగుబాటు ఎదురైంది. ఆ తిరుగుబాటు క్రొత్తకై నెమకక పాతవేపు తిరిగి మఱింత శిల్పభావవిస్తృతులను చేరదీసుకొని మంచి కావ్యాలు కొన్నింటిని పాడినది.

ఈ స్థితిలోనే మఱొక మార్పు కవితాలోకంలో రూపందినది.

# నిన్న : 1935 – 1952

## (క) అభ్యుదయకవిత్వం – అధివాస్తవికత

ప్రపంచం ఆధునిక వైజ్ఞానిక పురోగమనంవల్ల చిన్నది కాజొచ్చినది. ఏ మూల కామూల చతుస్సముద్ర ముద్రిత భూమండల మనుకునే తత్త్వం గతించి, విశ్వకుటుంబం వేరుపడ సాగినది.

ధనస్వామ్యం కేవలసామ్రాజ్య రక్షణతో ఆగక నియంతృత్వ స్థాపనకు దారితీసినది. 1929 లో ఆరంభమైన ఆర్థికసంక్షోభం మెల్లగా భారతభూమికి దిగుమతి అయినది. అటు జర్మనీలో ఫాసిజం తలయెత్తినది. ప్రపంచ పురోగామిశక్తులు స్పెయిన్‌లో నియంతృత్వ శక్తులకు మారొడ్డి నిలువ సంకల్పించినవి. ఐరోపా సాహిత్యరంగంలో చిత్ర విచిత్రములైన మార్పులు రా సాగినవి.

భారత జాతీయోద్యమం 1930 – 32 లో ఉవ్వెత్తున లేచి, తాత్కాలికంగా తలవాల్చినది. సోవియట్ యూనియన్ పురోగమనం విశ్వహృదయంలో ఏవో ఆశాంకురాలను రేపినవి; సామ్యవాద భావాలూ కార్మికులలో అశాంతీ, రైతుల నీరసస్థితీ – ఇవన్నీ కళవళపఱచినవి.

ఈ సమయంలో భారతజాతీయోద్యమంలో నిలిచి పోరాడిన యోధులలో కవులున్నారు, వారూ జైలులో చందమామనుగూర్చి కలలుగన్నారు. ఉద్యమసమయంలో

ఉదుకెత్తించిన "మాకొద్దీ తెల్లదొరతనమూ..." వంటి గేయాలను రచించిన గరిమెళ్ళ సత్యనారాయణవంటివారి గొంతుక కవితాసామ్రాజ్యంలో చోటు లేకపోయినది.

అయినా జీవితదుస్థితి జనాన్ని కలచగా, వారిలో భాగమైన కవులలోనూ కదలిక కల్గినది. విప్లవభావాలు విశ్వాంతరాళంలో తేలిపోతూ నలుమూలలా రాలిపడినవి.

ఆ సమయానికి తెనుగు భావకవిత దాదాపు నీరస స్థితిలో, కేవలం గతానుగతికరీతిలో కూలబడిపోతున్నది. 19:8 నుండి అంతదాకా వెలుగులుచిమ్మిన సాహితీసమితి వంటి సంస్థలూ, సాహితి, సఖివంటి పత్రికలూ ఈడిగిల బడినవి.

అప్పుడే హరీంద్రుని "షురూ హువా హై జంగ్ హమారా షురూహువా హై జంగ్" వంటి గీతాలూ, నజ్రుల్ ఇస్లాం విప్లవగీతాలూ, అంతర్జాతీయ కార్మికగీతం – ఇవన్నీ చెవులలో హోరెత్తించగా, తనచుట్టూఉన్న పరిస్థితులు కలతపెట్టగా నాటిదాకాతానూ ఒక భావకవిగానో, తత్తుల్యుడుగానో ఉంటూ అప్పటికే చేయిదిరిగిఉన్న శ్రీరంగం శ్రీనివాసరావు–శ్రీ శ్రీ–కొత్తగొంతుకతో కేకవేసినాడు.

> "మరోప్రపంచం మరోప్రపంచం
> మరోప్రపంచం పిలిచింది
> పదండి ముందుకు పదండి ముందుకు
> పోదాం పోదాం పైపైకి."

ఈ గీతం 1934 లో వ్రాసినా, ఈ కొత్తతీరు 1935 నుండీ

మనం లెక్కించవచ్చు. తర్వాత ఆ కంఠం ఎన్నెని గీతాలో ఆలపించినది.

"ఏ దేశచరిత్ర చూచినా
ఏమున్నది గర్వకారణం
నరజాతిచరిత్ర సమస్తం
పరపీడన పరాయణత్వం"

ఇది పాక్షికసత్యమే అయినా, అంతదాకా ఉన్న ధోరణికి తిరుగుబాటుగా వచ్చినది గనుక ఆ దూకుడు తప్పదేమో.

"దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అన్న తొలి భావం మసకబారి, కేవల ప్రాచీనతా వైభావాలకు నివాళిపట్టే జాతీయకవిత చాలకపోగా, తిరిగీ ఒక విధమైన ప్రబోధ కవిత అవసరమైనది.

"నాలో కదలే నవ్యకవిత్వం కార్మికలోకపు కల్యాణానికి" అనుకొని శ్రీ శ్రీ వ్రాయసాగినాడు.

నేటి బాధలలోని వేదనలేకాదు, ఈ బాధల నధిగమించి పురోగమించమనే లక్ష్యశుద్ధిని ప్రేరేచే కవితకావాలి. అదే అసలు కవిత్వ ప్రప్రథమరూపమని ఋక్కులనుచూచి మనం పోల్చుకొనవచ్చును. ఆ శిల్పం సమష్టి గాన భావనా రీతిని గోల్పోయి, సభామంటపాలలో, పురాణవేదికలలో నిల్చి చదివే వృత్తాదులరూపంలో పరిభ్రమించి, తర్వాత ఎవరికివారే చదువుకోగల ధనస్వామ్య యుగపు కవితగా మారి, కొసకు తిరిగీ సమష్టి గానాని కనువైన ఛందస్సును అలవరుచుకొన సాగినది.

ఒకానొక తూగూ, ఊగు, ఉప్పెనలాంటి ఆవేగోద్వేగాలూ పెనవేసుకున్న కవితలు వెలికివచ్చినవి. తొలి ఆత్మవిశ్వాసం ఇంకొంత ,ఉద్బుద్ధమైనది. ఉపమానాలూ అవీ మారినవి.

"నేనుసైతం ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను
నేనుసైతం విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను
... ... ...
నేనుసైతం భువనభువనపు
బావుటానై పైకి లేస్తాను."

కాని "బ్రదుకు ఛాయ చదువుమాయ కవిత కరక్కాయ సుమా" అని నిట్టూర్చిన తావులా రంగువేరు, రుచివేరు అయినది.

శ్రీ శ్రీ కవితలో పరిణతకీ, పరిపక్వతకూ నిదర్శనం "ఓ కవితా". నాగీతం గుండెలలో ఘూర్ణిల్లగ నాజాతి జనులు పాడుకునే మంత్రంగా ప్రయోగించాలని నిజంగా ప్రయోగించినాడు. వస్తువుకు తగిన పదభావ చిత్రాలూ, ఛందస్సూ నెమకి నెమకి దొరకబుచ్చుకున్నాడు. శబ్దశక్తి నెఱిగిన అత్యల్పసంఖ్యాకులైన తెనుగు కవులు కొందఱిలో ఈయన తొలివరుసలోనివాడు.

శ్రీ శ్రీ గర్జనలు ఒక్క ఉదుటున కవితాలోకంలో కొత్తవెల్లువను కొనివచ్చినవి. కాని ఈ నూతనతాకాంక్ష

చాలకాలం ఆయనను, మరికొందరను మాత్రమే పరిమితమై పోయినది. ఇదొక ప్రయోగశాలగనే ఉండిపోయినది.

ఆయన అంతతో ఆగక తనకలాన్ని కొత్త గిరికీలు కొట్టించినారు. సర్వసమతా వాంఛ, మార్క్సిస్టు భావధోరణీ ఇవేకాక, ఆయనలో యూరోపులో ముమ్మరంగా తొలికి వెలసిన అధవాస్తవిక ధోరణీ మొలుసూపినది.

ఇలా వినూత్న సిద్ధాంతాలు కవితలో కదలడం, వ్యావహారికవాదం గిడుగువారు దాదాపు సర్వసమ్మతం చేయగలగడం, ఇవన్నిటితో కలిసికట్టుగా అన్నిరకాలవారూ ఒక పరిషత్తు ఏర్పఱుచుకొనవలెనన్న ఆకాంక్ష వెలార్చినారు. సాహితీసమితి చల్లారిపోయెను గదా.

1934 వకే అభినవకవి పండితపరిషత్తుగాపుట్టి తదుపరి నవ్యసాహిత్య పరిషత్తుగా ఒక సాహిత్యసంస్థ రూపొందినది. ఈ సంస్థ నూతనతావబోధితులైన కవులందఱకూ, కథకులందఱకూ ఏకైకసంస్థ అయ్యేటట్టే కానవచ్చినది. అలా కొంత వఱకూ నడిచినది.

కొంపెల్ల జనార్దనరావు-గొప్ప భావుకుడూ, ఏకొత్త అయినా అందలి గొప్పను అర్థంచేసుకొని ఆస్వాదించగల వాడూ, కవీ అయిన ఈయన – ఆరంభించిన 'ఉదయిని', వారి హఠాన్మరణంతో ఆగిపోయినది.

నవ్యసాహిత్య పరిషత్తు ఆరంభించిన 'ప్రతిభ' కొంత కాలం చక్కని సాహిత్యపత్రికగా వెలసినది. గిడుగు సప్తతి తమ జన్మదినోత్సవాల సందర్భంలో వెలువరించిన వ్యాసా

వళులూ, గిడుగు రచనలూ మరికొన్ని ప్రచురణలూ ఈ పరిషత్తు, అందటినీ ఏకసూత్రంతో కట్టగల దనిపించినది.

కాని అలా ఎంతకాలమో సాగలేదు.

ఆకొత్త తిరిగీ అధివాస్తవిక ప్రక్రియగా మారిన తొలిరూపులూ శ్రీశ్రీలో కానవస్తాయి. అజ్ఞాత చైతన్యం లోని పదచిత్రాలూ, స్మృత్యవశేషాలూ నిలీనమై ఉండగా, వాని నలా ఏవో అవబోధనలతో, జ్ఞానభూమిలోనికి కొనివచ్చే ఈ పద్ధతిని, యథారీతిగాకాక కొన్ని తెనుఁగు మర్యాదలకు లోబడే ఈయన స్వీకరించినాడు.

"ఎక్కడాల్పా కప్పుకొని మా
ఇంటి కొచ్చిం దొక రివాల్వరు
బాధలో బెంజైన్ సీసా
ప్రేమలో డైమాన్ రాణీ"

"హాష్ హుష్ హుష్ హోష్
అని కేకలువేసి
కావ్ కావ్ మావ్ మావ్
అందాం గమ్మత్తుగా"

ఇలా వెలువడినది ఈ ధోరణి ప్రాసక్రీడలూ అవీ కేవలం వినోదప్రాయములుగానో, కొత్త ప్రయోగ మాత్రాలుగానో సాగినవి.

ఇలా ఈయన సవ్యసాచిత్వం తర్వాతి యువ, బాల కవులలో ప్రతిధ్వనించినది.

నారాయణబాబు వెనువెంటనే పలికినాడు – ఆ ధోరణులు రెండూ.

"ముష్కరులెవరో
తస్కరించిరి
ముండ్లగులాబీ
పూల నన్నిటిని
మాయంచేసిన వారిని
గాయంచేసే
రక్తసిక్తగా
త్రాశే తామే
తోడమంది
గాలిచెవుల
పోయమంది"

నారాయణబాబులో అంత భావనా, శిల్పం ఉన్నా ఆ పదాలమీాది అధికారమూ, ఆ శబ్దశక్తి వేతృత్త్వమూ అంతగా లేకపోయినది. శిష్లా అందుకుముందే 'రామనవమి చిలుక'వంటి వానిలో కొత్తతీరులు పోవాలని చూచినా, అవి ఆ మెత్తునకు ఎక్కలేకపోయినవి.

కానీ "గోడవతల చీకటి నవ్వింది. కిటికీలో దీపం కంపించె. ఊపెత్తిన వెట్టిపీరులా ఊగి, ఊగి సాగి, సాగి తెగిపోయిన రబ్బరుముక్క తెగటారెను" — వలె నారాయణబాబు కొత్త పదభావ చిత్రాలను ప్రచురంచేశాడు.

ఈ ధోరణిలో తిరుగుబాటుగా ఎన్నో కంఠాలు ఏవేవో పాడినవి. వానిలో గ్రంథంగా వచ్చిన సరికొత్త పూవు వంటిది పఠాభి "ఫిడేలు రాగాల డజన్"

"క్రాస్వర్డు పజిల్సులాగున్న
నీకన్నులను సాల్వుచేసే
మహాభాగ్యం ఏ మానవునిదోకదా"

"ఓ బోగముచానా
సంఘానికి నీవో
వేస్టుపేపరు బాస్కెటువా"

ఇలా ఛందోబందోబస్తులన్నీ పట్ పట్ మని తెంపి ఈయన అదొకవేపు లాగుకొనిపోయినాడు. పాలగుమ్మి పద్మరాజు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఇలాఎందరో ఈ ఛాయలో ఏవో కొన్ని వ్రాసినవారే.

జలసూత్రం వెక్కిరింత పద్యాలు - పారడీలు-చాలా వ్రాసి, ఆ శాఖలో తానొక్కడే మొదలూ కొనగా నిలిచిపోయినాడు. ఒకొక్కకవినీ ఆంతరబాహ్య లక్షణాలన్నిటా ఆకళించుకోగల నిశితప్రతిభ, సరిగ్గా అలా వెక్కిరించి విపరీతార్థం తేగల పదభావవివేచనా ఉంటేగానీ, ఈ రకం రచన అసాధ్యం. అలా చక్కగా వ్రాసి 'పారడీకవి' అయినాడాయన.

ఆ దారి అలాఉండగానే 1944 కు నయాగరా అన్న ముగ్గురి కవితాసంపుటి, తిరిగీ కేవలం శ్రీశ్రీలోని తొలి అభ్యుదయ ధోరణిని అంటిపెట్టుకొనే, నవ్యప్రయోగాలతో వెలువ

డిన శబ్ద భావచిత్రాల నిర్మాణంలోని స్వాతంత్ర్యాన్ని ఉపయోగించుకొని వెలువడినది.

"మానవ మేధస్సునకు
సంకెళ్ళను తగిలించిన
గత సాంఘిక శిలాశాసనం
పడగొట్టను
పగిలిన నా నిప్పులకంఠం"

అని రామదాసంటే,

"బంధీకృత ధనికశక్తి
పొగగొట్టపు భుగభుగలో
తెలతెలలై వెలవెలలై
పోతున్నది, వస్తున్నది
మహాశక్తి ప్రజాశక్తి"

అని ఏల్చూరి అంటే,

"పదిమంది స్వార్థవ్యక్తులు
పాలిస్తున్నారు మనల్ని;
ఓటులేదుగాని మనం
నూటికి తొంబైమందిమి;
వారిచేత కాకుంటే మనమే
ప్రభుత్వాన్ని నడుపుకుందాం"

అన్నాడు కుందుర్తి.

ఆ తర్వాత శ్రీ శ్రీ అభ్యుదయ కవిగా మాత్రమే ఆదర్శప్రాయుడై, అనేకు లాయనను . అనుకరించండతో,

అభ్యుదయ రచయితలసంఘం ఏర్పడడంతో ఈ శాఖ బలమైనదిగా తేలినది. నవ్యసాహిత్య పరిషత్తు జడమై అందులోని వారెందఱో ఇందులో - కనీసం సానుభూతితో - చేరినారు. సానుభూతులుగా చేరిన పెద్దకవు లెక్కువమంది అయినారు.

ఈ సమయంలో అనిసెట్టి, తిలక్, సోమసుందరం, రమణారెడ్డి, గంగినేని వగైరాలు చాలా చాలా వ్రాశారు. వీరిలో అక్కడక్కడా బలమైన భావనాశిల్ప సౌందర్యం కానవచ్చినా అభ్యుదయాకాంక్షా, జనక్షేమచింతా కానవచ్చినంతగా కవిత్వ స్ఫూర్తీ, దీప్తీ కనిపించదు.

అంతేగాక వరుసగా కవిత్వ సంప్రదాయజ్ఞతా, ప్రాచీనార్వాచీన కావ్యపరిచయమూ, భాషాపాండిత్యమూ ఇలాటి వానిలో రాటుదేరినరకం తగ్గి, కేవలం శ్రీ శ్రీ ప్రతిధ్వనులుగా మాత్రం నిల్చి, జనప్రేమ ముమ్మరంగా హృదిలో పొరలగా చనవద్యాలేకదా అని అనేకంగా వ్రాయడం ఆరంభించడంతో, పొల్లెక్కువై నెల్లు తక్కువై పోయినది.

ఉద్యమంగా వెలువడిన అతినూత్నసాహిత్య సంచలనం ఇటీవల అభ్యుదయసంఘమంటే తదనుయాయి వర్గాలూ, తత్సహాయబృందమే అయినది. వస్తువునకిచ్చినంత ప్రాముఖ్యం శిల్ప భాషాదుల కివ్వనందువల్లా, పాండిత్యం, ప్రాచీనార్వాచీన కావ్యప్రపంచంతో అనుదిన శ్రవణమననాది సంపర్కం- వీనికిఏమాత్రం యివ్వవలసినంత ప్రాముఖ్యం ఇవ్వనందువల్లా ఈ ఉద్యమం, కేవలంవీరేశలింగం మొదలు తర్వాత తర్వాత

వచ్చినవారి మహోజ్జ్వల యుగంలోని మెఱుగులను వెలిచూపి అటు వేపు దృష్టి మఱలించుటకు, భావకవిత్వ అంతిమదశలోని అవ్యక్తప్రేమ విధురగీతికలతో పల్చనైన కవిత్వంకంటే, బలమైన స్వాత్మాతిస్వాత్మ కవిత్వం అవసరమని నొక్కి చెప్పుటకు మాత్రమే పనికివచ్చినది. మఱి ఆ ప్రయోజనం సిద్ధించకముందే, రాజకీయ సంక్షోభం కారణంగా ఆ సంఘ కార్యకలాపాలు కుంఠితమై, వారిలోపాలు సరిదిద్దుకొనుటకు కూడా తగినవ్యవధి లేకపోవడంతో కూడా, అదలా ఆగి పోయి, కేవలం వ్యక్తిగతంగా అక్కడక్కడా ఒకేధోరణిలో అతిపేలవంగా ప్రతిధ్వనించే తీరుతప్పితే, బలమైన వెల్లువగా నిలువలేక, ఈ తుదిరోజులనాటికల్లా దాదాపు చల్లారి పోయినది.

అయితే ఈ అభ్యుదయ సంఘదృష్టితో, జనాన్ని విప్లవపథంవేపు నడిపించాలని గట్టిగా చెప్పడమే కవిత్వమన్న అపోహలేని కొందఱు, చక్కని సరికొత్తదారిలో అటు అభ్యుదయ వాంఛనూ ఇటు నవ్యకవిత్వ ధోరణులనూ తీసు కొని, మఱొక బాటవేసుకొన్నారు. అందులో ఆరుద్ర వ్రాసిన 'త్వమేవాహం' బైరాగి, 'నూతిలోని గొంతుకలు' మొదలైనవానిని పరిగ్రహించవచ్చును.

ఆరుద్ర అతివాస్తవికతపై మమతకలవాడు; అట్లే అభ్యుదయాకాంక్షి. అయినా, అలా వల్లించడంకాక కావ్యం వస్తుమాత్రంతో నిర్మితంకాదనీ, పదబద్ధమైన కవిత ఊరికే ఊడిపడదనీ నమ్మినవాడు.

ఇతను శ్రీశ్రీలోని రెండు ధోరణులనూ వంటబట్టించు కొన్నాడు. ఒకప్పుడు అధివాస్తవికత ఎక్కువై అయోమ యంలో పడినట్లు కానవచ్చినా తెప్పరిల్లుకోగలసత్తా ఉన్నదని నిరూపించుకొన్నాడు.

తనకు తెలియని శ్రామికుల మానసిక వేదనలు కాక, మధ్యతరగతివారి బాధలను వస్తువుగా స్వీకరించి చక్కని కవిత లల్లుకొన్నాడు.

కానీ మొదటి తెగవారికన్న శిల్పదృష్టి రాహిత్యం వలెనే, ఇటు శిల్పదృష్టి ప్రాబల్యం ఎక్కువై కొన్ని అర్థం కానీ, అవసగంలేనీ, అనేక స్వయంవేద్య స్వచైతన్యాగాధ నిక్షిప్త భావపద చిత్రప్రకటనల మరులుతో, కొన్ని పట్టుల కవితకు ప్రప్రధాన ప్రయోజనాన్నే వ్యాఘాతపఱుచు కున్నాడు.

“ నిర్దేశించిన భావాలను
వాక్యాలు బట్వాడా చెయ్యవు
పదేపదే వాగిన గ్రామఫోను రికార్డులుమాదిరి
మాటలు అర్థప్రేరణ చెయ్యవు
వికాఅలోకం సర్కసులోపలి
విద్య ప్రభుత్వోద్యోగాల త్రాటిమీద
పిల్లిమొగ్గలు వెయ్యదు
అధికారపు అయస్కాంత క్షేత్రంలో
విజ్ఞానం గడియారంలా తిరగదు
గణితం అధికాహారోత్పత్తి చెయ్యదు
ఎఱ్ఱకేపుల చవిటి నేలల్లో

స్వాతంత్ర్యం మొలకెత్తదు
కొత్తవేశవ క్లబ్బుగుమాస్తా ఇంట్లో
రొట్లో పచ్చడి నలగదు
కిరాణాకొట్లో షావుకారు అరువియ్యడు
చిరంజీవి మానవుడా
ఇది విష్కంభం"

ఇలాంటివానిలో కనిపించే మహత్తర ప్రతిభ

"చెట్లు చిట్టెలుకలు
కాకిమెడ నుసిరంగు
స్నో తెలుపు డ్యూ తెలుపు
చెట్లు చిట్టెలుకలు
చిన్న చిన్న చీమలు"

వంటి వానిలో కాస్త నంగీనత్తీవచ్చి తటపటాయిస్తుంది.

ఇదే సమయంలో ఈ రీతిలో బైరాగి (పుస్తక రూపంలో తర్వాత వచ్చినా) కొన్ని ఇతర ప్రభావాలతోనూ ప్రభావితుడై వ్రాసిన 'నూతిలో గొంతుకలు', ఇలియట్ మొదలైన వారిని అనుకరిస్తూ వినిపిస్తాయి.

"విస్మృతి వనని ర్జీవన సీమాక్రాంతం
నిద్రిత చైతన్య మిచట నిశీకాపరి
పొంచివున్న వన్యమృగం కానివ్వదు కథ సాంతం
గుర్రు గుర్రు మంటున్నది
పెనుచీకటి పొద కాదది
చెమటలు పోస్తాయి, చల్లబడుతవి
చేతులూ కాళ్లూ

గుండెలపై దెయ్యంకూచున్న బరువు
డొల్లబిందెలో ఎలుకలు
నగుర బెదురులేని దేవుళ్ళ
పీడకలలు తొంగిచూచి
ఏనుగుల కడుపు కరువు.''

... ... ... ...

''అనంతసాగరంలో విలయర్ఘంఝ
చిల్లిపడవ
కాళరాత్రి జీవితయాత్ర
ప్రొద్దు పొడవదూ కూచునేందుకు వీలులేదు
ఒంటరిగా ఒంటిరిగా మంటల్లో మంటల్లో
పయనిస్తున్నాడు నరుడు
తానెరుగని దిక్కుకేసి''

ఈయనలో భావన సాగినంతబాగా శబ్దసంచయ స్రోతస్విని సాగదు. చిత్రవిచిత్ర పదసంచయ సంబద్ధత ఏదో కొత్త జీరతో విన్పిస్తుంది. మానవ భవిష్యత్తుపై మహోత్తమ విశ్వాసంకాక, నేటి ఘాటు చాటు మాటలలో కాటువడిన జీవితం చూచి నిస్పృహతో, నిరీహతో గాలికి వదలిన గాలి పడగ బతుకనుకునే ధోరణి కవితను విద్రవుచ్చుతుంది. పాఠకులను ఇబ్బంది పెడుతుంది.

ఇదే ధోరణిలో కాక, ఆరుద్రకు చేరువగా కొత్తగొంతు వించినాడు అజంతా.

'' ఆకాశం కనబడనిచోట
చీకటి ఉరికంబంలా నిలుచుని

కాలం శవంలాగ వేలాడినచోట
నిశ్శబ్దంమీద నిశ్శబ్దంగా కూచొని
గాలిలో దీపాలమీద నాగీతం రచిస్తాను.
నాకు నిలయంలేదు
నాకు విలయం లేదు
నారూపం నా గీతం
నా లోకం నా సంగీతం"

ఇలా ఇటు నడుస్తున్న అభ్యుదయ, అధివాస్తవిక ధోరణులకు దూరం కాకుండా అటు, తెలంగాణాలో జాతీయ, స్వాతంత్ర్య, సమతా మహోద్యమాలతోపాటుగా కొన్ని కైతలు జోతలెత్తినవి.

దాశరధి, కాళోజీ ఈ కోవలో తొలిసారిగా అక్కడ ఈధోరణికి నివాళిపట్టినారు. దాశరథిలో కొత్తదనంకన్నా పాతదనం తర్వాత తర్వాత బలపడుతూ వచ్చినా (ఆ సందర్భంలో అది వివరిస్తాను) ఇప్పటి కాయన "అగ్నిధారను" ప్రచురించారు.

ప్రాచీన వృత్తాలూ, పద్యాలూ ఎక్కువగా ఉన్నా, అప్పటి జాతీయ ప్రబోధం అవీ ఇవీ చాలాచాలా కనిపించినా, కవి శిల్పంలో పాతదారే తోచినా వీనిలోని విశేషం, ఆనాటి తెలంగాణాలో ప్రజ్వరిల్లిన జనోద్యమ చైతన్యం ప్రతిఫలించుటే.

"ఇదేమాట ఇదేమాట
పదేపదే అనేస్తాను

ఖడంతొక్కి పదంపాడి
ఇదేమాట అనేస్తాను.

... ...

"జగత్తంత రగుల్కొన్న
క్షుధాజ్వాల వృథాపోదు
కోటిన్నర నోటివెంట
పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని
ఇదేమాట అనేస్తాను
వద్దంటే గద్దెఎక్కి
పెద్దరికం చేస్తావా

... ...

నీకు నిలుచు హక్కులేదు
నీకింకా దిక్కులేదు

... ...

దిగిపొమ్మని జగత్తంత
నగారాలు కొడుతున్నది
దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ దిగిపోవోయ్
ఇదేమాట ఇదేమాట
పదేపదే అనేస్తాను"

అంటూ ఈయన తెలంగాణా ప్రజానీకం ప్రతినిధిగా కంఠమెత్తినాడు. ఏమైనా ఈయన వచన పద్యాలకన్నా పద్యాలే నగారాల్లా మ్రోగుతాయి.

"నా గీతావళి ఎంతదూరము
ప్రయాణంబౌనో; అందాక ఈ
భూగోళమ్మున కగ్గి పెట్టెదను,
నిప్పులేవోని హేమంత భా
మా గాంధర్వ వివాహమాడెదను..."

ఇక ఈ [illegible] [illegible] వచ్చిన అనేక గీతాల వివరాలలోనికి పోవడం ఈ పరిమితిలో సాధ్యంకాదు. ప్రధాన ధోరణులివే. వానిని పరిశీలించుకొనుటే మన పరిమితి.

## (ఖ) పూర్వికులు

మఱి ఇలా ఈ ధోరణులు నడుస్తుండగా ప్రాచీన రీతులు మాసిపోలేదు.

శ్రీ గడియారం శేషశాస్త్రి 'శివభారతం' శివాజీకథను భారతంలా మలిచి మేలిమిలక్షణాలను నిలుపుకొన్న గొప్ప కావ్యం. అంతకు మునుపే రాణా ప్రతాపసింహ చరిత్రను శ్రీ రాజశేఖర శతావధాని విరచించారు.

మఱి ఇంకా ముందే అభినవ తిక్కన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి, గాంధీ ఆత్మకథను పద్యాలలో పొదివి ఈ విధమైన దేశభక్తి ప్రజ్వలన ప్రబోధక కావ్యరీతిని ఆరంభించినారు. శ్రీ ఏటుకూరి నరసయ్య అలుగు రాజాదులూ ఈ కోవకు చెందినవారే.

శ్రీ జాషువా తన సహజ శయ్యాసౌభాగ్యంతో ఈ విధమైన ఖండవస్తు కావ్యాలను విరివిగా వ్రాస్తూనేవచ్చినారు.

'కరుణశ్రీ' బౌద్ధధర్మ ప్రవచనమిషతో నాటి దేశభక్తి,మానవ కరుణాపునరుజ్జీవనం ఇలా కొన్ని లక్ష్యాలతో పాతధోరణి లోనే అనేక ఖండికలనూ వస్తుకృతులనూ విరచించినారు.

ఈ శాఖ వివరాలలో కొన్ని ప్రధాన లక్షణాలలో జాతీయ కవితారీతులకే మీదుకట్టబడి, ప్రత్యేకించి శిల్ప విశిష్టతలూ, భావనావదచిత్రాదులతో కొత్తరీతులూ గాక భావాన్ని సులువుగా, సుబోధకంగా, సుఖంగా వినిపించే పద్ధతిలోనే సాగినవి. వీని సంఖ్య చాలా చాలా ఎక్కువ.

ఆంధ్రరాష్ట్రం వచ్చుట కింత ఆలస్యంకారణంగా, స్వారాజ్యంవచ్చినా తత్ఫలితాల భోగానుభవం దూరదూరమై పోవుటవల్లా, జాతీయ కవితాశాఖ పూర్తిగా ఈదశ ఆఖరు దాకానేకాదు, తర్వాతా కొంత విరిసినదంటే చాలును.

ఈ సమయంలో ఈ ప్రాచీనపద్ధతిలో కేవలం వైరీతి కన్నా ఉదాత్తమైన, ఉన్నతమైన లక్ష్యంతో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అనేకం వ్రాశారు.

తమ శక్తియుక్తులన్నిటికీ సేవధిగా 'రామాయణ కల్పవృక్షం' ఆరంభించి చాలవరకు ముగింపునకు తేగలుగుతూ ప్రచురిస్తూ వచ్చినారు.

ఈ విశిష్టరీతి ఎందఱినో నూతనులను ఆకర్షించినది ఎందఱో వ్రాయనూ వ్రాస్తూవచ్చినారు.

అటు భావకవిత్వమూ మానక, పిలకా గణపతిశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు వంటివారు ఏకొందఱో రచనలు సాగించారు.

ఇలా ఈ దశ ముగియనప్పటికీ అటో ఇటో అన్న ఒక ప్రధాన శిల్పప్రక్రియకు పట్టంకట్టే పద్ధతి పునాదులు కదలి పోయినవి.

# నేడు (1953 - 1957)

## సంధిదశలో కవిత్వం

నలభైవేళ్ళ ఆరాటం పోరాటం తర్వాత ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. స్వతంత్ర దేశంకంటే స్వరాష్ట్రం తెచ్చుకోవడం తెలుగులకు బ్రహ్మాండమయింది. ఒక త్యాగి ఆత్మబలిదానం కూడా అవసరమయింది.

కానీ అదే లక్ష్యం కాక, సమగ్రాంధ్రంకోసం ప్రజలలో అలజడి బయలుదేరింది. అదీ సాధించుకున్నారు.

స్వారాజ్యంవచ్చి చాలాకాలమైనా తగిన ఉపాధి దొరకనివారూ, తిండీ బట్టా, గూడూ తోడూ లేనివారూ కటకట పడుతూనే ఉన్నారు.

కానీ ఏదో ఒకానొక సువర్ణయుగం రానున్నదన్న ఆశాప్రతిధ్వానాలు అంతటా వినిపించసాగినవి.

ఒకవేపు తిరిగీ హైందవ సంస్కృతినీ, ఆర్యధర్మాన్నీ ప్రతిష్ఠాపనం చేయవలెనన్న గతకాలావశేషాలు తల సూపినవి.

మఱొకప్రక్క జీవితాన్ని నవ్యంగా, భవ్యంగా, దివ్యంగా చేసుకొని తోడి ప్రపంచంతో ముందుకు సాగవలె నన్నభావం పొడసూపినది.

ప్రభుత్వం తన లక్ష్యం సామ్యవాద సమాజ స్థాపన మన్నది. పునర్నిర్మాణోద్యమం ముమ్మరమైనది.

ప్రపంచంలో యుద్ధ దవానలం ఏ నిమిషంలో చెలరేగు తుందోనన్న భయం విస్తరించింది. ఆశియా నిలువెత్తున నిలు చుని శాంతి నాశించింది. సోవియట్ వైజ్ఞానిక రంగంలో అద్భుతంగా ముందుకు సాగినది. ఈ లోకం కాదు, ఏ డేసు పథ్యాలుగు లోకాలూ మానవుని గమనాగమనాలకు లక్ష్యాలు కాగలవన్న ఆశ తొలకరించింది. యుద్ధోన్మాద మంత హెచ్చుగానే, శాంతిప్రియత ఎలుగెత్తి పంచశీల ప్రబోధించింది.

ఈ స్థితిలో సాహిత్యరంగంలోనూ సంచలనం కొంత హెచ్చుగానే తొలకరించింది. వివిధ శాఖలలో విరివి సెందా లన్న ఆకాంక్ష పాదుకొన్నది.

సహజంగా కవిత్వంలోనూ ఈ బహు భావశబలత పలుభంగులుగా పాదం మోపినది.

ఒక్క శిల్పప్రక్రియ కానీ, ఒక్క వస్తునియతి కానీ, ఒక్క ఉద్యమధోరణి అన్నది కానీ లేక, ఏదో ఒక సంధిదశలో పడిపోయిన కవిత, దొరికిన కొమ్మ నెల్లా పట్టుకొని, అందిన రెమ్మ నెల్లా ఆసరా చేసుకొని పైకెగబ్రాకవలె నని అఱ్ఱులు చాచినది.

నవ్య కవిత్వంలో మనం ఇంతదాకా చూచిన అన్ని రకాల ధోరణులూ అగుపించ సాగినవి; అన్నివిధాల శిల్పాలు ఆవులించి నిలుచున్నవి. అన్ని తరగతుల

కావ్యాలూ అంగలు వేసుకొంటూ నడిచి పంచకూళ్ళ కషాయంలా కుండలో కుతకుత మంటున్నవి; జీవితవైవిధ్య వేదన కవితను కలతపఱచినది.

ఈ పెనుసంతలో కనబడే వన్నీ పరికించడం గందరగోళంగా కానవస్తుంది. ఈ పెద్ద పరపలో అటూ ఇటూ వెడుతున్న కైతకన్నెలు లంబాడీలంగాల మొదలు, ఎత్తుమడమల పాదరక్షలదాకా అలంకరించుకొన్నారు.

ఏ ఒక్కటీ 'ఇదీ ప్రధానమైన లక్షణం ఈ నాటిది' అని చెప్పలేనంతగా మాఱిపోయిన కవితను, ఏది ఇందులో శాస్త్ర అడుగుమోపి నిలవదొక్కుకొన గలదో చెప్పగలంత దూరంలో కాక మఱీదగ్గఱలో ఉన్న కవితను, ఏ ఒక్క మహాధ్వనో వినరాగా దాని ప్రతిధ్వనులే వినవచ్చే స్థితిలో లేని ఈ కవితను — నేటి కవితను, అందులోనే ఉండి ఏదో ఒక కోవకు మొనుంపట్టవలసిన – పడుతున్న నావంటివాడే కాదు, ఏవంటివాడైనా నిర్మలంగా, నిరామయంగా, తూచి విలువకట్టడం సాధ్యంకాదేమో!

అయినా ఈ నాటి రకరకాల వైఖరులలోనూ కానవచ్చే ప్రధాన శిఖరాలను చూచి, కొన్ని ముఖ్యధోరణులివీ అని మనం కూడబలుక్కొనవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అలాంటి దెటూ తప్పదు.

తొట్టతొలిరోజులలో విరగాసిన దేశభక్తీ, దేశారాధన, ప్రాగైతిహాసిక పురుషుల సంకీర్తనం, జనప్రబోధం,

ఇవి తిరిగీ - వరుసగా కొంత కొంతగా నయినా - ముక్త కంఠంతో పలుకుతున్నవి.

ఆంధ్రరాష్ట్రం రావడంతో విశాలాంధ్ర కావాలన్న ఆకాంక్ష మఱింత ప్రజ్వలితం, ఉద్దీప్తం కావడంతో ఆ ఆకాంక్షకూ కవిత్వరూపమందినది. ఈ శాఖ తెలుగునాడున అంతటా పొటమరిల్లినా, తెలంగాణంలో కొంత బలమైన మొక్కలనే మొలిపించినది.

తొలినుంచీ 'నా తెలంగాణ కోటిరత్నాలవీణ' అను కొనే దాశరథి 'ముక్కోటి ఆంధ్రులనూ ఒక్క ముడి బిగించ మని' కోరసాగినాడు.

"నా తల్లి కృష్ణవేణమ్మ కన్నీరొత్తి
కొనుచు నాపై ప్రేమ మినుమడించె;
గోదావరమ్మ సహోదరమ్ముతో నాకు
ముఖమార్జనకు జలమ్ముల నొసంగె;
తుంగమ్మ తన పైట కొంగుతో నామోము
తుడిచి నిద్దుర చిన్నె లడిచి వేసె;
పెన్నమ్మ తన పయః పీయూషము నొసంగి
ఆకలిమంట చల్లారగొట్టె;
మూడు చెరగుల నేలల మూడుకోట్లు
ముడివడిన యట్లు కన్నుల ముందు తోచె;
అందలము నెక్కి యావ జ్జనాళి మెచ్చ
సుందరోషస్సు వచ్చె వసుంధరకును"

... ... ...

"కోటితమ్ముల కడ రెండుకోట్ల తెల్గు
టన్నలను గూర్చి వృత్తాంత మందజేసి
మూడుకోటుల నొక్కచో మఁడిబిగించి
పాడినాఁడ మహాంధ్ర సౌభాగ్యగీతి"

అన్నాడతను. దాశరథి మహాంధ్రోదయంలో మిగతఖండీ కలూ ఉన్నా అన్నిటా ఈ దేశభక్తి ప్రబోధం, జాతీయతా కాంతూ క్రేళ్లురుకుతూ కానవస్తుంది.

శిల్పిని పేర్కొన్నా, కాపయసేనానిని తలచుకొన్నా, మంగళగీతి పాడుకొన్నా, నటస్వామిని తఁదకు తలచుకొన్నా, అన్నిటా తననాడూ, తననాటి కోసం వెతపడే తన గుండే కానవస్తాయి.

అల్లే తొలినుంచీ ఆంధ్రవైతాళికులై గానంచేస్తున్న కవులందఱూ ఈ ధోరణి కావ్యాలు ఎన్నోకొన్ని ప్రచురించి నారు. తుమ్మల, జాషువాలే కాదు రాయప్రోలు, విశ్వనాథ వంటివారూ కొన్ని విసురులు విసరినారు.

ఇదే జాతీయశక్తి పునర్వికాసాన్ని సూచించేకావ్యం పుట్టపర్తి నారాయణాచార్యులు మేఘదూతమనేపేర ప్రచు రించినాడు. ఇందులో ఆంధ్రదేశ ప్రభావాన్ని వర్ణిస్తూ మేఘాన్నిమటుకే కాళిదాసునుండీ తీసుకొని మిగత తన నేలగా మార్చుకొన్నాడు. కేవలం ఖండికలలోగాక, ఒక వస్త్వైక్యం కలకావ్యంగా మఁలుచుకొన్నాడు,

అలాంటిదే మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారి 'ఆంధ్రపురాణం'. ఇక్ష్వాకుల నాటినుండీ తెనుఁగునేల

నేలిన దొరతనాలనూ, ఆనుషంగికంగా ఆయా రోజుల స్థితి గతులనూ వివరిస్తూ కాకతీయపర్వం వఱకూ రచించిన కవి ఒక గొప్ప కావ్యాన్ని సృష్టించగలిగినాడు.

ఇది పూర్తిగా చరిత్రనే అనుసరించినా, పదబంధ రచనాధౌరేయంతో పలికించిన పలుకుల మలుపులలోని వలపులతో కావ్యత్వం సాధించుకొన్నది.

"అవి యేనాటిపునాదులో నిలిచె
సంఘారామముల్ చెక్కు మా
యవు పెక్కుబ్దము లిట్లు దాటినను, స
ప్రాణంబు లౌనాటి శి
ల్ప విలాసోదయ కల్పనంబులను, స్నా
పప్రాత మీనాడు క
న్గవకున్ విందులు చూఱజూపు బహి
రంత ర్మాధురీ ధుర్యమై"

సి. నారాయణరెడ్డి నాగార్జునసాగరం ఈ కోవకు చెందినదే. ఇది చరిత్రనలాగే తీసుకొనలేదు. కాని ఆంధ్రుల పూర్వౌన్నత్యాన్ని చాటే నాగార్జునుడూ, ఆయన నివసించి, తొలిచి, మలిచి ఆంధ్రసంస్కృతి దర్పణంగా నిలపిన శ్రీ పర్వతప్రాంతం, ఆ స్తూపాలూ, అక్కడి జీవనం ఆధారంగా చేసుకొన్న రచనయిది.

ఛందస్సుమాత్రం మార్చినాడు. కేవలం వృత్త జాతులను వ్రాసే పద్ధతిని కాక, ఇందులో పూర్తిగా మాత్రా నియతిని పాటించి, సీసం, లయగ్రాహి, ద్విపదా ఎలాపడితే

అలా కొన్ని మాత్ర లటూ ఇటూ మార్చి తీర్చుకొనే వీలున్న సరణిని చేపట్టి, కొలదిమార్పులతో గేయకావ్యంగా వ్రాసుకొన్న కావ్యమిది.

ఇందులో జాతీయకవితా లక్షణాలే ముమ్మరంగా ఉన్నా, మఱి ఈ కవిలో సహజంగా అంతరానుస్యూతమై ఉన్న భావకవితాభిమానం, ప్రేమకథను కట్టుకొని ఆరోజులలో బౌద్ధభిక్షువుల ప్రణయగాథలలాంటివి వచ్చినవే వానిని తలపిస్తూ ఇది మొలిచినది.

ఈ శ్రేణిలోనిదే ఇంకొక పెద్దకావ్యం 'కృష్ణకథా విపంచి.' కృష్ణదేవరాయల కాలానికి చెందిన ఒక ఘట్టంతీసుకొని ఇందులో బాణాల రామకవి, విపంచి అన్న పేరునకు తగినట్లు ఆశ్వాసాలకు రాగాలపేర్లు పెడుతూ రచించిన కావ్యమిది. ఇది పూర్తిగా వృత్తజాతిబద్ధమే.

వీనిలోకెల్లా ఆంధ్రపురాణం విశిష్టమనవచ్చును. భావ భాషాప్రౌఢిమా, పరిపక్వతా, గభీరతా అందున చెంబులతో కాదు, బుంగలతో నించుకొనవచ్చును. నాగార్జునసాగరంలో సరళగమన శీలత చవులూరిస్తుంది.

ఇక ఈ చారిత్రక వృత్తాలమీదనే ఆధారపడకున్నా మహావాది వెంకటరత్నం విశ్వభారతిలాంటివి చాలావచ్చినవి. అవన్నీ జాతీయభావ బంధురములే. మఱి ఏదోఒక కథను అడ్డుపెట్టుకొన్నా నేటి సమస్యలనూ, దేశాన్నీ, సమాజాన్నీ మనసున ఉంచుకొని అందు కనుగుణంగా తమ జనారాధనాపరతను చాటుతూవ్రాసిన 'శబరి,' – భోగరాజు

చిట్టెమ్మ - వంటివి అనేకంవస్తున్నవి. అహల్యా గౌతమం, అరుంధతీ వసిష్ఠం ఇలాంటివే.

వస్తుకావ్యాలని వీనిని పిలిస్తే— ఈకోవలో ఈ నడుమ చాలా కదలిక కానవస్తున్నది.

అయితే పాతకథలను తీసుకొన్నా, కొత్తకథలను తీసుకున్నా కథా కథనమూ, కావ్యత్వమూ సమఉజ్జీలుగా నడప గల చాతుర్యం చాలవాటిలో కొరతవడిపోతున్నది.

ఇక విశ్వనాథ తొలినుంచీ వలేనే ఈనాటికీ అనేక వస్తుకావ్యాలనేకాక మహాకావ్యంగా రామాయణ కల్ప వృక్షం రచిస్తూనే ఉన్నాడు కదా! ప్రౌఢిమా, ఉదాత్తతా, ఉద్ధతీకూడాకల ఆయన కవనంపై తిరిగీ చెప్పవలసిన దేమున్నది ?

మఱి ఇలాకాక కొంతదాకా వాస్తవసమాజాన్ని చిత్రిస్తూ, బోయి భీమన్న రచించిన 'దీపసభ' కూడా జాతీయతా స్ఫోరకమే కానీ, అంతకంటే కొంతలోతునకు వెళ్ళి జన దైన్యావస్థను చిత్రించే కావ్యమిది. ఒక్కొక్క దీపం మట్టినూనె బుడ్డీ మొదలు, విద్యుద్దీపందాకా, తమకథలు చెప్పేసాకున తమపరిసరాల జనజీవితాన్ని చేప్పే ఈ పద్ధతిలో నవ్యత చాలాఉన్నది. అయితే ఛందస్సులో, కథనంలో ఆ నవ్యతను సాధించలేదు. పద్యాలలో సద్యస్ఫూర్తికీ, సరళతకూ ఇచ్చిన ప్రాముఖ్యం ప్రౌఢిమకూ, పరిపక్వతకూ, కాకువునకూ ఇవ్వలేదు.

ఇదే సమయంలోనే చాలా కాలంనుండీ ముక్తకంఠంతో కావ్యగానం చేస్తున్న జాషువా 'కొత్తలోకం' వచ్చినది. ఇందులో కవి తన ఆత్మావలోకనం చేసుకొంటూ ఎదుట కాన వస్తున్న జనగణ చింతనలకు అంగలారుస్తూ, అవేవీ లేని ఏదో ఒక విశుద్ధ సమాజస్థితిని కలలుగన్నాడు. పల్లా దుర్గయ్య "గంగిరెద్దు" ఒక చక్కని సాంఘిక కావ్యం.

నళినీకుమార్ అన్న నవకవి మాత్రాచ్ఛందంలో రచించిన "పణవిపణి" కవి ఆత్మకథా ప్రాయమై, ఆత్మపరి శోధనా ప్రాయమై అందాలుచిందుతూ అదో కొత్తదనంతో, కొత్తరకపు కథనపద్ధతిలో పోయిన ఆత్మాశ్రయ కవితకొక నూతనాకృతినిస్తూ వెలువడినది.

అల్లే ఈ దశలో ఖండకావ్యాలూ, ఖండకావ్య సంపుటులూ చాలా వస్తున్నవి.

వీనిలో ఒక వినూత్నదృష్టీ, విశిష్ట భావనా, విస్తృత పరిధీ కల సంపుటి నార్ల వేంకటేశ్వరరావుగారి 'జగన్నాటకం' సున్నితమైన సంస్కారం, ఉన్నతమైన అనుభూతి, ఉదాత్త మైన లక్ష్యశుద్ధీ, ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య వ్యాసంగ పరిబృంహితమైన వ్యుత్పత్తీ ఈ కవి కవితలో గుబాళించినది.

ఈ సంపుటిలో భావగీతాలు కాని భావగీతాలూ, అభ్యుదయ కవిత్వంకాని అభ్యుదయ కవిత్వమూ, నవ్యంకాని నవ్యాతినవ్య భావ పద చిత్రాలూ కానవస్తాయి. ఇదేం వక్రోక్తికేకాదు, కేవలం ఆయా శిల్పవస్తు ప్రక్రియలకు అంకితుడైపోనికవి స్వేచ్ఛగా తన ఊహాతుతగిన ఊళవేసినా డన్నభావం స్ఫురింపజేయాలనే ఈ మాటన్నాను.

"నింగి పందిరిపైవలె
నీగుండెలో
బొండుమల్లెలు పండించడానికి
కాటుక చీకటిలో
కోటీరమణి దీపాలోక
కోటి వెలిగించడానికి
పుష్యమో పునర్వసో
పూర్వాభాద్రో
నామధేయ మేదైనా
నక్షత్రాలే అన్నీ"

... ... ...

"గొట్టికి కాళ్లుంటే
పట్టెడు మెతుకులకై
అల్లాడే దీనుల
ఇల్లు చేరునేమో"

... ... ...

"విభావరీ ప్రభాతాల
ప్రత్యహ పరివర్తనలే
కీలకమా కాలోదధి
కావల నే మున్నదో"

ఇలాంటివీ కావ్యసంపుటిలోని వైవిధ్యవిశిష్టతలకు తార్కాణాలు. మన పరిమితిలో ఎన్ని చెప్పగలం? ఇక్లే వీరి సుభాషితరత్న భాండాగారంవంటి 'నార్లవారి మాట' ఈనాటి దృష్టితో అనేకపద్యాలను వేమనవంటి నిరాడంబర సహజ సుందరరీతిలో వినిపిస్తుంది.

మఱి 'నారాయణరెడ్డి గేయాలు', 'స్వప్నభంగం' వీనిలో నారాయణరెడ్డి క్రమక్రమంగా కాల్పనిక కవిత్వంవేపు జరుగుతున్నాడా అనిపించినవి. "పరులబాధ తన బాధగ, పంచుకున్నవాడే కవి, పరులసుఖంలో శిరస్సు పైకెత్తినవాడే కవి" అన్న ఉదాత్తత కలవాడు. కానీ పదాలూ, భావ చిత్రాలూ భావకవితను వదలగొట్టుకొనలేకపోగా, నిప్పుల కంఠాలమీదా, చీకటి ఉరిత్రాళ్ళమీదా మోజు కావలసినంత ఉండుటవల్లా, పాతే గొప్ప అనుకోని కొత్తతీరువల్లా ఈయన రానురానూ ప్రయోజన పరమలక్ష్య ప్రేరితమైన కవితవల్లే ఆశలున్నవి. (వీరి కొత్తకావ్యం కర్పూర వసంతరాయలు నాదాకా ఇప్పటికి—డిసెంబర్ 1957—రాలేదు)

దాశరథి 'పునర్నవం'లో ఆ ఆశ ఆశగాకాదు, అవతారంతాల్చిన మూర్తిగా కానవస్తుంది.

"కాలం నా కంఠమాల
నాపేరు ప్రజాకోటి
నాఊరు ప్రజావాటి"

అంటూ

"జలప్రపాతంలో వినబడు
విద్యుత్తు గుసగుసవలె
నా మనస్సులో ఏవో
భవిష్యత్తు మాటలు"

అనుకొంటూ

"ఇదే నా పిసరైన విజన్
ఇది శాస్త్రజ్ఞాని న్యూక్లియర్ ఫిషన్

కనిపించే దదే యుగాంతరం
సామ్యవాదపు మార్క్సుకార్టామీద
చేవ్రాలు చేశాడు నిరుపేద"

అనిపిస్తాడు.

ఈయనలో ఇంకాకొంత అనుకరణ ప్రియత కాకున్నా, అన్నిటినీ వాడుకోవాలన్న ఆత్రం కానవచ్చినా, స్పష్టంగా అన్నిటా ఒక హృదయం, కవిహృదయం కానవస్తుంది.

పల్లా దుర్గయ్య 'పాలవెల్లి' దండికండగలది.

ఇక కాళోజీ, పొట్లపల్లి రామారావు వంటి కవుల ఖండికలు నిర్మల అమాయకజన హృదయదర్పణాలవలె పరిశుద్ధ మూర్తులై ప్రౌఢిమా, వచోవాచస్ఫూర్తి కాక, గుండెను వాయి విడిచి చెప్పేపద్ధతికి చెందినవి-చాలావచ్చినవి.

అభ్యుదయకవుల ధోరణేకాక, ఉద్యమ భాగాలుగా ఉన్న ఒకరిద్దరుకవుల సంపుటులలో సోమసుందర్ తొలిదాని కంటే మలిదైన కావాళి పేలవమైనది. ఇంకా పత్రికలలో వస్తున్న సోమరసం సుందరకాండలో కవి కాస్త తేరుకుంటున్నట్లు కానవస్తాడు. రెంటాలకవితలో ఒకటిరెండు గేయాలు తప్పా మిగతవి పై అంతస్తు నందుకోలేదు. రమణారెడ్డి భువనఘోషలో ఏదీ నిశ్చయించుకోని ఒకానొక శిల్పవస్తు విస్ఫూర్తి ప్రక్రియ ఊగిసలాడుతూ ఉంటుంది. తర్వాత తప్పాలె మ్మనుకున్నట్లు వ్యాసాలు తెలిపినా, అందలి ఆంధ్ర వాఙ్మయచరిత్ర అన్న రచన మొత్తం సంపుటిని తక్కువ పఱచినది.

ఈ ధోరణిలోనే అనుకున్నా తర్వాతి అధివాస్తవిక ప్రభావంతోనూ మారి తీరిన కుందుర్తి ఆంజనేయులు, సరికొత్త కావ్యం "తెలగాణా" వచన పద్యరీతిలో వెలసి, ఇంకా ఈ పద్ధతిలో వాడుకోనవలసిన విలువ ఎంతైనా ఉన్నదనీ, ఇంకా అభ్యుదయ కవితఅన్నా అనకున్నా వాస్తవతా ముద్రతో, జనక్షేమ చింతతో దమనకాండను అదమాయించే చక్కని కవితా రావచ్చుననీ ఈ కావ్యం భరవసా ఇస్తున్నది.

ఆరుద్ర తిరిగీ అప్పుడప్పుడూ ప్రచురించే క్లర్కు సూర్యారావు జీవితంలోని ఘట్టాలలో పొక్కుకొచ్చినఘట్టం, ఆరుద్రీకరించిన ఆంధ్ర గుమాస్తా జీవిత కావ్యంగా ఉన్నది.

(ఇలా గబగబా వస్తున్న వానిని మనం పైపైకి కనిపించే ఉన్నత శిఖరాలనే చూస్తున్నా ఈ నాటి కవితలోని వైవిధ్యం, వినిర్దిష్టశాఖలో దేనిలోనూ ఇమడకపోవడం, ఏదో ఒక ప్రధాన శిల్పవస్తుయుగం రాజ్యంచేయకపోవడం గమనించవచ్చును.

అంతేకాదు ఏ శిల్పమూ కొత్తగా లేకున్నా, తొలినుండీ గురజాడ దారివేసిన నాటినుండీ, నేటిదాకా వచ్చిన నవ్యకవిత్వ దశలన్నిటా వచ్చిన మార్పులూ, చేర్పులూ, శిల్ప విశిష్టతలూ ఈనాటి కవితను మొత్తం మీద ప్రోది చేసినవనీ మనకు స్ఫురిస్తుంది.

(నవ్యకవిత్వం నేడు భావకవిత్వం కాకున్నా అందలి పదచిత్రాలను వదులుకోలేదు. అభ్యుదయ కవిత్వంకాకున్నా

అందలి జనక్షేమ చింతకు దూరంకాలేదు. అధివాస్తవికత కానున్నా అందలి భావప్రకటనా పటిష్ఠ లాక్షణిక పదస్ఫూర్తి సంయుతిని బహిష్కరించుకోలేదు. అన్నిటినీ జీర్ణించుకొని బలిసిన క్రొత్త కవితావనీ కమనీయలత నేటి కవిత.

ఒకానొక సమన్వయశక్తి ఏదో తనలో అంతర్గర్భితమై అంతర్వాహినిగా ఉన్న నేటి కవిత ఏదోఒక అపూర్వ సృష్టికై వేవిళ్లుపడుతున్నదని భావిస్తున్నాను.

# ఉపసంహారం

నవ్య కవిత్వాన్ని మనమొకసారి సింహావలోకనం చేసుకొన్నట్లయితే అంత దిగాలుపడిపోవలసిన అవసరం లేదని అనిపిస్తున్నది. కానీ అట్లని ఒకేరీతిగా ప్రగతి సాగుతూనే ఉన్నదనీ సంతృప్తి చెందలేము.

తొలి రోజులలో మహోత్తమ లక్ష్యంతో వెల్లువగా పెల్లుబికిన వికాసోద్యమం, వెనువెంటనే ప్రథమ సంగ్రామానంతరం శిల్పంలో, వస్తువులో మిక్కిలిగా విరిసి, విరియబారి నప్పటికీ ఆతర్వాత ద్వితీయ సంగ్రామం ముందూ వెనుకా కొంత క్రొత్త కండపుష్టిని, క్రొత్త రక్తాన్ని నింపుకున్నా స్వరాజ్యానంతరం కొంత నిస్తబ్ధత పొడసూపడం చిత్రంగానే కానవస్తుంది. అయితే తిరిగి ఆంధ్రరాష్ట్ర నిర్మాణానంతరం కొంత కదలిక కానవస్తున్నది; కొంత వైవిధ్యం, విస్తృతీ రూపొందుతున్నది.

తొలి రోజులలో వస్తువిషయంలో పూర్వమునకూ అప్పటికీ ఖచ్చితంగా భిన్నమైన మార్పువచ్చినది. రాజ కుమారుడూ కుమార్తే కలుసుకోవడం, వలచుకోవడం, విడి పోవడం, వేదనపడడం వెంటనే కలుసుకొని జంటపడడం అన్న తుదికాలపు ప్రబంధధోరణి పరాస్తమై పోయినది. వర్తమాన సాంఘిక దుస్థితిని రూపుమాపుటకై అందుకు తగిన కథలను, గాథలను కొత్తపోహళింపుతో కూర్చిన రోజులవి. పెద్ద కావ్యాలుకాక చిరుకబ్బాలు వెలసిన దినాలవి. పాశ్చాత్య సంస్కార సంపర్కంతో మంచిని పంచుకొన్న కాల మది.

తర్వాతనూ సాంఘిక సంక్షేమాకాంక్ష, జాతీయభావ ప్రబుద్ధీ వస్తువైనా, కేవలం అందులో ఒకనొక ఆర్ద్రభావం ప్రేమగా నెలకొన్నా, రానురాను యువతీయువ ప్రేమగా మాఱి, ఆ ప్రేమభంగ జనిత వేదన పుంజుకొని చెప్పరాని నైరాశ్యం తొణికిసలాడినది.

ఆ దశ పోగానే మహోద్ధతితో జనబాధాగాధాలహారిని ఆలపిస్తూ, అంతతో ఆగక అదోముందున్నది స్వర్గం పదపద మని ప్రోత్సహిస్తూ, రేపుమీాది రేపుమీాది రెక్కలు ముడు వకుడని జనాన్ని ఊఱటచెందిస్తూ కవిత, పంచమస్వరంలో పలికినది.

కానీ ఈ దశాంతంలో ధ్వని మఱీ బలమైపోగా, మిగతవన్నీ ప్రతిధ్వనులుగా బయలుదేరడంతో వైయక్తిక విశిష్టత తక్కువై, అచ్చుపోసిన ప్రబోధగేయాల సంతతి ముమ్మరంగానే వచ్చినా కవిత పుష్టిచెందలేకపోయినది.

తిరిగీ ఒకానొక సమన్వయ సాధనాదృష్టి, సంశ్లేష చింతాదృష్టీ బలిసి ఒక సంచలనం, ఒక చైతన్యం ఇప్పుడిప్పుడే తలఎత్తుతున్న సూచనలు బలంగా కానవస్తున్నవి.

ఇలా మనం విభజించుకొన్నప్పుడు ఒక దశలో మఱొకదశకు చెందిన పోకడలు లేవని కాదు. ఉండు టే కాదు బలమైన పాతపోకడలో వచ్చిన కావ్యమే మిగతవానికన్న మురుపు సూపనూవచ్చును. అయినా కవితా రంగస్థలంలోని ప్రధానపాత్రగా ఒకొకసమయంలో ఒకరీతి ప్రచురమవ్వ తుంది. అందుకనే అలా విభజించుకొంటాము. నేడు మాత్రమే అలా ఇదిఫలానారీతికి అంకితమైనదశ అని చెప్ప లేనంత వైవిధ్యం, విస్తృతీ కానవస్తున్నది.

అంతేకాక ఒకరీతి మఱొకరీతిలో ఏ మాత్రం కాన రాదనీ కాదు. ప్రవాహ సత్యం కవితా ప్రగతి. అందులో ఎప్పటికప్పుడు కొత్త కొట్టువచ్చినట్లు కానవచ్చినా పాత కలగలసి పారుతూనే ఉంటుంది.

అందువల్లనే నవ్యకవిత్వం తొలినుండీ నేటిదాకా వచ్చిన విశిష్టతలన్నింటినీ ఎంతోకొంత జీర్ణించుకొంటూ, ఒకే రీతికి చెందనివానిలో కూడ కొంత మార్పును తెస్తూ మొత్తం కవిత్వపద్ధతిలో ఒక నిరంతరాయ ప్రగతిసూత్రాన్ని అనుస్యూతంగా కనిపింపజేస్తూ ఉంటుంది.

అందుకనే నేడే వచ్చిన ప్రాచీన ప్రబంధ ఫక్కీలోని కావ్యంలోనైనా, మీరు నూరేళ్ళ ముందునాటి కవిత్వాన్ని గాక, తదనంతర సమాగతనైకరీతీ విశేషలక్షణాలూ కొన్నింటిని

చూస్తారు. కొన్ని కొన్ని అలా కనిపించే విడి లక్షణాలే కాక పదప్రయోగవిశిష్టతలో ఒక క్రొత్తదనం ఒక వేర్పాటు గమనిస్తారు.

కవి తన ఆవేగోద్వేగాలఅనంత విస్తృతినీ, గభీరతను చాటగల వాటమైన భాషకోసం, అనాదినుంచీ కృషిచేస్తు న్నాడు; ఎంతోకొంత విజయాన్ని సాధిస్తూనూఉన్నాడు. [కళవళపడుతున్నానని సూచించుటకు కడుపులో ఆవాలు పోసుకొన్నట్లున్నదనీ, గుండెల్లో కుంపటులు రగులుతున్నవనీ అనుకునే జనభాషలోని సౌకుమార్య సౌకర్యాలనుగమనించి, కొన్ని విచిత్ర పదబంధాలతో ఆ పదాల విడి టీకనుకాక, ఒకానొక విలక్షణ భావస్ఫూర్తిని ధ్వనింపజేసుకొంటూ కవి నవ్యకవితను నాలుగంచులూ తీరుస్తున్నాడు.]

నేడు జాలిగాలులే కాదు, పువ్వులు నవ్వులే కాదు, నిప్పులకంఠాలూ, అగ్నివీణలే కాదు, టూవే స్విచ్చులూ, వేస్టుపేపర్ బాస్కెట్టులూ, విద్యుత్తరంగాలూ అన్నీ ఉప యోగించుకొని తనభావాన్ని చెప్తున్నాడు కవి.

నత్తిమాట లుండవచ్చునని శ్రీశ్రీ వినోదానికనలేదు. నిజంగానే ఏ కవీ తన మనసులోనున్న భావన నంతటినీ పదాలలో వెలనాడలేడు. అందుకని ఆ భావచ్ఛాయనే సుష్ఠుగా, కొందఱు పూర్తిగా, దానిని వెలనాడవలెనని ఒక్కోసారి అస్పష్టతకూ అయోమయతకూ ఆస్కారమిస్తారు. అందువల్లనే అధివాస్తవిక పద్ధతిలోని కొన్ని మంచిలక్షణాలు మనకు నిల్చినా, పూర్తిగా ఆ అజ్ఞాతచైతన్య ప్రవృత్తిని కాగితంపై పెడదామన్నరీతి ఆ నాడే నశించిపోయినది.